


సంపుటం. ౧౭ విక్రమ, జ్యేష్ఠమాసము (జూన్ 1940) సంఖ్య. ౬

# ఆహ్వానము

శ్రీ బొడ్డు బాపిరాజు

ఈ యెలమావిమోక చివురెత్తిన చల్లనిపందిటన్, శ్రవః
పేయములైన తేనియలుపిండెడి కోకిల బాలగాయక
వ్యాయతమైత్రి క్రొత్తరుచులారగ జీవిత కావ్యనూతనా
ధ్యాయ ముపక్రమింత ముఁదా! దయసేయు మపూర్వశోభలన్.

స్మితనవమల్లికా మధురశీధువునం గయిపెక్కియున్న మా
రుత రసికుంపు మేల్ముసుగుద్రోయ త్రపారుణ సుందరానన
ద్యుతియగు ప్రత్యుషస్తరుణితో జతగూడి, సుధానినాద వే
ల్లిత పదకింకిణీ! అవతరింపు మధూత్సవరమ్యవాటికిన్.

రససిద్ధుల్ తమ క్రొత్తపూలపడవల్ సాగించి ఆనందమా
నసకాసారవిహారముల్ సలుపనున్నా; రందుకో లేము తా
మసమైనన్, అఘలంటనట్టి విరులంబన్నించు నీతెప్పలో
దెసలెల్లం బయనింపరమ్మ కవితాదేవీ! కళానర్తకీ!

---

# భావోపాసనము

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ఉదాత్తరచనమునకును, ఉత్కృష్టక్రియానిర్వహణమునకును భావశక్తి అనివార్యమైనది.

నిశితపరిశీలనమువలన, గభీరపర్యాలోచనమువలన, స్వాతంత్ర్యమువలన, నిశ్చలధ్యానమువలన, ప్రార్థనమువలన, అనుభవజ్ఞానమువలన, సంచితవిజ్ఞానమువలన, క్రమతపస్సువలన, అవిచలితమైన ఆంతరంగికోపాసనమువలనగాని భావశక్తి యలవడదు. దశేంద్రియములను వెన్నదిప్పజాలు సామర్థ్యము, సత్యసందీప్తమైన కాంక్షతో అంతరంగమును పరీక్షింపజాలు సామర్థ్యము భావోన్నతిని, ఆంతరంగికపరిణతిని అభిలషించువానికి మిక్కిలి అక్కరైనది. దమనము (Repression) కూడదని, అరిష్టదాయకమైనదని ఫ్రాయిడ్ (Freud) మున్నగు ఆధునిక మనశ్శాస్త్రవేత్తలు వచించిరి కదా! అయినను, మనసును క్రమపంథయందు నడుపుట కానిపని యని ఎవ్వరు ననజాలరు. ఇట్లది నడచినపుడే భావప్రపవని యగును. కన్నులవు నీళ్లువేసి, ముక్కును బిగించి చక్కని ప్రకృతికిని, తోడి సంఘమునకును సహస్రయోజనముల దూరమున స్థిరవాస మేర్పఱచుకొనుట మానవునకు తగదుగాని నిభృతస్థానమున అవిచలితశాంతిలో నాసీనుడై కొండొకవడి నిమీలితనేత్రుడై, అంతరంగగర్భాలయములోనికి తరలి, భావసామగ్రినందు సంచిత మొనరించుకొనుట ఈతని ప్రధానకర్తవ్యమని పల్కెదను.

భావశబలతకును, కావ్యసఫలత కార్యసఫలతలకును గల చుట్టఱికమును నేడ నేకులు సత్రింపకుండుటచే వీరి రచనములు ప్రభావలితములు కాక, వీరి క్రియలు శక్తియుక్తములు కాకయున్నవి. భక్తిజ్ఞానకర్మలొండొంటితో నొండు సహకరించినపుడే, శరీరమానసములతోపాటు ఆత్మకూడ శక్తి సంపన్నము కాజాలినపుడే, ఇచ్ఛాశక్తి చింతాశక్తి భావనాశక్తులు సమవృద్ధి నందినపుడే, మనోవాక్కాయములపొందు పెంపొందినపుడే మనుష్య జీవితము నిత్యము సత్యసందీపితమై, సౌందర్య సంశోభితమై, శివమ్మగు సర్మపథమున వెలయును.

ఆదర్శ జీవితమును కడపుటకై జిజ్ఞాసువు తపించును. జిజ్ఞాసగల మనసునరాలిన భావబీజములు అవలీలగ మొలకలెత్తును. ఇవి క్రమాభివృద్ధినంది కుజములగును; చక్కగ చిగిర్చి, సొగసుగ కుసుమించి, కనువిందొనరించు ఫలములను కనును.

ప్రతిభావంతుని చిత్తమునకు జిజ్ఞాస స్వతస్సిద్ధమైనది. దీనిపై నీశ్వరుడు ప్రత్యేకమైన చూడ్కిని నిలువంబెట్టును. అదృశ్యుడయ్యు, తానే కృపాళుడై, దీని ననుకూల సన్నివేశమున నిలుపును. కావున నీతని శైశవము చక్కని తొలకరి నందితీరును. లోనినేలపై పచ్చందన మపుడే పొడసూపును. మనసు నలరించు వానకారు వనకారులు జిజ్ఞాసువు జీవితమున వెలయును.

జగదీశుని వనమాలి యని యూరక వచింతుమా? అంతరంగమున బృందావనశోభను సృష్టించి, వినోదించుట వీనిపని. యమునా సరిల్లలామమువలె జాల్వారు మధుర మురళీరవము హృదయస్థవన వాటికలో విహరించి, పదపడి ప్రతిభావంతుని మాటలందు పాయపాయలై ప్రవహించును.

కంసునిబోలు కఠిన పరిస్థితులు మార్కొనిన నేమి? బృందావన సృష్టికి చేటురాదు.

బడబానలము సముద్రమును దిగ్మ్రింగిన మ్రింగుగాక, కుసుమవనము నవలోకించి, ప్రణమిల్లి దూరమునుండి ఎన్నిమాఱు లది తరలిపోలేదు? కీలకీల లెగ్లెగసిన నేమి? దుష్టకష్టము లెత్తైనను విజృంభించిన నేమి? సృష్టి కొకవంక నందనమును, వేఱొకవంక బృందా

వనమున లక్ష్మీశారద లట్లు శోభిలుచుండ దాని సౌందర్యమునకు మురుల నెట్లు దాపురించును? సుధాబంధురమైన సౌందర్య మనంతజీవి కాదా?

అనంతసౌందర్యసృష్టి, అమృతసిక్తమైన అంతరంగమునుండి ఆత్మప్రకాశము గావించుకొనును. దివ్యశక్తిగర్భితమైన ఆశయమునుండి ఈసృష్టి యుద్భవించునని మనము మఱువరాదు. ఈ యాశయ మెట్టి విత్తనమో యూహింపుడు. ప్రతిభాసమన్వితుని హృదయమున నిది ఏధనమందో, ఏమధుమయముహూర్తమందో, ఏధ్యానసమయమందో, ఏకఠోరానుభవమందో, ఏగభీరసమాధియందో, ఏతపోనిష్ఠయందో, ఏవ్రతదీక్షయందో (ఆయావేళలందే ఈతడు హృదయస్థకృష్ణునకు సన్నిహితుడై యుండును గావున, నీయామహూర్తములందే యాంతరంగికభువనస్వప్నాయములు నివ్వటిలుచుండును గావున) నీవిత్తనము నాటుకొనియుండును. క్రమగతి నిందు రంగారువనశోభయందు వ్రజవనితలు పోలు భావములుతోఁచి ఈతని రచనమున చిత్రమైన రాసక్రీడను ప్రదర్శించును.

లోనివనరములోపలనే ఖైదీయైయుండిన మనుష్యజీవిత మెట్లు కుసుమవిలసితమై, మధురఫలభరితమై, సౌందర్యప్రదీప్తమై యుండును? ప్రతిభకు స్వాతంత్ర్యము సహజము కావున సౌందర్యము దానికి (స్వాతంత్ర్యసౌందర్యములు కవల లనుఁడు) నైసర్గికమైనది. అనంతప్రతిభాభాసురుడైన సృష్టికర్తహృదయమందలి కోటికోటిక్రొన్ననలు ప్రకృతిదృశ్యములందు చిట్టితల్లులవలె చిఱునవ్వులను తళుక్కొత్తించుచుండును గదా!

భావము బెడ్డవంటిది కాదు. అగుచో నది అడఁగి మడఁగియే యుండును. పరంజ్యోతినుండి ప్రసరించు ప్రభాకలితకిరణము భావము! ప్రాణప్రదీప్తమై మహోజ్జ్వలమైన భావము అష్టదిక్కులను స్పృశించి, అనంతమైన మరీచికలికలను సర్వత్ర వెదజల్లి, అజాండమున అద్భుతమైన దీపావళీదృశ్యమును ప్రదర్శించును. సృష్టికర్తగుండెలోని సూర్యమండలమువలె ప్రతిభాశాలిమానసమందిరమున తేజరిల్లు వేయివెలుగుల చిత్రసృష్టికి దృశ్యము ప్రతిరూపమే సుమీ!

ప్రాణము బహుభంగుల నాత్మవ్యక్తీకరణము గావించుకొనును. వెలుగున, చలనమున, కన్నుదోయికి పండువు సేయు ప్రకృతిశృంగారమున మహిమోపేతరచనమున, ఉదాత్తక్రియాకలాపమున వివిధరీతుల నది ప్రకాశమగుచుండును.

ప్రస్తుతము మన దృష్టి నాకర్షించుచున్నది, ఆంతరంగికమైన వనలక్ష్మికదా! ఇది ప్రతిభావంతుని రచనమందును, వీరవరేణ్యుని జీవితవిధానమందును (ఈతడు కాజాలు ఆతడును, ఆతడు కాగలుగు ఈతడును నైదోడులే యగుదురు) ఆత్మప్రకాశము గావించుకొనును. దివ్యదృష్టి నందినవాడే విశ్వరూపమును విలోకింపజాలినట్లు, అపూర్వమై, ఆధ్యాత్మికమైన వెలుంగును తనకన్నులందు నందిన అదృష్టవంతుడే వాని రచనములోని బృందావనశోభను, వీని జీవితవిధానమందలి నందనసౌందర్యమును అవలోకించి, కడలేని ఆనందమున కలహంసయై ఈదులాడును.

తన్ను గుర్తింపగల మహనీయుఁ డెవ్వండును తోపకున్నను, ఈర్ష్యయును, క్రోధమును, విరోధకబంధులై తనను తారుకొనినను, రఘురామునిబోలు ఆధ్యాత్మికమూర్తము తనయందు విరాజిల్లుచుండుటచే నీవనరము అమృతజీవియై వర్ధిల్లుచునేయుండును. ఈ వనలక్ష్మి యింటిబిడ్డలు (సుమశోభితకుంజము లనుఁడు, ఫలవిలసితకుజము లనుఁడు) భవపరంపరలనుండి వర్ధమానము లగుచున్నవికదా!

భీషణవాతూలము కూకటివ్రేళ్లతో మహోన్నతములైన ఉర్వీరుహముల నూడబెఱికిన నూడబెఱుకు గాక, అమృతసేచనమున నెంతో కాలమునుండి హృదయస్థ దివ్యమూర్తికై పెరిగి పెంపొందువల్లరులనుగాని, ధరాజములనుగాని సోకనైన సోకంజాలదు. "ఘుమఘుమారావ ఘోరజీమూతపటల"మును తన పటాలము గావించుకొని, భీషణఝంఝానిలము వనమహీజముల నూడబెఱుకగలిగినది గాని వానియందు నద్దమరేయి జరించు దివ్యడింభకునిగాని, వీని సంపర్కమున నాధ్యాత్మికమైన సుందరసత్త్వ మందిన విప్రబాలకునిగాని గటిచయపులతో శోధింపజాలినవాని

ప్రతిభ జిజ్ఞాసువుయొక్క తపఃఫలమే యైనను, సందెలోని వనమాలి జగదీశుడేయైనను, ఉద్యానవృద్ధిని ప్రరికొలుపు నిమిత్తములు అవ్వలినుండి విజృంభించెను. శక్తృప్తగ్రంథపఠన మనుడు, ఆచార్యప్రబోధ మనుడు, ఆదర్శదృష్టాంత మనుడు, సన్నిహిత సాంగత్య మనుడు, స్థలసంపర్క మనుడు, భావబంధురసంఘ ము లనుడు, — ఇట్టినిమిత్తములు, ఇవి నైసర్గిక ప్రతిభను, సహజప్రజ్ఞను లేపును. స్వతస్సిద్ధమైన శక్తి ందు లేదో, ఏ హృదయమున తపఃప్రభావాభావము తన నమ్మృదజీవిదైన సృష్టిసూత్రము నిహితమై యుండలేదో, దానిని భావగర్భితములైన నిమిత్తము లెన్ని స్పృశించినను, చచ్చినగొడ్డువలె నది పడియే యుండును. దేవదూతలు స్వీయ హృత్కంజములందు స్వర్గవిభూతి నిడికొనిరే, మనుష్య హృదయ కవాట మును తట్టెదరు. తపసు తెలుగని హృదయము తన్ను తాను సుగ్రహించుకొనజాలకపోవుటయగాక కట్టెదుటి క్తినిగూడ గుఱుతింప లేకుండును. కావున తనకవాట మును బంధించియే యుంచును. కటికిరాలప్రెవాల చంద్ర రణము లెంత చక్కగ నృత్యము సలిపినను, అవి రగునా? నవవర్ష జలధరములు ఎంతసేపు ఉఱిమిన నేమి, కోడిపుంజాలు నృత్తక్రీడల దేలునా? చంద్రిక ందలి సందేశమును గుఱుతించి, తన్మయభావమున దగజాలునవి సంచితతపశ్శక్తిని సుందెలం దిడికొనిన చంద్రకాంతశిలలే! గంభీర మేఘనినదమందలి గభీ రార్థమును గ్రహింపగలుగునవి ఆశ్రమసంపర్కము వలన, తపోధనుల సఖ్యముకతన, దీక్షాజీవితమున కల డి, సంచితప్రతిభకు నిలయములైన హృదయములతో నెలయుబర్హి సంఘములే! ......దుష్యంతునిఆగమనము శకుంతలనే కాదు—ఆమె సమీపమున పురు లెత్తియాడు మయూరములనుగూడ నలరించినది. కూపుచూపులందు మునికుమారకును, కణ్వ మునీంద్రుని అంతేవాసినులైన శుకి మూకలకును స్వతాపములున్న నేమి? తపశ్శక్తియం దెట్టిభేదము లేనందున నంతరంగములందు తారతమ్యములు లేవు. ఆమెవలె నివియును భావోపాసనమున సాటిలేనివి. కావుననే గుణసౌందర్యమును చక్కగ గుఱుతించి, సంతింతనరాని ప్రమోదముతో భావమయమైన ఆశ్రమ హృదయములోనికి రాజన్యునకు స్వాగత మొసగినవి. దేవభామినీమణులవలె నెమలి నెలంతలు నృత్యము సలుపుచు నాతిథ్యమునకై ఆయితము సలుపుచుండ, శకుంతల—చెలిమికలిమి నందిన శకుంతలములు కుంజ వాటికలనుండి నిండుసంతసమున చెవులపండు వొన రించుచు స్వాగతగీతికల నాలపించినవి. పండుముత్తైదువులుపోలు వృద్ధపాలములు ఫలవిలసితములైన హస్తములను ఇంటియల్లుడు కానున్న రాచనున్నదెస జాపినవి. పశుచుపిల్లలవలె వఱలు పూలవల్లరులు, బావను చూచి కులుకు మఱదండ్రలీల, మిసల నలరుచు రాజచంద్రుని ముఖచంద్రునిపై విరులు చల్లినవి. సౌందర్యోపాసనకతన సౌందర్యసందీప్తములై, సౌందర్యముపై కన్నిడి, సౌందర్యప్రదీప్తాంతరంగము లతోని పెట్లు విలసిల్లినవో యోచింపుడు. భావప్రవతము కతన, పరమాత్మనోపాసనమువలన నెట్టి సహాకార మెట్టి సఖ్యము నింపొందునో గ్రహించితిరా? ఆహా! ఆశ్రమవాతావరణ మెంత మహత్తరమైనది! ఉదాత్త భావసంసిక్తముకాని వస్తు వెద్దియును మునికూటిలో నుండదు. మునిపదాంకములను మాపులగొని ఎన్నెన్ని వృక్షవాటికలు ఎందఱెందఱు తపసులకు యాత్రా స్థలములు కాలేదు? వీనికతననేకదా మనయారణ్యములు ఆరణ్యకాదిమహిత గ్రంథములకు పుట్టినిండ్లై, మహిత భావశరణ్యములై, ముముక్షువుల చేమోక్ష్యల నందినవి! ఆశ్రమస్థప్రత్యణువును పరికింపుడు. మార్తికములో నొప్పు శుక్తిలీల నొక్కొక్కయణువు చక్కనిభావ ముతో వెలయును. రమ్యాశ్రమభూములందు జనించి భాసుర భావభాసమానాక్షరముల నం దవలోకించి, గ్రక్కున ముక్కులతో గింజలశేతికొను కుక్కుటముల కై వడి చివాలున మనసులగై కొని, ప్రతిభాశాలులైన కవి కుమారులు కడుమోదమున తమకౌశ్యములందు ఖచి యించుచుందురుగదా! తపసు తెలుగక, ప్రతిభను కానక, మాధుర్యమును గ్రోలక, సౌందర్యమును గుర్తింపక, వనపశువులు దూరదూరముగ తొలగిపోవుచుంట గొన్ని వాఙ్మయములందు చూచుచుందుముగదా!

గుణమణిస్థగిత చరిత్రులైన ఆచార్యులవని గలరు. అమూల్య భావఖనులైన గ్రంథములును గలవు! మెఱపు

మందలి మలినమును చూపఱులమాడ్కులనుండి ఎంతో సేపు మఱుగుచేయజాలదు. కైలాసమువంటి స్వీయజీవితమునుండి, స్వీయానుభవమునుండి జాల్వారు భావజాహ్నవియే ఏరచనమునైన పుణ్యక్షేత్రము గావించి, పాఠకయాత్రికుల నాకర్షించును.

సౌందర్యమును, సత్యమును అర్ధనారీశ్వరుని బోలునవి. దివ్యమైన ఈ కలయికను వేఱుచేయు టెవ్వరితరము?

సత్యము నుండి సంబంధమును త్రెంచుకొనునది సౌందర్యము కాజాలదు. *ప్రత్యక్షానుష్ఠానమునకు సంబంధించినది సత్యమని వచించితినికదా! అనుష్ఠానము నుండి దూరస్థుడైన రచయిత తనమాటలం దబద్ధములనే మాటగట్టును. జాతీయములను విలోకించి, అలంకారముల నవలోకించి రచనాగుణమును నిర్ణయించువాడు వెఱ్ఱివెంగళప్ప యని వచింతును. వేదికమీది పైడిపూతను చూచి, అభినయమును గాంచి గుణవిమర్శన మొనరించువా డెట్టివాడు? అభాగినియై, పతితయైన పణ్యాంగన సీతపాత్ర నభినయించుట జూచి "ఈమె సీతమ్మయే!" యనువా డెట్టి విమర్శకుడు? అనుష్ఠానము వేఱు; అభినయము వేఱు; అనృతము వేఱు; సౌందర్యము వేఱు. తన తెలివితేటలం దబద్ధపు బ్రదుకును మఱుగుపఱచి, తనరచనలందు సౌందర్యాభినయమును ప్రదర్శించువాడు మెప్పులచే "ఓహో!" యనిపించుకొనగలడుగాని మతిమంతులచే గాదు.

ఇతడు దొంగ కావున నెన్ని తెఱగుల వంకర పనులకైన చేయి వేసికొనగలడు. ఒకరిరచనను హరించి, తనది యని ఈతడు విఱ్ఱవీగవచ్చును. కాని ఈ దొంగతీకము వీని మొగము మీద తాండవమాడుచునే యుండును! సందర్భశుద్ధి, వ్యక్తిగతప్రయోజనము ప్రత్యేకకౌశలము అపహరణమున కభయ మొసగునవి కావు. పందుము త్రెదుపుజాల్చు అడ్డబాస చక్కని దని ముక్కునకు లగించుకొని మిడిసిపడువా డెట్లుండును? కనులు కోరగించు సుంద్రని శిఖమీది మల్లెచెండును దీసి, నీడుగ ముండన మొనరించుకొనిన వ్యక్తి తలదాల్చినయెడల నెట్టిదృశ్యము గోచరించును? పట్టమహిషిదాల్చు వన్నెచీర నొంటజుట్టబెట్టుకొనువా డేతీఱున నుండును? నెమలిపురిని ధరించినకాకి నెమలి వలె నృత్యము సలుపగలదా?

ఒకరిమొక్క నీతడు దొంగిలించి, తనపెరటిలో పాతిపెట్టినను, బుద్ధిగలవిమర్శకులు పుట్టుపూర్వోత్తరముల నరసియే దానిప్రయోజనమును నిర్ణయింతురు. పాయఖానాలోని తులసిమొక్క నెవ్వరు స్పృశింతురు? ఉపాధి ననుసరించి వస్తుగుణ మేర్పడును. వంశమర్యాదను బట్టి చక్కని సంబంధము స్థిరపడును. ప్రదేశప్రాభవము ననుసరించి పదార్థగుణ విమర్శనము జరుగును. నిలిచిన తావును బట్టి పరిశీలన మారంభమగును. కల్లుపాకనుండి వినబడు సంకీర్తనమునకు చెవులొగ్గువా రెవరు? పడుపుకత్తెకడ తారకమంత్రోపదేశ మందువా రెవరు? ఎంగిలికూడైన మృష్టాన్నమును ముట్టుకొనువా రెవ్వరు? గొబ్బిపేడలోని బంతిపువ్వుల నెవ్వరు తలదాల్తురు? కుక్కముట్టుకొనిన ఓదనముపై చేయివేయువా రెవరు? పేడినొసలుమీది చేర్పుక్కకు కను లప్పగించువా రెవరు? అంటుగిన్నెలోని పాయసమునకై ఎవరు దేవులాడెదరు? పులివిస్తరకుమీది పులిహోరకై కక్కుర్తిపడువా రెవ్వరు? కోతిమార్కు డబ్బాలోని సెంటుకై తపించువా రెవ్వరు? బురదగోతిలోని పూలదండను మెడ దాల్ప నెవరు ముక్కవపడెదరు? అబద్ధమునకు అసహ్యము తోబుట్టువు. నటనలోను, దొంగతీకమందును, డబ్బావాయింపులోను, మోసీయందును, అనుచిత సంపర్కములోను, అప్రస్తుత సన్నివేశమందును ఇవి కాపుర ముండును.

పార్వతీపరమేశ్వరులకును, కైలాసమునకును అవినాభావసంబంధము కలదుకదా! సౌందర్యసత్యములకును, శివమ్మగు ధర్మమార్గమునకును గల కలయిక కూడ నిట్టిదే! కావున నివి సాహితీజగతియందును,

* "Truth is Beauty; Beauty is Truth" అనికదా కీట్సుమహాకవి పలికినాడు. "సత్యమ్, సుందరమ్ శివమ్ము"లు వ్యత్యాసరహితము లని రస్కిన్ పలుకు టెఱుగమా?

ప్రత్యక్షప్రపంచమందును పర్యాయపదములై పరగు చున్నవి. సత్యసంఘటనమును సుందరక్రియ యను చుందుము. సౌందర్యసంశోభితమైన రచనమే సత్య సందీప్తమైన దని వాకొనియుంటిని. శివమైన పంథ యందు నిలిచినవాడే ఇట్టిరచనమును సృష్టింపగలవా డని తెలుపుట చర్వితచర్వణ మగును. మూడు పరమా శయములును త్రివేణింబోలిన వనుదు; దత్తాత్రేయుని వంటి వనినను అనుదు. తనరచనమున త్రివేణిని జూప జాలువాడే ఆదర్శరచయిత! ప్రత్యక్షజీవితమున దత్తా త్రేయుడై నిలువగల వాడే ఆదర్శరచయిత!!

ఆత్మగుణములను తపమువలన, ఆనందోపాసనము కలన వలన అలచుకొనువారిని పఠిత లిపుడు తమదృష్టి లోని కాహ్వానించి, సర్వతోముఖమైన వారియభి వృద్ధిని పరిశీలించితేని, వారు దత్తాత్రేయులని గుర్తింప గలరు. ఉత్కృష్టరచనలను సృష్టించి, పవిత్రచరిత్రు లైన మన మునిమనీషు లిట్టి దత్తాత్రేయులేకదా!

బాహ్యసౌందర్యమును విశేషముగ నుపాసించిన వారు ప్రాచీన గ్రీక్ దేశమున ననేకు లుండిరి. భావ సౌందర్యము నారాధించినవారు ఆసియందు అం దందు నుండిరి. ప్రతీచీమనీషులు వీరిని Mystics అను చుందురు. సౌందర్య మొంటరిబ్రదుకు గడుపునది కాదని, సత్యశివమ్ములతో విడివడని కలయిక కలదని తెలిపితిగదా! కాన "Mystics" అనిన "దత్తా త్రేయు"లని అర్థము చెప్పెదను. అల్పసంఖ్యాకులని, ఆంతరంగికబాంధవ్యము గలవా రని నైన చేర్కొన బడినవారు వీరే! స్థలకాలములకు సంబంధించిన వ్యత్యా సములు వీరి నడుమనున్నను, ఒకటే గృహమున వేర్వేరు గదులందు నిలిచిన కుటుంబస్థులంబోలువారు వీరని వక్కాణింతును. ప్రపంచసాహిత్య మిట్టి యాలయ మున కెనయైనది. జిజ్ఞాసువులై అందు ప్రవేశించువారు మహిమోపేతమైన ప్రత్యేకతగల ఈమహాపురుషులను గుర్తింపగలరు; వీరిలో డిగ్రీలకు చెందిన వ్యత్యాసము లున్నను, పూర్వోల్లిఖితమైన వీరి ప్రధానసంబంధమున నే పారపాచ్యములు నుండవని గ్రహింపగలరు.

యోగనిష్ఠాగరిష్ఠులైన వీరు విశేషకాలము గభీర- ధ్యానమున మునింగియుందురు. ఇటనిన వీరు సౌంద ముక్తికి మాత్రము దేవులాడువా రని తలపజెల్లదు. ముక్కు మూసికొనువా రందఱును స్వార్థపరులు కారు. భవతారకములైన భావములు గభీరధ్యానమున లభిం చును. శిథిలముకాని సమాధియందు అద్భుతమైన విశ్వ రూపమును వీక్షించి, మునిరచయితలు తమ సృష్టి యందు శిల్పకౌశల ముప్పుపడ ప్రకటింతురు. ఉత్కృష్ట జీవితము లిట్టి సృష్టిపై నాధారపడియుండును. కావున వీరు సర్వకాలములందు (అదృశ్యులై యుండియు) పరార్థజీవులై పరగుచుందురు. సంయమీంద్రులైన రామనజకదీశాదు లిట్టివా రని తెలిసియుంటిగదా! సూర్యాలోకమున ప్రపంచవాసు లెన్నెన్ని పనులు నిర్వహింపరు? మింటినుండి డిగ్గి, నడుమగట్టి మన కార్మికులలో నొక్కడు కాలేదని, మన పొలము లందలి కృషకులలో నొక్కండై యుండలేదని రవిని గుణించిన దుర్విమర్శనమునకు దలపడ వచ్చునా? దూరస్థు లయ్యు, కాలపథమున భావకిరణచ్ఛటలను ప్రసరింపజేయువారు జగత్కల్యాణకర్తలు కారా?

త్రవ్వగోలలను, హలములను చేబూనువారేకాక కలములను చేగొనువారునుగూడ ఈశ్వరునికేబినెట్ లోని మంత్రులే! కవిమంత్రులును, కార్మికమంత్రు లును అన్నదమ్ములే!

ఋషిరచయితలు మధుమయ మహార్ణవము లందు భావాంబరము లందు విహరించు విహంగము లైనను, గగనసౌధములందు స్థిరవాసము ఏర్పఱచు కొనరు. సద్భావప్రకటనమును పురికొలుపు క్రియాం గణములందును అక్కఱగు వేళలందు వీ రగపడుచునే యుందురు. కాని వీరిభావోపాసనమును, క్రియాకౌశల మును తక్కెడ కిరుచెట్టుల నిడి తూచరాదని వచిం తును. సమానమైన ఇట్టి ప్రజ్ఞను చూపగలవారు గాంధిని బోలువారు పుడమిపై మిగుల నరుదుగ పుట్టెదరు.

"సత్యం సుందరం శివమ్మ"ను పరమాశయ ములకును, మనోవాక్కాయములకును గల సంబంధము త్రిమూర్తులకును మువురమ్మలకును గల బాంధవ్యమును బోలునది. కావున నీ యాశయముల నారాధించు నీ

మేధావులేరైన నిలువనోల్లని నూతన వర్తన లసంఖ్యముల పతితలు విస్మరింపరాదు.

మధురవర్తనము నుండి యుదయించిన వీరి రచనలు అమృతములో తేనెపబడిన పూలమొక్కలవలె జరామరణముల నెఱుగవు. వీనిలో ప్రస్ఫుటించు భావప్రసూనములు భావితాత్త్వికులకును, కవులకును, మతాచార్యులకును, ప్రవక్తలకును మాత్రమేయని చెప్పనేల సర్వప్రజ లందఱికిని, సౌందర్యోపాసకు లెల్లఱకును నిత్యపూజా సామగ్రియై యుండును.

**Mystics** అనబడు నిట్టి మునిరచయితలలో ప్రతీచీప్రపంచమందలి గెటే, కార్లైల్, ఎమర్సన్ ప్రభృతులు చదువరులకు పరిచితులే! భారతీయులలో, ముఖ్యముగ నాంధ్రులలో నిట్టివా రెవరో విపులముగ, సవిమర్శముగ దెలుపుట కిందు చోటు లేదు. తిక్కనపోతనలు మన మునిరచయితలు. వాటి చరిత్ర వీరికి తోడుపడి యుండినయెడల, కవీంద్రులైన ఈసంయమీంద్రులు విశ్వసాహితీవియత్తలమున నెంత యద్భుతముగ తేజరిల్లెడివారో!

ఆధునిక భారతీయులలో ప్రపంచదృష్టి నాకర్షింపగలిగిన తేజస్వియైన **Mystic** రవీంద్రుడు. వివేకానంద అరవింద వాస్వానీ ప్రభృతులు తక్కుంగలవారు. వీరిజీవితములు యజ్ఞవాటికలను పోలునవి. వీనిలోని భావవాతావరణము మిగుల పవిత్రమైనది. వీరిరచనలలో నిది చొచ్చుటవలననే ఆత్మ నలరించు కమ్మని నేతివాసన లందుండి వెడలుచుండును.

ఇట్టివారిని సకాలమున సుర్తించి, తపఃఫలము జేస పయనము సాగించుకతటి వీరు నడువవలయు దారులను అంతరంగమందలి అధిదేవత ముందే నిర్ణయించును. మధురభావదుగ్ధమును జగతి కిచ్చు ఈ మునిధేనువుల ముందు గోపాలుడు నడచుచునే యుండును.

తన సారథిపై సంపూర్ణవిశ్వాస ముంచి ధర్మక్షేత్రమున సాగిపోయిన పార్థుని వసిది, మునిరచయితలును, మునివీరులును తమ జీవితాంగణములందు ఆచార్యుడును, సారథియునైన దివ్యశక్తికి తమ హృదయములను కానుగ సమర్పించి తమ ప్రతిభను, తమప్రజ్ఞను కన్గొని చరచర చని విజయు లయ్యెదరు.

భగవద్గీతానువాదములనుండి ఆధ్యాత్మికప్రబోధము నందిరో, పాశ్చాత్య లయ్యు, మధురమురళిని వినిరో కార్లైలు ఎమర్సనులు అమృతమయవర్తనులై, తత్త్వార్థ గర్భితములైన, సౌందర్యనిధానములైన, సుధాప్లావితములైన రచనలు సృష్టించిరి. అనవరతము భగవద్గీతను పురశ్చరణము గావించుచు, గంభీర భావములను వ్యక్తీకరించు గాంధిజీ తన కురుక్షేత్రమున ఆధ్యాత్మికమైన ధనువును ప్రయోగించుట జగద్విదితమేకదా! గీతను దలచించు గ్రంథములను, గీతాచార్యులను తలపునకు తెచ్చు ఆచార్యులను జిజ్ఞాసువుల హృదయములను కదలించి, తమ్ముతాము సుర్తించున ట్లొనరించి, వారిని ముముక్షువుల జేసి, వారిరచనలను మున్యాశ్రమములకు ప్రతిరూపములు గావించు టెఱుగమా? ఋషిరచయితల చరిత్రలను విమర్శకదృష్టితో నాలోకించి, కవిధ్వజమును వహించిన దివ్యదృశ్యములను సుర్తించి, మిక్కిలి యక్కజ పడుచుందుముగదా!

షోడశకళలు గుణ బాంధవ్యము కతన పూర్ణచంద్రునందు కలయులీల నేకైక గుణాన్వితులు కనుల యెదుట నొకటే యుజ్జ్వలాకృతము నిడికొని, 'తమ్మ' మీది అఖండముచుట్టు నొకనేనలయమున రామభజన మొనరించు భక్తులను దలచించుచు, ఒకటే దండలోని పువ్వులను తలపునకు గొనివచ్చుచు, నొకరి నొక రెఱిగి, సంపూర్ణసఖ్యమున నెంపొందుచుండు రసవిమయమును దృష్టినుండి జారనీయక మహాపురుషుల జీవితములను పరిశీలించితిమేని, స్థలకాలముల సరిహద్దుల నెఱుగని భావప్రపంచమున వేర్వేఱు చోటుల వారికిని, వివిధయుగముల వారికిని పఠనమువలనను, ఆంతరంగిక పరిశీలనము వలనను కలుగు నైయ్యంపువియ్యముల గని ఆశ్చర్యాన్వితులము గాము. భావోపాసనమువలన గలుగు అద్భుతాభ్యుదయము నాలోకించి యానందమున నోలలాడగలము.

# కృపాలహరి

శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి

నైదాఘ ఘన తాపమే దాపురించింది
ఎర్రన్ని బీరెండ యేర్చి మండించింది
కంకనిష్వల కొంకగాడుపే వీచి ది
క్షోణీతలం బగ్నగుంకమై పోయింది.

నా చిన్ని వనములో ననలు పసి వాడినవి
సిరసిరి వృక్షాలు నిల్చినవి మ్రోడులై
సొగసెసలి చిగురులతల్ శోషిల్లిపోయినవి
ఎండమావుల బయల్లెకల వ్యాపించినవి.

కోయిలల తీయనౌ కూత యిక వినబడదు
అలమయూరికల నాట్యంబింక కనబడదు
అళికుమారకుల గానాలాప మిక లేదు
నిలువగా కానంత నీడయే కరవయ్యె.

కాని ఓకరుణాకరా! నిర్మలాకార!
ధన్యుడనే;—నీదు కారుణ్యనిర్ఝరధార
అదిమాత్ర మొక్కటి అనంతమై జలజలా
గలగలా చిరుతరంగాల దివ్యధ్వనుల
పరవళ్లు త్రొక్కుచూ, ప్రవహించుచున్నది
ఏ దివ్యలహరియో ఇంకిపోకున్నది.
చాలు, నాకంతియే చాలు, ఆకాశాన
ఒక్కొక్క నక్షత్ర మొకయగ్నిగోళమై
యేకమై అవియన్ని యిటు రాలిపడుగాక—
పడుగాక—నే నీకృపాలహరిగవారాల
దాగిపోనా? స్వేచ్ఛగా గొంతులో పాట
మ్రోగింపనా? ఓగురూ!
చాలు నా కంతే చాలు!!

---

## "గామిడి" శబ్దార్థసందేహనివృత్తి

బ్రౌఢ్యనిఘంటువులోనూ, బసవపురాణంలోనూ (చేటూరివారిది) 'గామిడి'కి సరియైన అర్థాలు సోపపత్తికంగా వున్నై.

వాటిని వోసారి చూస్తే వారిసందేహం నివృత్తి కాగలదు.

ర: క్షిణీనాథశాస్త్రి

---

# పాణిని - మాహేశ్వర సూత్రములు

శ్రీ న. చ. వేంకటచక్రవర్తులు

౧. అ ఇ ఉ ణ్, ౨. ఋ ఌ క్, ౩. ఏ ఓ ఙ్, ౪. ఐ ఔ చ్, ౫. హ య వ ర ట్, ౬. లణ్, ౭. ఞ మ ఙ ణ న మ్, ౮. ఝ భ ఞ్, ౯. ఘ ఢ ధ ష్, ౧౦. జ బ గ డ ద శ్, ౧౧. ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్, ౧౨. క ప య్, ౧౩. శ ష స ర్, ౧౪. హ ల్.

ఈసూత్రములకు మాహేశ్వరసూత్రములని పేరు గలదు. పాణిని ధ్యానించగా ఈశ్వరుడు ప్రత్యక్షమై తనఢక్కను ౧౪ సార్లు వాయించెననియు, దానివలన నీవర్ణములు పుట్టి సూత్రరూపమును బొందెననియు, నందికేశ్వరకాశిక యను గ్రంథమున గలదు.

నృత్తావసానే నటరాజరాజో
ననాద ఢక్కాం నవపంచవారం,
ఉద్ధర్తుకామః సనకాదిసిద్ధా
నేతద్విమర్శే శివసూత్రజాలం.

ఇందుగల ప్రతిసూత్రముయొక్క కొసపొల్లు వర్ణములను ఈశ్వరుడు పాణినియొక్క శాస్త్రమందలి యుపయోగముకొరకు స్వయముగ కూర్చెను.

అత్ర సర్వత్ర సూత్రేష్వంత్యం వర్ణచతుర్దశం,
ధాత్వర్థం సముపాదిష్టం పాణిన్యాదీష్టసిద్ధయే.

దీనినిబట్టి పొల్లువర్ణములకంటె మిగిలినవర్ణములు ఈశ్వరకర్తృకములు గూడ కావనియు, అందుచే శ్రుతులనియు, వేదతుల్యములనియు తెలియుచున్నది. వేదములకు ఈశ్వరుడు ఉపదేష్టగాని కర్త ఎట్లుకాడో ఆవిధముగనే యీవర్ణసమామ్నాయమునకుగూడ ఈశ్వరుడు ఉపదేష్టగాని కర్తకాడు. శాకటాయనుడుకూడ "ఇదమక్షరచ్ఛందః" అని వర్ణములకు వేదతుల్యత్వము చెప్పినాడు. కనుక వీటిని పఠించునపుడు వేదము చదివినందువలన గలుగు ఫలము కలుగును.

పైవిషయములందు నాకు గల సందేహములను వివరించెదను. పాణిని గొప్పదగు వ్యాకరణశాస్త్రమును రచించదలచి తన యిష్టదైవమగు ఈశ్వరుని గూర్చి తపస్సుచేయగా నాతడు ప్రత్యక్షమై, నిన్నను గ్రహించితి ననియు, నీకు గ్రంథరచనాసామర్థ్యమును గలుగజేసితి ననియు, ఇతరుల వ్యాకరణశాస్త్రములకంటె నీశాస్త్రమునకు హెచ్చుప్రచారము కలుగు ననియు చెప్పియుండును. ఈవిధముగ యిష్టదేవతాప్రార్థనముచేయుటయు, నాదైవము ప్రత్యక్షమై వారి కోరికలను నెరవేర్చుటయు, వారికి గ్రంథరచనాసామర్థ్యమును గలుగజేయుటయు, కలదని ప్రాచీన గ్రంథపరిశీలనమువలన మనకు తెలియుచున్నది. చతుర్దశసూత్రిని ఈశ్వరు డుపదేశించెనని చెప్పినచో, తక్కిన శాస్త్రమంతయు నీవిధముగ చిరస్థాయిగను, యింత మహత్తరముగను రచించుట కాతని ప్రసాదమే కారణమని చెప్పవలసియుండుటచే, దానిచేతనే యీ చతుర్దశసూత్రరచన యుపపన్నమగుచుండ దానిని యీశ్వరు డుపదేశించెనని చెప్పవలసిన యావశ్యకత కన్పట్టదు. మరియు నీ చతుర్దశసూత్రియం దున్న గొప్పతన మేమి? పాణిని బుద్ధికి దుర్గ్రాహ్యమై యీశ్వరు డుపదేశింపవలసినవిషయ మిందేమి కలదు? అనువిషయముగూడ మన మాలోచింపవలయును. ఈ చతుర్దశసూత్రిని పరిశీలించినయెడల వర్ణములయొక్క కూర్పు * (**Arrangement of Alphabet**) మాత్రమే ఇందు గలదని తెలియును. ఇందు కొన్ని సంజ్ఞలను చేసికొనుటకుగాను కొన్ని పొల్లువర్ణములు ప్రతి

* ఈవర్ణములకూర్పు మాతృకాపాఠమందే విధముగ నున్నదో పాణిని తనశాస్త్రమున కనువుగ నెట్లు మార్చెనో యనువిషయము. ౧౯౩౯ జనవరి భారతి– "పాణినీయము- ప్రాతిశాఖ్యలు" అను శీర్షిక క్రింద వ్రాయబడినది.

సూత్రము చివర నుంచబడినవి. ఇట్టికూర్పు పాణిని ప్రతిభావిశేషమునకు అందనివిషయముగ గన్పట్టుట లేదు. ఏలనగా అతను సూత్రములనుగూడ యీవిధముగనే మంచిచేర్పుతో కూర్చె ననుటకు "పరనిత్యాంతరంగాపవాదానా ముత్తరోత్తరం బలీయః" అను న్యాయము ప్రమాణము. పూర్వశాస్త్రముకంటె పరశాస్త్రము, దానికంటె నిత్యశాస్త్రము, దానికంటె అంతరంగశాస్త్రము, దానికంటె అపవాదశాస్త్రము బలీయములు. అనగా తమకంటె పూర్వశాస్త్రములను తాము బాధించును. ఈనియమము ప్రవర్తించవలెనన్న యెడల దానికి తగినకూర్పు అవసరముగదా! ఇట్లే తరువాత నున్న సూత్రములలోనికి పూర్వసూత్రములనుండి కొన్ని పదను లనువర్తించుచుండును. ఆ రెండుసూత్రములకు మధ్యనున్న సూత్రములలోనికి ఆపదము వెళ్లినను బాధ లేనట్లుగానే యీసూత్రములను చేర్చెను. ఇంతకన్నను విచిత్రమైనది "పూర్వత్రాసిద్ధం" అనునది ౮-వ అధ్యాయం రెండో పాదం మొదటి సూత్రము. పాణిని వ్రాసిన ౮ అధ్యాయములలో ౭ అధ్యాయముల ౧ పాదను దీనికంటె పూర్వమునను ౩ పాదములు మాత్రము దీనితరువాతను గలవు. ఈ మూడుపాదములును తనకు పూర్వముం దున్న సూత్ర సముదాయమునుగూర్చి అసిద్ధమగును. ఇందు సుమారు ౩౦౦ సూత్రములు గలవు. ఈ సూత్రములలో కూడ పూర్వసూత్రము ప్రవర్తించువేళ తరువాతనున్న సూత్రమొకప్పుడు ముందుగా ప్రవర్తించియుండినను ప్రవర్తించన ట్లగును. ఇన్నిసూత్రముల నీవిధముగ చేర్చుటకెంత బుద్ధివిశేష మావశ్యకమో ఊహింపజాలము.

ఇన్నివిధములగు నిబంధనలతోగూడిన సూత్రములను రచించిన పాణిని తనశాస్త్రమున నుపయోగించునట్లు వర్ణములను చేర్చినాడనుటలో యాశ్చర్యపడ నవసరములేదు. మాహేశ్వరుని యనుగ్రహమువలన కలిగిన శక్తివిశేషముచే వీనిని నిర్మించినాడు గనుక మాహేశ్వరసూత్రములని పేరు వచ్చియుండవచ్చును. ఈశ్వరుడుపదేష్ట కానపుడు దీనికి వేదతుల్యత్వము లేకపోవుటచే పారాయణాదులయందు ఫల ముండదేమో యని సంశయింప బనిలేదు. ఈ చతుర్దశసూత్రికంటె వేరుగ వృద్ధిసూత్రభాష్యమందు భాష్యకారుడు "ఛందోవత్సూత్రాణి భవంతి" అని చెప్పుటచేతను, "అపాణినీయంతు భవతి" అని యచ్చటచ్చట చెప్పుటచేతను పాణిని చెప్పినదానియందు వేదతుల్యత్వమును, పుణ్యజనకత్వమునుకూడ కలదని మనము చెప్పవచ్చును. అందు చేరనే కొన్నిసూత్రము లనావశ్యకములని భాష్యకారుడు స్థిరపరచియున్నను పారాయణమువలన అదృష్టప్రయోజనము కలదని చెప్పుచున్నాడు.

ఈశ్వరు డుపదేష్ట కాకపోయినను వర్ణసమామ్నాయమున కనాదిత్వము సిద్ధించును. భాషాతత్త్వవేత్తలు భాషోత్పత్తికి కొన్నికారణముల నూహించిరిగాని కాలనిర్ణయమును గావించినట్లు లేదు. ప్రాథమిక జనుడు (Primitive man) తనయభిప్రాయములను సుఖదుఃఖాదులను అరపులచేత తెలియజేయుచుండెననియు, ఇతరజంతువుల "కాకి, కుక్క," మొదలగువాట్లను వాటిధ్వన్యనుకరణముచే తెలియజేయుచుండెననియు వారు చెప్పుచున్నారు. మరియు ఆశ్చర్యాదిభావములు కలుగునప్పు డకస్మాత్తుగా హృదయోద్వేగమువలన కలిగినధ్వనులును, శారీరకపరిశ్రమ యొనర్చునపుడు కలిగిన శ్రమను పోగొట్టు ధ్వనులునుగూడ ప్రారంభావస్థలో భాషయందు ప్రవేశించిన వనియు చెప్పుచున్నారు. కాగా ప్రాథమిక మనుష్యునకు గల భాషాసామగ్రి- అవ్యక్తధ్వనులు (Cries); అనుకరణధ్వనులు Imitation Sounds); ఆశ్చర్యాదిసూచకధ్వనులు (Interjections) భావచేష్టాద్యనుగతశబ్దములు (Accompanying sounds) అని తెలియుచున్నది. కాని ఈవిధ మనుభాష ఏకాలమున ప్రారంభ మైనది? యనుప్రశ్నకును, మనుష్యజన్మకును సంబంధము కావున మనుష్యజన్మ ఎప్పుడు? అని మరియొకప్రశ్న కలుగుచున్నది. దానిమీద సృష్టిప్రారంభ మెప్పుడు? అని మరియొక ప్రశ్న యుదయించుచున్నది. పరిణామవాదమున సృష్టిప్రారంభముతోనే మనుష్యజన్మ కాకపోయినను, మనుష్యజన్మ, ప్రాథమికజనుడు, భాషోత్పత్తి ఒకకాలముందనుటకు సందేహము లేదు. ఆకాలము ఎప్పుడను విషయము మనుష్యుని యూహకు అతీతమైనది. కావున ఆ భాషతో అవినాభావముగానున్న వర్ణసమామ్నాయము యొక్క కాలముకూడ ఊహకు అతీతమైనది గావున

యనాదియనియే మాయభిప్రాయము. శాకటాయనుడు కూడ ఋక్తంత్రవ్యాకరణమందు—

"ఇదమక్షరచ్ఛందః, వర్ణశః సమనుక్రాంతం, యథాఆచార్యా ఊచుః, బ్రహ్మాబృహస్పతయే ప్రోవాచ, బృహస్పతి రింద్రాయ, ఇంద్రోభరద్వాజాయ, భరద్వాజ ఋషిభ్యః, ఋషయో బ్రాహ్మణేభ్యః, తంఖల్విమమక్షరసమామ్నాయమిత్యాచక్షతే, నభుక్త్వా నక్తం ప్రబ్రూయా ద్బ్రహ్మరాశిరితి"

వర్ణసమామ్నాయమును బ్రహ్మ బృహస్పతికిని, అతడు ఇంద్రునికిని, అతడు భరద్వాజునికిని, అతడు ఋషులకును, వారు బ్రాహ్మణులకును చెప్పిరని యున్నది. దీనివలన వర్ణసమామ్నాయము వేదమువంటిదని తెలియుచున్నను, దానియుత్పత్తిప్రకార మొకవిధముగ వర్ణింపబడెను. ఇట్లు పలువురు పలువిధములుగ జెప్పుటచే వర్ణసమామ్నాయప్రారంభ మెప్పుడో నిర్ధారణగ తెలియదనియే చెప్పవచ్చును. కావుననే దానికి వేదతుల్యత్వము, అనాదిత్వము సిద్ధించుట కభ్యంతరములేదు.

పైని నిరూపించినవిధముగ పరంపరాప్రాప్తమగు వర్ణసమామ్నాయము పాణినికి ఈశ్వరు డుపదేశించవలసినయావశ్యకత గన్పట్టదు. మరియు ఉపదేశమనుపదము తెలియని విషయమును తెలుపుటగాని, తెలిసినదానిని తెలియజేయుట యనునర్థమందు ప్రయోగింపబడుట లేదు.

ఏశాస్త్రమును రచించువా రాశాస్త్రములో నంతకుపూర్వమున్న గ్రంథములనుజూచి వాటికి విశేషముగా గాని, విరోధముగా గాని తనబుద్ధినిగూడ నుపయోగించి వ్రాయుట స్వభావము. పాణినికూడ తనకంటె పూర్వులగు కొందరు వైయాకరణుల గ్రంథములను జూచినట్లు యితని వ్యాకరణమువలన తెలియుచున్నది. ఇతను శాకటాయనుడు, శాకల్యుడు, ఆపిశలి, మొదలగు వైయాకరణులను పేర్కొనియున్నాడు. ఇప్పుడు మనము శాకటాయనవ్యాకరణమును జూచిన యెడల యీవర్ణసమామ్నాయము ఈశ్వరోపదిష్టము కాదేమోయని సందేహము కలుగకమానదు. అందులో మొత్తము ౧౩ సూత్రములు కలవు. ఆసూత్రములే కొంచెము భేదముతో ౧౪ సూత్రములుగ పాణిని గ్రహించి నట్లును, వర్ణములకూర్పు గూడ నందలివిధము ననుసరించుచున్నట్లును, సూక్ష్మపరిశీలనమువలన తెలియగలదు. అందుగల అనుబంధవర్ణములే (పొల్లువర్ణములే) ఇందు గూడ గన్పడుచున్నవి. దీనివలన కొంత స్వబుద్ధితోను, కొంత యితరులబుద్ధి ననుసరించియు పాణిని వీటిని నిర్మించియుండు ననుటలో సందేహము లేదు.

అయితే ఇప్పుడు మన కుపలభ్యమానమగు శాకటాయన వ్యాకరణము, పాణినికి ప్రాచీనమైనది కాదని కొందరు చెప్పుచున్నారు. దీక్షితులు వ్రాసిన మనోరమ యను గ్రంథమందు "ఇత్యభినవశాకటాయనః" అని యున్నది. 'మరియు పాణిని శాకటాయనుని మతముగ నేవి చెప్పినాడో యవి యిప్పటిశాకటాయన వ్యాకరణమునందు మరియొకవిధముగ నుండును. ఈ విధముగ ఈశాకటాయనవ్యాకరణముపాణినికి ప్రాచీనము కాదని చెప్పినను పాణిని కృతగ్రంథమున కుత్కర్షే కలుగజేయును. ఎట్లనగా అప్పుడు చతుర్దశసూత్రి నిర్మాణము కేవలము పాణినికి స్వబుద్ధిమాత్ర పరికల్పితమగును.

అయితే వృద్ధిసూత్రభాష్యమందు "ఏతదేకమాచార్యస్య మంగళార్థం మృష్యతాం" అని వృద్ధిపదము మంగళముకొరకు మొదట నుంచబడినట్లు భాష్యకారుడు చెప్పుచున్నాడు. దీనిబట్టి "వృద్ధిరాదైచ్" సూత్రమునుండియే పాణినికృతమైనట్లును, అంతకు పూర్వమున నున్న చతుర్దశసూత్రి ఈశ్వరోపదిష్టమైనట్లును, చెప్పుట కవకాశ మిచ్చుచున్నది. మరియు 'లణ్' సూత్రమందు భాష్యకారుడు అణ్, ఇణ్, ప్రత్యాహారములయందు సందేహము కల్గుచున్నదని శంకించి "ణకారవిషయ ఆచార్యప్రవృత్తి ర్జ్ఞాపయతి, వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి ర్నహి సందేహా దలక్షణమ్"అని చెప్పెను. ఇచటనున్న ఆచార్యపదమునకు శివుడర్థమని నాగేశుడు వ్రాసెను. ఈవిషయము నేను చెప్పినదానికి విరుద్ధముగ నున్నట్లు కన్పించుచున్నను సూక్ష్మముగ పరిశీలించిన నేను చెప్పినదానికే యనుకూలముగ నున్నదని తెలియగలదు.

ప్రయోగములందు గల పదములు వాక్యములే నిజముగ నర్థబోధకములును, ఈప్రకృతిప్రత్యయవిభాగ

మంతయు, కల్పితార్థమును బోధించునదియు, అని వైయాకరణులందరు నంగీకరించియున్నారు. ఒక్కొక్క వైయాకరణుడు తనబుద్ధివిశేషము ననుసరించి ప్రకృతి ప్రత్యయములను గూర్చుటయందును, సంజ్ఞా పరిభాషలను కల్పించుటయందును, రూపసాధనమందును, భిన్న భిన్న రీతుల నవలంబించినను, సిద్ధరూపములందు గాని వర్ణసమామ్నాయమందు గాని వేరుమార్గముల నవలంబింప వీలులేదు. కావున "వృద్ధిరాదైచ్" సూత్రము నుండి తర్వాతనున్న సూత్రసముదాయము, పాణిని మేధాకల్పితమనియు, అంతకుపూర్వమందు గల చతుర్దశసూత్రియు నిదివరకు సిద్ధమైయున్న వర్ణములను బోధించునదనియు మనము తెలిసికొనగలము. "వృద్ధిరాదైచ్" సూత్రమందు నాగేశుడుకూడ యీసంజ్ఞలు పాణినిచే స్వేచ్ఛగా చెప్పబడుటవలన యదృచ్ఛాశబ్దములని చెప్పుచు "స్వేచ్ఛయా సంజ్ఞాః క్రియంతే" అను భాష్యమును ప్రమాణముగ జూపెను. కావున తన శాస్త్రము "వృద్ధిరాదైచ్" సూత్రమునుండియే ప్రారంభింపబడుటచే మంగళార్థకమగు వృద్ధిపదము నుపయోగించెనని సులభముగ నూహింపవచ్చును. లేదా - అ ఇ ఉణ్, సూత్రమువద్దనే మంగళము చేసెనని సమర్థింపవచ్చును. "అకారో విష్ణువాచకః" అకారము విష్ణువును స్మరింపజేయుటచే తన్నామోచ్చారణము మంగళార్థమనుట కభ్యంతరములేదు. వృద్ధిపదము సంజ్ఞకొరకును, మంగళముకొరకును, ఎట్లుపయోగించుచున్నదో ఆవిధముగ నిచట అకారము స్వరూపప్రకటనకొరకును మంగళముకొరకును "ఏకా క్రియా ద్వ్యర్థకరీ" అను న్యాయమున నుపయోగింపవచ్చును. నేను చెప్పిన యీపక్షమునకు విచిత్రమగు ఆనుకూల్యము సంభవించుచున్నది. పాణిని రచించిన సూత్రములలో కొట్టకొనసూత్రము "అఅ" అనునది. "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానిచ శాస్త్రాణి ప్రథంతే" అను న్యాయము ననుసరించి మొదట మంగళమును చేసిన పాణిని చివరకూడ మంగళమును చేసెననియే చెప్పవలసియుండును. అప్పుడు వృద్ధిపదముతో శాస్త్రప్రారంభమనుపక్షమందుగూడ చివరనున్న అకారమునకు విష్ణువాచకత్వము చెప్పి మంగళాంతమని చెప్పకతప్పదు. అట్లే నేను మొదటనున్న అకారమునకు చెప్పుచున్నాను. కావున దోషము లేదనియే తలచెదను. మరియు ఉపక్రమమందు అకారముగల శాస్త్రము ఉపసంహారమందు అకారముతోనే ముగించబడుటకూడ నాపక్షమున కనుకూలము.

పాణినియే వర్ణసమామ్నాయము నుపదేశించి అనుబంధవర్ణములను చేర్చుటచేతనే భాష్యకారుడు "కిమయం వర్ణోత్పత్తా వివ ణకారో ద్వి రనుబధ్యతే"అని ప్రశ్నించుచున్నాడు. అక్షరములు లేనట్లు ణకారమునే ఎందుకు రెండుసార్లుచేర్చితివని లణ్-సూత్రమందు ప్రశ్నించి - కొన్నిచోట్ల అణ్-ఇణ్, ప్రత్యాహారములయందు సందేహము కల్గుచున్నదని శంకించి "ణకారవిషయ ఆచార్యప్రవృత్తిః" అని వెనుక నుదాహరింపబడిన భాష్యమును వ్రాసెను. ఈప్రశ్నోత్తరములరీతికిని తక్కిన సూత్రములందలిరీతికిని భేదములేదు. మరియు ఈసూత్రమందుగల ఆచార్యపదమునకు, వృద్ధిరాదైచ్ సూత్రమందుగల ఆచార్యపదమునకును, పాణినియే యర్థమని చెప్పినయెడల ఐకార్థ్యము సంభవించును. భాష్యకారుడు మరెక్కడ ఆచార్యపదము నుపయోగించినను పాణినిపరముగానే వ్రాసెను. ఈలణ్ - సూత్రమందే నాలుగుసారు లాచార్యపదమును వాడెను. అందు మూడుసారు లుపయోగించిన ఆచార్యపదమునకు పాణినియని యర్థ మెవరైనను చెప్పకతప్పదు. అట్టిస్థితిలో నాల్గవసారిమాత్రము దానికి "శివః"అని యర్థము వ్రాసిన నాగేశుని యభిప్రాయము చింత్యము. మరియు అచ్-ప్రత్యాహారములో విజాతీయములగు కకారాదు లుండుటచే వాటికిగూడ అచ్త్వము వచ్చుచున్నదని శంకించి "అప్రధానత్వాత్"అని సమాధానము చెప్పి "ఏషా హ్యాచార్యస్య శైలీ లక్ష్యతే, యత్తుల్యజాతీయాం స్తుల్యజాతీయేషూపదిశతి, అచో ఽక్షు, హలో హల్షు"అని వివరించెను. పాణిని అచ్చులలో అచ్చులను, హల్లులలో హల్లులను ప్రధానముగా నుపదేశించుచున్నాడు గావున అచ్ ప్రత్యాహారములలో అచ్చులకే గ్రహణ మని చెప్పవచ్చును. నాగేశుడు యిచ్చుటనున్న ఆచార్యపదమునకు "అనాదిః శబ్దపురుషః" అని యర్థము వ్రాసెను. అనుబంధవర్ణములకంటె మిగిలినవి యనాదులును ఈశ్వర

కర్తృకములుగూడ కాకపోవుటచే యీవిధముగ వ్రాసెనని యూహింపవచ్చును. ఒకపదమున కొక్కొకప్పుడు అర్థమును మార్చవచ్చును. గాని దానికి తగినంత ప్రమాణ ముండవలెను. ప్రకృతమం దట్టిప్రమాణముగాని, యర్థము మార్చుట కావశ్యకతగాని లేదు. పాణిని తనకీ పదునాల్గు సూత్రములు ఈశ్వరు డుపదేశించెనని గాని, కాత్యాయనపతంజలులు పాణిని కీశ్వరు డుపదేశించె నని స్పష్టముగాగాని వ్యంగ్యముగాగాని చెప్పలేదు. మీద నుదాహరించిన భాష్యములకు ప్రదీపమును వ్రాసినకైయటుడుగూడ ఆచార్యపదమున కర్థము వ్రాయలేదు. అందుచే సామాన్యముగనున్న యర్థమే యిటకూడ గ్రహింప వలెనని యాశయము. కావున నవీనుడగు నాగేశునికంటె ప్రాచీనులగు పాణిని, కాత్యాయన, పతంజలి, కైయటుల యాశయమే గ్రాహ్యమని తోచుచున్నది. వీరి వ్యవహారమునుబట్టి చతుర్దశ సూత్రికిని ఈశ్వరుడుపదేష్ట యని ఋజువుపరచ వీలులేదు.

నందికేశ్వర కాశిక-యనుగ్రంథ మీవిషయమున ప్రమాణముగ గ్రహించ వీలులేదు. అది నవీనమైనను గావచ్చును. లేదా ప్రాచీనమైనను యీచతుర్దశ సూత్రికిని వేదాంతపరముగ నర్థమును గల్పించి వారు చెప్పిన యర్థమందు ప్రామాణ్యముండుటకై ఈశ్వరప్రోక్తమని చెప్పియుందురు. వ్యాకరణవిషయమున ప్రమాణమావశ్యకమైనయెడల వ్యాకరణకర్తలయభిప్రాయములు దానికవిరోధిగనుండు ఇతరశాస్త్రకారుల యభిప్రాయములు గ్రాహ్యములు - అంతియగాని విరోధిగనుండు ఇతర శాస్త్రకారుల యభిప్రాయములు గ్రాహ్యములుకావు. అందుచేతనే నైయాకరణమతమున శబ్దము నిత్యము. నైయాయికులమతమున శబ్ద మనిత్యము. వారిమతమును ప్రమాణముగ నంగీకరించము. మరియు కంఠతాల్వాదులవలన వర్ణాత్మకశబ్దము పుట్టుచున్నదనియు, భేరీమృదంగాదులవలన ధ్వన్యాత్మకశబ్దము పుట్టుచున్నదనియు అనుభవమందున్న విషయము. అట్టిస్థితిలో ఢక్కవలన వర్ణాత్మకశబ్దము పుట్టుట కవకాశము లేదు.

భాష్యకారుడు పాణినిని తక్కినచోట్ల ప్రశ్నించినట్లే యీ ౧౪ సూత్రములనుగూర్చి ప్రశ్నించుచున్నాడు "అథ కిమర్థం వర్ణానా ముపదేశః క్రియతే, అనుబంధకరణార్థశ్చ, ఇష్టసిద్ధ్యర్థశ్చ" వర్ణోపదేశము ఎందుకు చేయుచున్నావని ప్రశ్నించి, అనుబంధవర్ణములు (పొల్లువర్ణములు) సూత్రములకొసల నుంచుటకును, మన కిష్టమగుపద్ధతిలో వర్ణము లుండునట్లు వర్ణసమామ్నాయమును కూర్చుటకును, అని చెప్పి, వర్ణోపదేశము లేకపోతే యీ ప్రయోజనములు కుదురవుగదా! అని చెప్పుచున్నాడు. అంతియగాని వేదతుల్యత్వముండదేమోయని గాని, అదృష్టప్రయోజనము కలుగదని గాని సందేహించలేదు. ఆప్రయోజనములు తప్పక సిద్ధించునవియే యాతని యాశయము.

ప్రకృతమున నేను చెప్పినపద్ధతిలో సంపూర్ణశాస్త్రకర్తృత్వ సామర్థ్యమునీశ్వరుని యనుగ్రహము వలన పాణినికి కల్గినదనియు, పాణిని కర్త యనియు చెప్పినయెడల వారిద్దరికి శాస్త్రమంతటితోను ఒకే విధముగ సంబంధ ముండును. రచించుసామర్థ్యమును గల్గించినవాడు ఈశ్వరుడు. రచించినవాడు పాణిని. వారు చెప్పినపద్ధతిలో వర్ణసమామ్నాయమునకు మాత్రము ఉపదేష్ట ఈశ్వరుడు. తక్కినశాస్త్రమునకు కర్త పాణిని. తక్కిన భాగములతోకూడ వారిద్దరికి ఏదో విధముగ సంబంధము కల్పించినను ఆసంబంధము ఒక విధముగ నుండదు. ఇట్లు కొంతకొంతభాగమే వారికి సంబంధించినదని చెప్పుటకంటె, శాస్త్రమున కంతకు వారిద్దరికి సంబంధము చెప్పుట యుచితమని నాయభిప్రాయము.

ఇందుగల సత్యమును విజ్ఞులు గ్రహింతురుగాక.

# సంజ వెలుఁగులు

శ్రీ మంగెన గంగన్న

౧

ఆ ప్రతీచీ లతాంగి గాఢానురక్తి
విడిచి విడువంగనోపక విశ్వమిత్రు
సాంధ్య నీరాజనంబు లొసంగుచుండె
మఱలరావోయి! మన్మనోహరుడ! యంచు

౨

పడమరనెలంత యిడెడు నివాళు లపుడు
మలఁగిపోయెను జీఁకటిమగువ చీఱ
చెఱగు విసరినమాత్రాన చిన్నవోయి
గిట్టునే యాలుమగల పోకిళ్లు పెఱకు?

౩

అంతలోఁ బ్రాగ్దిశాప్రాంత మవలకొంత
ధవళ కాంతుల రాశియై తనరిపోయె
సిగ్గుమాలినచీఁకటి చెలువచేయు
పనికి రేతేఁడు నవ్వెనో పకపకయని.

# భారతసాహితీదృష్టి

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

భారతసాహిత్య పరిశీలమునకుఁ బూనుకొనఁగనే తొలుదొల్త దృగ్గోచరమగునది అమూల్యమును నిరవధికమును అగు సంస్కృతసాహితీప్రపంచము. వేదములు మొదలుకొని బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, శాస్త్రములు, దర్శనములు, పురాణేతిహాస కావ్య నాటకాలంకారాది బహుళగ్రంథ సముదాయము సంస్కృత వాఙ్మయమున అతిప్రాచీన కాలముననే యుండియున్నవి. భారతీయ సాహిత్యమనందే కాదు, ప్రాచీన ప్రపంచ సాహిత్యమునందును సంస్కృత సాహితి అంతస్సారమునను, విశాలమును రమణీయమునునను బాహ్య స్వరూపమునను అప్రతిమానమై అగ్రేసరముగా గణన కెక్కినది. అతిప్రాచీనమని భావింపఁబడు గ్రీకుసాహితికన్నను గీర్వాణ సాహిత్యమే ప్రాచీనతమ మని పాశ్చాత్యపండితులును నిర్ధారము చేసియున్నారు. భాషా శాస్త్రవేత్తలు గ్రీకు, లాటిన్ శాఖలతోఁ బాటు "ఆర్య" శాఖను (దీని నుండియే వైదిక లౌకిక సంస్కృత వాఙ్మయము పుట్టినదని ఆధునిక శాస్త్రకారులు) గూడ నొక్కదానిఁగ గణించి భాషావిభాగము చేసినను, ఈ గ్రీకు, లాటిన్, ఆర్యన్, జెర్మానిక్, సెమిటిక్, మొదలుగాఁగల సోదర భాషాశాఖల కన్నింటికిని మూలభూతమైన "ఇండో ఇరానియన్" మాతృభాషతో నెక్కుడు సాజాత్యమును బొందియున్నది ఆర్యశాఖా జన్యమగు సంస్కృత భాషయే. ఆ కారణముననే మొట్టమొదట భాషా శాస్త్రనిర్మాతలు గ్రీకు, లాటిన్ భాషలకు సైతము మూలభూత మీ యార్యశాఖయేయని తలంచిరి. విశేష పరిశీలనముచేఁ గ్రమక్రమముగా వారి యాశయము మాఱిపోవ నిద్దానిని సోదరశాఖగా నంగీకరించి వీని కన్నింటికిని మాతృభాష "ఇండో ఇరానియన్" అని నిర్ధరించుకొనిరి. కావునఁ దొల్లింటి భాషామాతకు మొదటిబిడ్డ గీర్వాణభాషాకుమారియే.

భారతీయులదృష్టి సాహిత్యమునందే కాక, ఇతరవిషయములందును పురుషార్థములై పైననే కేంద్రీకరింపఁబడినది. మానవప్రాణికి ఇహమునఁగాని పరమునఁగాని సాధింపఁదగినవి చతుర్విధ పురుషార్థములే. పురుషార్థ దూరమైన యేక్రియయైనను మనుష్యుని బంధకముఁ దెచ్చు నన్న విశేష రహస్యము భారతీయుల కాజన్మవిజ్ఞాతము.

అర్థకామములు సైతము ధర్మపురుషార్థము నతిక్రమించకయు, ధర్మము మోక్షప్రతిబంధకము గాకయు నుపభోగ్యము గావలయు ననుటలో హిందూజాతి విశ్వమానవసంతరణమార్గము నెంత సుసూక్ష్మముగాఁ బ్రదర్శించినదో గోచరముకాకపోదు. కావుననే సమస్త శుభాశుభకర్మములును పురుషార్థపరతంత్రములై కాని వారియెడఁ బ్రవర్తిల్లలేదు. వివాహము, సంతానప్రాప్తి, సామ్రాజ్యపాలనము, వివిధలౌకిక కార్యనిర్వహణము, పుట్టుకకు మరణకాలిక కర్మకలాపము పురుషార్థము నుద్దేశించియే జరుగవలయును. ధనసంపాదనమునఁ గల్ల బొల్లు లాడుట, ప్రాపంచిక భోగములఁ బెంపొందించుకొనుపట్ల వైషమ్యము వహించి కపటమార్గముల నరుగుట, వీరప్రార్థనా సమయములందో సత్యాకవచమును ధరించి ధర్మయుద్ధముతో శాంతిసంగ్రామము సలుపుట వేదమతమున కొప్పిదము కాదు. ఐహికాముష్మికముల రెంటను మానవుఁ డవలంబింపవలసినది నియమబద్ధమగు నేకైకమార్గమే. ప్రాపంచిక భోగవిస్తృతి సైతము ఇచ్చవచ్చిన వడువునఁ జేయఁజనదు; పరమును లేదా ఉత్తరజన్మఫలమును దృష్టియందుంచుకొనియే చేయవలయును. కావుననే ఇది ఐహిక మని త్రోసిపుచ్చుటకును, అది పర మని పరిగ్రహించుటకును వీలులేదు. ఈ రెంటి కవినాభావ సంబంధము. ఇహమును విడిచిన పరముగాని పరమును

వీడిన ఇహముగాని లేదు. చతుర్విధపురుషార్థము లీ వైశిష్ట్యమునే ప్రతిపాదించి, మానవప్రాణి పురుషార్థపరాయణుఁ డని నిరూపించుచున్నవి.

వైదికసాహిత్యమును బరిశీలించినచో నియ్యది సువ్యక్తము కాఁగలదు. దేవతాస్తుత్యాత్మకమైన ఋగ్వేదము, యజ్ఞకర్మప్రేరకమైన యజుర్వేదము, తత్త్వగానాత్మకమైనసామము, పలువిధము లగువాభిచారికతంత్రములకును, వైద్యమునకును, శిల్పమునకును, తదితరములగు వివిధవిషయములకును నునికిపట్టగు నథర్వవేదమును బురుషార్థసాధనములనే వివిధగతులఁ బేర్కొన్నవి. వైదికసాహిత్యదృష్టి మిక్కిలియు ధర్మపురుషార్థమునకు గుఱియైయున్నది. పలుతెరగుల యజ్ఞవిధానములఁ దెలుపుచు, స్వర్గాది పారలౌకిక సుఖములను జవిచూపుచు వేదదృష్టి విశేషించి యజ్ఞక్రియాపరతంత్రమై యున్నది. ఇతరపురుషార్థముల వైపునకును వైదికసాహితీదృష్టి వ్యాపించినను, బహుళప్రచారముచేతను, బ్రాహ్మణగ్రంథముల యజ్ఞనిరూపణప్రవణతచేతను పారలౌకికధర్మమునందే నదిఅధికముగ పర్యవసితము. అందుకే గీతాచార్యుఁడు "త్రైగుణ్యవిషయా వేదాః" అని వేదములు రజస్సత్త్వతమోగుణముల కనురూపములైన ఆయాఫలముల నిచ్చునవి గావునఁ ద్రిగుణాతీతస్థితిని గోరు ముముక్షువున కుపాస్యములు గావనినాఁడు.

ఉపనిషత్సాహిత్యము మోక్షపురుషార్థప్రతిపాదకము. వేదములందు స్తుతింపఁబడిన యజ్ఞవిద్య-పారలౌకికఫలము- ఇందుఁ బూర్వపక్షీకృతమైనది. కర్మసంపాదితమైన లోకము నశించినట్లే పుణ్యముచే సంపాదించుకొన్న స్వర్గాదులును నశ్వరములే కావున, నిరతిశయానందదాయకమును శాశ్వతమును నగు మోక్షమే జీవునకుఁ బ్రాప్య మని యుపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. సకలజగత్కారణమైన వస్తువు పొందఁదగిన దనియు, అదియే ఆత్మ యనియూ, ఆత్మవేత్త పునరావృత్తిరహిత శాశ్వతదివ్యపదము నంది బ్రహ్మవిదుఁడై బ్రహ్మమైపోవు ననియు నిందలి ప్రతిపాదితాంశము. దాని కనుకూలముగాఁ బ్రపంచము యొక్క నిస్సారతను నిరూపించి వైరాగ్యము నుప్పతిల్లఁజేయుట యుపనిషద్ధర్మము.

ఈశ్వరముఖ వినిర్గత వేదాది మహాగ్రంథములను సాహిత్యకోటిలోఁ గలుపఁదగునా యని శంకింపవచ్చును. కాని ఈశంక యవిచారితరమణీయము. వేదవాఙ్మయమును బరిశీలించినచో నందలి సాహితీ ఘట్టములు మనకు సాక్షాత్కృతము లగును. వేదమునందు సూచితములైన మార్గములే క్రమక్రమమున బృహత్సిద్ధాంతములుగా వన్నెకెక్కినవిగదా! ఒక్క సాహితీమార్గమునకే కాదు, షడ్దర్శనములకును, శాస్త్రములకును, ఆగమములకును మూలభూతము వేదమే. అట్టియెడ వేదమును సాహిత్య మన్నంతమాత్రమున దాని యపౌరుషేయతకుఁ దలకంపులు లేవు. వేదములలో లేని సాహిత్యసిద్ధాంతమును క్రొత్తగా నిరూపించుటకైనను మన కుపజ్ఞ యొక్కడిది? పౌరుషేయమో, అపౌరుషేయమో, ఏదైన నగుఁగాక వేదములలో సాహిత్యము సముత్కటముగా గోచరించుచునే యున్నది.

ఉపమాద్యలంకారములు, వివిధ వర్ణనభంగులు, నవరసభరితముగా నెన్నేని సూక్తములలోఁ బొందుపఱుపఁబడియున్నవి. విశ్వాత్ముఁడైన పరమపురుషుని వర్ణనము పురుషసూక్తములో నెంత హృద్యముగాఁ జేయఁబడినదో చూడుఁడు—

"సహస్రశీర్షాః పురుషః, సహస్రాక్షస్సహస్ర
పాత్, సభూమిం విశ్వతోవృత్వా అత్య
తిష్ఠద్దశాంగులమ్, పురుష ఏవేదగ్ంసర్వం
యద్భూతం యచ్చ భవ్యం......

బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూ రాజన్యఃకృతః
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అ
జాయత...తమేవం విద్వానమృత ఇహ
భవతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ..."

ఆ పరమపురుషుఁడు వేయి శిరములు వేయి కన్నులు వేయిపాదములు గలవాఁడై భూమ్యాకాశముల నావరించి యుండెను. భూతభవ్యములు రెండును అతని స్వరూపములే. అతనికి బ్రాహ్మణులే

ముఖము, క్షత్రియులు బాహువులు, వైశ్యులు తొడలు, పాదములు శూద్రులు; ఈ విధముగా విశ్వాత్ముని సర్వావయవములను వర్ణించి అట్టి విశ్వకర్మను తెలిసికొనినచేగాని మానవుఁ డమృతుఁడు గాఁడనియు, అమృతత్వమున కతని నెఱుంగుటకన్న వేఱొండు మార్గము లేదనియు యజురారణ్యకమంత్రములు కవితాశక్తిలో నమృతరసాయనమును బంచిపెట్టినవి.

"...ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్..."

తొడిమెనుండి దోసకాయవలె మృత్యుబంధమునుండి విడివడుదునుగాక.

"...తిలేషు తైలం దధినీవ సర్పి రాపస్స్రోతస్స్వరణీషు చాగ్నిః..."

నువ్వులలో నూనెవలె, పెరుగునందు నేయివలె, ప్రవాహములయందు నీరువలె, అరణియం దగ్నివలె (హృదయములోఁ బరమేశ్వరుని తెలిసికొనుము.)

ఈ మొదలైనమంత్రము లుపమాసాహాయ్యమున గభీరతరార్థమును బోధించుచున్నవి. రూపకచ్ఛాయలోని ఈయర్థబోధ మెంతయింపు నింపుచున్నది—

"ప్రణవో ధను శ్శరో హ్యాత్మా
బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే,
అప్రమత్తేన వేద్ధవ్యం
శరవ త్తన్మయో భవేత్.

ముండకో పనిషత్తు.

ప్రణవ మను విల్లునకు ఆత్మ యనుశరమును సంధించి బ్రహ్మమను లక్ష్యమును భేదించినచో శరమువలెఁ దన్మయుఁడైపోవును. ఇందుపమాచాతుర్యమును గలదు.

సర్వోపనిషచ్ఛిరోమణియగు కాఠకమున శరీరరథాభివర్ణనము సుమనోహరముగా నొనరింపఁబడినది.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు,
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ.
ఇంద్రియాణి హయానాహు ర్విషయాం
స్తేషు గోచరాన్.
ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః"

ఈ విధమున వేదమున నున్న సాహితీకళాకలాపము లనంతములు. వేదపురుషుఁడు రసస్వరూపుఁడు (రసో వై సః). రసము రమణీయత కాలవాలము. రసరామణీయకములే సాహిత్యమునకు జీవములు. కావున వేదవాఙ్మయమును సాహితీసౌందర్యసముజ్జ్వలము. ఈ సిద్ధాంతమును రససిద్ధులు త్రోసి రా జనఁజాలరు.

అర్థమును రమణీయముగా బోధించుటకు సాహిత్య మేర్పడినది. వేదము ప్రభుసమ్మితమైనను రామణీయకమునకు దూరము కాలేదు. అయిన నిఁకఁ గావ్యవైశిష్ట్యమేమని ప్రశ్న. దానికిదివఱకే సమాధానము చెప్పికొంటిమి; శ్రుతిలో సూక్ష్మరూపమున నున్న సిద్ధాంతము లౌకిక వాఙ్మయమున బృహద్రూపము ధరించిన దని.

వ్యాకరణాది శాస్త్రములును బురుషార్థ సాధకము లయినవే యొప్పినవి. ఇతరభాషలయందు వ్యాకరణ మన భాషాసంస్కారము నేర్పఱచు సాధనము మాత్రము. సంస్కృతవాఙ్మయమున నట్లు కాదు. భాష యొక్క స్థూలరూపములను లింగ వచన క్రియా కారకాదులను జర్చించి నిర్ణయించుటతో నాశాస్త్రము తృప్తిపడదు. భాషామర్యాదనే కాక శబ్ద తత్త్వమును గూడఁ బ్రదర్శించుట ఆశాస్త్ర ప్రయోజనము. అందుకే వ్యాకరణమునకు శబ్దశాస్త్ర మని నామ మున్నది.

వ్యాకరణశాస్త్రముయొక్క పురుషార్థ పారతంత్ర్య మిట్లు పాడకట్టడిని. పాణిని మహర్షి—

"ఏకశ్శబ్దస్సమ్యగ్ జ్ఞాత్వా సుష్ఠు ప్రయుక్త
స్స్వర్గేలోకే కామధు గ్భవతి"
"అపశబ్దాన్ ప్రయుంజానో
రౌరవంన రకం వ్రజేత్"

అని చక్కని శబ్దపరిజ్ఞానము గల ప్రయోక్తకు స్వర్గలోకములో ఫల మున్నదనియు, అపశబ్దములఁ బ్రయోగించువాఁడు నరకము నందు ననియు వచించియున్నాఁడు. ఇది యంతయు సంస్కృత వ్యాకరణ సంబంధ మనువిషయము మఱువఁజనదు.

పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీభేదములచే శబ్దము నాలుగు విధముల నలరారుచున్నది. లింగ వచన క్రియా కారకాది రూపములతో

నుచ్చరితమైన శబ్దస్వరూపమునే వైఖరి యందురు. ఇది వాక్కుయొక్క స్థూలరూపము. ఈ స్థూలమునకు మూలమైనది పరాస్వరూపము. దానిద్వితీయ తృతీయావస్థలు పశ్యంతీమధ్యమలు. పరావాక్కు అఖండ బ్రహ్మస్వరూపము. నానావిధములైన బృహద్వాక్యజాలమున కిది కారణము. కారణ మేకరూపము. నిర్వికారమును, నిర్ద్వంద్వమునునై "ఏకమేవాద్వితీయమై" పరగినదీ శబ్దబ్రహ్మము. కావుననే శబ్దములలో భేదములేదు. "సర్వే శబ్దా స్సర్వార్థవాచకాః, ఘటశబ్దా త్పటోఽపి బోద్ధవ్యః" (అన్నిశబ్దము లన్ని యర్థములను జెప్పును; ఘటశబ్దముచే పటశబ్దార్థము గూడ దెలియఁగవచ్చును) అన్నారు ఆదిమవిద్వాంసులైన వైయాకరణులు. వ్యవహారసిద్ధికై "అస్మాచ్ఛబ్దా దయ మర్థో బోద్ధవ్యః" ఈ శబ్దమునుండి ఈ యర్థమునే గ్రహింపవలయునుగాని ఒండర్థమును గ్రహింపరా దన్న ఈశ్వరసంకేతము. ఇప్పుడు శబ్దములు నానార్థవాచకములగుట వ్యావహారికసత్యము. పారమార్థికసత్యములో సర్వశబ్దములును సర్వార్థవాచకములే. అప్పుడు బహువచనప్రసక్తియే లేదు. ఆ శబ్దబ్రహ్మము సజాతీయ విజాతీయ స్వగత భేదరహితము "స్ఫోట" రూప మగు అనంతశక్తిసంపన్నము. అట్టి శబ్దబ్రహ్మపరినిష్ఠితత్వమునే వ్యాకరణదర్శనము బోధించుచున్నది. "శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి" శబ్దబ్రహ్మవేది యగువాఁడు పరబ్రహ్మప్రాప్తి నందుచున్నాఁడు.

నానావిధవేదాదిస్వరూపమును ధరించిన పరావాక్కు విశ్వజననకారణమైన దనుటకు శ్రుతిప్రమాణ మిట్లు గన్పట్టుచున్నది. "వాగేవ విశ్వా భువనాని జజ్ఞే" "వాచైవ విశ్వం బహురూపం నిబద్ధం" పరాస్వరూపమగు నాత్మవాక్కు విశ్వాకారముగాఁ బరిణమించుచున్నది. వాక్కుచేతనే బహురూపమైన విశ్వము ఏర్పడిన దని పై శ్రుతివాక్యముల తాత్పర్యము.

ఈవిధమున సర్వశాస్త్రాగమములును బురుషార్థపరతంత్రములై యొప్పుచున్నవి.

వర్ణసమామ్నాయమును దిఙ్మాత్రముగా విచారము చేసిన భారతసాహితీదృష్టియే కాదు, భారతీయుల దృక్పథమే తెల్లముకాఁగలదు—

అకారాది హకారాంతములగు వర్ణములును కేవలము భావప్రకటనార్థ ముపకరించు భాషానిర్వాహకములగు సాధనమాత్రములు గావు. విచారించిన మహనీయార్థభరితములై కన్పట్టుచున్నవి. ఏభాషలోను ఈవిధమైన వర్ణమాల పొడసూపదు. † అనాదికాలమునఁ బరమశివుఁడు సనకాదిసిద్ధుల నుద్ధరించి లోకసంగ్రహముఁ జేయనెంచినవాఁడై తనచేతి యందలి ఢక్కను బదునాలుగుసారులు మ్రోగించెనఁట. ఆ ధ్వనులే మాహేశ్వరసూత్రములన గణన కెక్కినవి. వీని నాధారముగాఁ జేసికొని పాణినిమహర్షి "అష్టాధ్యాయి" యనుపేర వ్యాకరణశాస్త్రమును విస్తరించెను. నందికేశ్వరుఁడు "కాశికావృత్తి" యనుపేర వాని తత్త్వార్థమును ఇరువదిరెండు కాశికలలో వివరించెను.

అకారము నిర్గుణబ్రహ్మస్వరూపము. ఇకారము చిత్కళాస్వరూపము (ప్రకృతి, మాయ యను నామముల నొప్పుచున్న జగదంబారూపము). ఉకారము జగద్రూపముగాఁ బరిణమించిన సగుణేశ్వరస్వరూపము. భగవద్గీతలలో నైతము భగవానుఁడు "అక్షరాణా మకారోఽస్మి" అని సర్వవర్ణములలోను అకారమును (అఖండ నిర్గుణబ్రహ్మమును) నేనని వాక్రుచ్చుటలోని యంతరార్థ మిదియ. సదాత్మకమగు అకారద్యోతిత

† శ్లో. నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారమ్,
ఉద్ధర్తుకామ స్సనకాదిసిద్ధా నేతద్విమర్శే శివసూత్రజాలమ్.

౧ అ, ఇ, ఉణ్ ౨ ఋ, ఌక్. ౩ ఏ, ఓఙ్. ౪ ఐ, ఔచ్. ౫ హ, య, వ, రట్. ౬ లణ్. ౭ ఞ, మ, ఙ, ణ, నమ్. ౮ ఝ, భఞ్. ౯ ఘ, ఢ, ధష్. ౧౦ జ, బ, గ, డ, దశ్. ౧౧ ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, తవ్. ౧౨ క, పయ్. ౧౩ శ, ష, సర్. ౧౪ హల్.

వీనినే మాహేశ్వర సూత్రములు—శివసూత్రములని యందురు.

నిర్గుణబ్రహ్మము ఇకారద్యోతితమాయ నాశ్రయించి, చతుర్వింశతితత్త్వాత్మకమై ఉకారద్యోతిత జగద్రూపమున భాసించె నని "అ, ఇ, ఉణ్" సూత్రములోని యర్థము. ఏ, ఐ, ఓ ఔ లనుసంధ్యక్షరములను, అనుస్వార(ం) విసర్గ(ః)లను, దీర్ఘరూపములను విడిచి లెక్కించిన మిగులునవి అ, ఇ, ఉ, ఋ, ఌ, అను — అయిదచ్చులుమాత్రమే. ఈ అయిదు వర్ణములే క, చ, ట, త, ప లనునైదువర్గములకును, ఏకోనపంచాశద్వర్ణములకును, పంచభూతములకును గారణమైనవి. ఈ విధముగాఁ బదునాలుగు మాహేశ్వరసూత్రములలోని యక్షరముల యంతరార్థము విశ్వతత్త్వ ప్రతిపాదకమై యలరారుచున్నది.

మంత్రశాస్త్రజ్ఞులు క్షకారమునుగూడఁ బ్రత్యేక వర్ణముగా గ్రహించి, ఆధారాదిషట్చక్రములయం దాయా వర్ణములను అధిదేవతలను విభజించి తత్త్వనిరూపణము చేసిరి. ఆధారచక్రమున నాలుగు, స్వాధిష్ఠానమున నాఱు, మణిపూరకమునఁ బది, అనాహతమునఁ బదిరెండు, విశుద్ధమునఁ బదునాఱు, ఆజ్ఞా చక్రమున రెండు మొత్తమేఁబదిదళములయం దేఁబదివర్ణములు గలవు. ఒక్కొక్కచక్రమున కిన్నిదళము లేకారణమున నుండవలసివచ్చెనో, ఆయాదళములయం దాయా యక్షరము లున్న రహస్యమును, వానిచే నుపాసకుఁ డెఱుంగవలసిన విధులును మున్నగాఁగల శారీరకమీమాంస యెల్ల యోగతంత్రములందును శ్రీవిద్యాతంత్రమునందును బ్రస్ఫుట మగుచున్నది. ఈ విధముగా అక్షరములలో * అక్షరపురుషుని తత్త్వమును బ్రదర్శించిన హైందవవర్ణసమామ్నాయ సిద్ధాంత మేయొడ నైనఁ గలదా? అక్షరునకంటె నుత్తముఁడగు పురుషోత్తముని తత్త్వమును బ్రతిపాదించు నీవర్ణములు క్షరములుకాక యక్షరము లగుట యెంత యౌచిత్యము! కావున నక్షరాభ్యాసమునాఁడే భారతాంబ తనయల్లారుముద్దుబిడ్డలకు సాహితీతత్త్వ సుధాధారలను జవిచూపుచున్నది!! అహో! వేదమతమునకును, భారతీయశాస్త్రసాహితీదృష్టికిని వేయినమోవాకములు.

దీనింగూర్చిన సమగ్రచర్చకుఁ బూనుకొన్నఁ బుస్తకములే వ్రాయవలసి వచ్చును గావున నొక్కవిషయమును మాత్ర ముదాహరింతును. † నలువదితొమ్మిదివర్ణములలో మొదటిది అ, కారము, కడపటిది హ, కారము. ఆదిభూతమైన అకారమును దీసికొని అంత్యవర్ణమగు హకారముతో సమాహారము చేసినచో "అహం" అగుచున్నది. ఈ అకార హకారముల మధ్యమందే యన్ని వర్ణములు నిమిడియున్నవి. నామరూపాత్మకమైన జగ మంతయు "అహ"ములోనే యున్నది. "అహం" అనఁగా సంస్కృతభాషలో నేనని యర్థముగదా. తత్త్వదర్శికిఁ దనలోనే విశ్వాత్మసాక్షాత్కారమగుట యనుభవసిద్ధము. అకారము కారణముగా నుద్భవించినజగత్తు హకారములో లీనమై, "అహం" (తానయి తనకంటె భిన్నవస్తువులేక "సర్వం ఖల్విదం బ్రహ్మ"మై) ప్రత్యయరూపమున మిగులుచున్నది. సాధకావస్థను దాఁటి సిద్ధావస్థకుఁ బ్రాపించుస్థిత ప్రజ్ఞునికి భ్రాంతిచే బ్రహ్మభిన్నముగాఁ దోఁచిన పదార్థరాశి ఆత్మసారూప్యమున నేకమై తోఁప తుట్టతుదకు మిగులునది 'అహ' మేకదా. అనఁగా సర్వము నేనే యనుచున్న యనిర్వాచ్యస్థితి యది. ఈ రహస్యమునే భగవానుఁడు "అహం విశ్వం భువనమభ్యభవాం" అని తైత్తిరీయోప

* ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ, క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే.
యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః, అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః.
గీత. ౧౫. అధ్యా. ౧౬, ౧౮ శ్లో.

† పాణినీయులు ఏకోనపంచాశ ద్వర్ణములనే యంగీకరించిరి. అట్లైనఁగాని శాస్త్ర ప్రవృత్తికిని "అహం"పదతత్త్వప్రదర్శనమునకును వీలుచిక్కలేదు. మంత్రశాస్త్రజ్ఞులు క్షకారము సంయుక్తాక్షరమైనను, అక్షమాలాసాదృశ్యమునను, షట్చక్రరహస్యమున కను సంధించునట్లును దానినిగూడఁ బ్రత్యేకవర్ణముగా గణన చేసి యేఁబదివర్ణము లనిరి. రెండుమతములును సమంజసములుగనే తోఁచును. విశేషచర్చ ఇట ననవసరము.

నిమిత్తునందును, ఆ అహమునే లక్షించి 'అది నేనే ఇది నేనే సర్వమును నేనే' "మత్తఃపరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ" అని గీతలయందును మధురగానము చేసియున్నాఁడు.

ఆహా! సామాన్యముగా వ్యవహారదశయందు నీవు నే నను భేదమును నిరూపించుటకై యేర్పడ్డయహములో నెంతయర్థ మంతర్భూతమైయున్నది!! ఏభాషలోనైన నీదృశమార్గము గోచరించునా? 'నేను' లో నింతయర్థమును జూపఁగల భాష లున్నవా? రమ్యమను సంస్కృతభాష యిట్టి దనుటం బట్టియే దీనిని దేవభాష యని హిందువులు తలంపనయ్యెడిని.

ఈవిధముగా అక్షరములలో భాషలో బహుళగ్రంథసముదాయములోఁ బురుషార్థదర్శినియై యున్న భారతీయదృష్టి సాహితిలో నేల పెడకుఁ దిరుగును? సాహిత్యద్వారమునఁగూడ మానవుఁడు హితప్రవృత్తిని అహితనివృత్తిని పొందవలసియున్నాఁ డనుట సర్వాచార్యసమ్మతమైనవాదము. అది యుపసర్జనముగా పొందవలసినది నిరతిశయానందము. బ్రహ్మానందసబ్రహ్మచారి రస మనుచో, ఆరసానందమే కావ్యములో విశిష్టముగా భావుకుఁ డనుభవించునది. సముజ్జ్వలమగు సాహితిచే ఉపదేశమాత్రఫలమునందు వాఁడు అల్పబుద్ధి — సాహిత్యార్ణవమున అఖండానందచిద్రసము తోణఁకులాడుచుండ, పానమాత్రముచేతనే యేల తృప్తిపడవలె? సర్వావయవములు పవిత్రము లగునట్లు దివ్యావగాహముచేయకుంట సూకరము పన్నీటికాల్వఁ బరిత్యజించుట వంటిదే. రసానందము గానిండు, భావసౌందర్యజనితపరితోషము గానిండు, వస్తువు హృదయస్పర్శియగునట్లు పొందుపడు రచనావిన్యాసము గానిండు సహృదయుని విస్మృతాఖిలవిషయునిఁ జేసి ఏకమాత్రము నొసరింపఁగల అద్వైతస్థితియే భావుకునికి స్పృహణీయము. దానిని ప్రధానముగాఁ జేసికొనియే సాహితి ఇతర ప్రయోజనములను గూర్చుచున్నది. కావుననే కాంతా సమ్మితమైన కావ్యము సరసత నాపాదించి ఉపదేశము చేయుచున్న దనుచున్నారు పెద్దలు. చేసిన దుపదేశమైనను దానికిముందుఁ గూర్చునది ఆనందము ఉపదేశమొక్కటే సాహిత్యప్రయోజనమైన, ఉపదేశాపేక్ష లేనివానికిఁ గావ్యముతోఁ బనిలేదు. కావున నుపదేశమునకన్నను ఆనందప్రదానముచేయుట ముఖ్యతమమే. ఐనఁ బురుషార్థదృష్టికి దోషము పట్టదా అనవచ్చును. హితప్రవృత్తి అహితనివృత్తి లేకున్న దోషముకాని, ఆనందసాంద్రముగా బోధించుచున్నప్పుడు పురుషార్థహాని లేదుగదా! ఉపదేశమే ప్రధానము కొన్నింట, ఉపదేశానందములు ప్రధానము కొన్నింట, ఆనందప్రధానమును నుపదేశము కొన్నింట; వీని యన్నింటను పురుషార్థదృష్టి లోపించలేదు.

భారత సాహిత్యాంతఃపాతులగు కావ్యములుగాని, నాటకములుగాని, ప్రహసనాది రూపకములుగాని, కథలుగాని, ఏవైనను సరియే, అన్వయ వ్యతిరేకములచేఁ బురుషార్థ ప్రబోధకతా పూర్వముగ ఆనందనిష్యందులై తనరారినవి. సాహితీసౌందర్యోపాసకులకుఁ దత్త్వబోధమునుగూడ సరసఫణితి నొసరించినవి. అపారమగు భారత సారస్వతక్షీరవారాశిని ద్రచ్చిన ఈ యమృతభావవిలాసమే సాహితీప్రణయులకుఁ గంఠదఘ్నమై అమృతత్వమును ప్రసాదించును.

---

# ఆమని

శ్రీ వక్కలంక శ్రీనివాసరావు

౧

ఆమని యెంతో ఆహ్లాదం బని
ఆంధ్రజనంబులు అలరుల వడి గొని
అర్చన సేయగ అలరువిల్తునకు
ఆర్భాటముతో ఆంధ్రాంగన లిల
ఆడుచు పాడుచు ఆనందింపగ
అంతా మోదం, అంతా మోదం,
ఎంతో కలిగిందీ—

౨

తెలుగుబిడ్డలై తేటతనముతో
తెలివిగ మసలే తెనుగుపడంతులు
నీరాజనముల నివాళు లీగా
నైవేద్యములను నవ్వుచునీగా,
పూవిలుతుడు తన పుక్కిటబట్టిన
చివ్వున చిమ్మే చిరుసిందూరపు
పువ్వులవాహిని యో యన వడిగా
పూర్తివసంతము పురివిప్పంగా
ఆమని యెంతో ఆహ్లాదం బని
ఆంధ్రపడంతులు అందముగా భువి
ఆడుచు పాడుచు ఆనందింపగ
అంతా మోదం, అంతా మోదం,
ఎంతో కలిగిందీ—

3

వసంతకాలం, వడిగా వచ్చి
వయస్సు వచ్చే ప్రణయోన్ముఖులకు
పరిమితమోదం, పాన్పువినోదం,
తెనుగుగడ్డలో తీర్చగతలచీ,
విటజనమానస విహారియౌచు
ఆడుచు పాడుచు ఆనందింపగ
అంతా మోదం, అంతా మోదం
ఎంతో కూర్చిందీ—

౪

దివాభాగముల తీక్ష్ణపుటెండల
బీటలువాఱగ బిరుసుకుస్యములు;
వనమయూరములు వయ్యారముగా
నర్తకియట్టుల నాట్యముచేయగ;
ఆమనిఋతువున అంతా హాయిగ
ఆడుచు పాడుచు ఆనందింపగ
అంతా మోదం, అంతా మోదం,
ఎంతో కలిగిందీ—

౫

వెన్నెలరాత్రుల విహారింపంగా
ఆమని ఉక్కను అలమటించుగద!
కారణ మేమో కనుగొన మకటా
కోయిలకుహుకుహుకూతకు మతి, యా
సోయగ మెవ్వరి సొంపునకో యన
ఆమని నడచును—ఆంధ్రపడంతులు
ఆడుచు పాడుచు ఆనందింపగ
అంతా మోదం, అంతా మోదం
ఎంతో కలిగిందీ.

# ద్రౌపదీకోపోద్దీపనము

శ్రీ కందుకూరి సుందరరామశాస్త్రి

నరపతి యాజ్ఞ గొంచు చనినట్టివనేచరుఁ డేగుదెంచి, ము
ష్కరతర కౌరవాభ్యుదయగాథనుఁ దెల్పి బహూకృతుండు నై
తరల యుధిష్ఠిరుండు, తనతమ్ములు, ద్రోవది యున్నచోట నం
బరముఁ జేరవచ్చి నుడువ౯ దొడఁగె౯ కురురాట్కుతంత్రముల్.

అంతయు విన్నమీఁద నిసుమంతయు నాఁగఁగ లేక, ద్రౌపదీ
కాంతను; బద్ధబన్నములు కాఁకియువెట్టి కలంప నెట్టులేన్
శాంతుని, దాంతుని౯ నృపు, నజాతరిపున్, గృపు, ధర్మజున్, రుపా
క్రాంతు నొనర్చ నెంచి సముఖంబునఁ గృష్ణ వచించె నీగతి౯.

అధములచే నగౌరవము నందుటఁ జేసియ కాదె! నామనో
వ్యథ లిటు ప్రోత్సహింప నుకువం దొరకొంటిని, "స్త్రీజనంబుచే
కథితములైన పల్కులు జగానఁ దిరస్కృతిఁ గాంచు" నంచు, "స
ద్బుధులు భవాదృశుల్ హితమతుల్ వృథపుచ్చెద రం" చెఱుంగుదున్.

శక్రయశస్కులై యవనిచక్రము లేలరె? పూర్వు లెల్ల ని
ర్వక్రపరాక్రమోన్నతిఁ దరంబులనుండి. "మదేభమాలికా
ప్రక్రియ" నాత్మహస్తముల రాజ్యము సర్వము నీ విరోధిరా
ట్చక్రముచేతఁ బెట్టి తిది సక్రమ మంచు మదిం దలంచితే ?

దుండగు లంచు నెమ్మదినిఁ దోఁప, భయాననో, భక్తి చేతనో
యొండొకరీతినో దవుల నుంచుట యుక్తము, లేకయున్నచో
మెండగు హానిఁ దెత్తురు సుమీ! విను లెస్సగ, పుట్టినంతనే
పుండును మాన్పకున్న మెడఁ బోవునుఁ బ్రాణముఁ గూడ నొక్కడన్.

గుణములఁ బోవు, చిత్తమునకుం గడుఁ గూర్చెడు ముద్దరాలను
ఋణమును బాయనేరనివశంవద, సత్కులజాత, రాజ్యల

స్త్రీనిఁ దనభార్యవోలె పరకీయ నొనర్చు కులాభిమాని మ
చ్చున కొకఁ డున్నె? యెంతపరిశోధనఁ జేసిన నీవు తక్కఁగన్.

అలఘులు నిందచేయ తగినట్టి పథంబున సంచరింప, స
గ్గల మగు కిన్క పుట్ట దొకో? కాఱడవిన్ వడి హవ్యవాహన
జ్వలనము తీక్ష్ణమైనతఱి వాడిన జమ్మిని నీరుసేయున
ట్లలమిని నిన్నుఁగూడ దహియింపదొకో? యని సంశయించెదన్.

వ్యర్థపరాక్రముం డయిన వాని హితాళికి నాదరమ్ము, ప్ర
త్యర్థికి భీతి మృగ్యము గదా! భువనంబున నెందుఁ జూడ న
న్వర్థపరాక్రముం డయిన వానిఁ గనంగఁ దమంతఁ దామె స
ర్వార్థము లిచ్చి గొల్చి వశవర్తు లగుంగద ప్రాణు లన్నియున్.

క్రుంగుచు నుండె మానసము కూకటివ్రేళ్లతో, వ్యాప్తమయ్యె స
ర్వాంగములందు శాత్రవ పరాభవ వహ్నిశిఖాళి, నీదు క
న్నుంగవ కిద్ది యెల్లను వినోదముగాఁ గనుపట్టె నొకొ! యే
వెంగలివైన యాత్మసతి వేదనఁ దీర్పక చూచుచుండు నే.

భూతలమందు మానధనముఖ్యులలో గణనీయు లౌ ధరా
నేతల నగ్రగణ్యుఁడవు, నీతివిదుండవు, శత్రువుల్ పరీ
భూతునిగా నొనర్ప "ననుభోగ్యము" టంచును మిన్నకున్నను
ఖ్యాతము లుప్పతిల్లుఁ దగు తా నభిమానముకున్ లభింపమిన్.

శోణితచందనం బలది శోభ నెసంగు మహారథుండు నా
స్థాణునిఁ జీరికిం గొనని సాహసుఁ డక్కట! ధూళిధూసర
స్థాణుశరీరుఁడై వనపథంబులఁ గొండలఁ గ్రుమ్మరన్ జగ
త్ప్రాణసుతుల్ గనన్ కనికరంబు లవం బుదయింపలేదొకో?

సురలకె దుర్గమం బయి వసుంధర నెన్నిక గాంచినట్టి యు
త్తరకురుభూము లెల్ల సముదగ్రమహోగ్రపరాక్రమక్రమ
స్ఫురణను గెల్చి తెచ్చి, మినుముట్టెడి స్వర్ణపురాశి బోసె, నా
నరుఁ డిటు వల్కలార్థి యయినం గని మానస మెట్టులోర్చెనో?"

సుకుమారుల్ మృదుహంసతల్పములపై శోభించి, నిద్రించు మా
ద్రికుమారుల్ విధిచోదితమ్మున వనీదేశమ్ములన్ ఘోరకం
టకపాషాణశిలాతలమ్ములను కొండల్ గన్న దంతావళ
ప్రకరంబో యనఁ గర్కశాంగులయి చూపట్టన్ విచారింపవే ?

మునువైతాళికమంగళస్తుతుల నేప్రొద్దున్ యమూల్యం పుశ
య్యను మేల్కాంచెడినీవు నేఁడు కుశశయ్యన్ జంచలాత్ముండవై
ఘన దుర్దాంత దురంత దుస్సహ మహోగ్రక్రూరకాంతారమం
దు, సమాంగళ్యశివారుతంబులనె ప్రత్యూషంబు మేల్కాంచవే ?

ద్విజులన్ భోనముచేత దక్షిణలఁ దృప్తిం బొందఁగాఁ జేసి, త
ద్ద్విజభోజ్యంబుల శిష్టముల్ మెసవుటన్ తేజంబునన్ వొల్చి స
ర్వజనాకర్షణరామణీయకతఁ బర్వంగల్గె నీమేను, ధ
ర్మజ ! వన్యంబులఁ దింటఁ గీర్తిబలె కార్శ్యం బంద; మోదింతువే ?

క్షితిరాజుల్ ప్రతివారు కట్టుబడులన్ సేవింపఁ దత్తద్గళ
స్థితమందారరజఃప్రసారమున రంజిల్లెన్ మణీసంవృతో
న్నతపీఠంబున నాఁడు, నేఁ డడవిలోనన్ వాడియూ దర్భలన్
సతతం బానెడుపాదముల్ గని మనశ్చాంచల్యముం బొందవే.

అంత శ్శత్రులగెల్చి కామ్యము ‹ బాయంద్రోచి శాంతంబుచే
సాంతంబున్ ఫలసిద్ధినొంది సకలాశాంతంబుఁ గావింప సు
స్వాంతుల్ మానులపట్లఁజెల్లు నన విశ్వాసార్హ్మమా, పౌరుషా
క్రాంతుల్ జేండ్లకు శాంతికిన్ సవతిపోరాటమ్ము సూ ! ధర్మజా !

సమరంబన్నఁ బరాఙ్ముఖుండవగుదో తమ్మాపాల ! మేల్ ! మేలు ! సౌ
ఖ్యముకై శాంతి ప్రధానసాధనముగాఁ గన్పట్టునో, రాజచి
హ్నమునానొప్పు ధనస్సువీడి జడ లానంద-బునన్ దాల్చి నే
మముతో నగ్నిని వ్రేల్చుచున్ భువిని ధర్మంబున్ ప్రతిష్ఠింపుమా !

తరుణి న్నే ననరాదుగాని విను నీధర్మంబు, శాంతంబె, యె
ల్లరకీ తిప్పలుతెచ్చిపెట్టె నిక నాలస్యంబుగాకుండ సం
గరమం దందరి నోర్చి, సోదరులవేడ్కల్ దీర్చి, యిల్లాలిము
మ్మరమాదుఃఖము నార్చి నీప్రజల సంభావింప లో నెంచుమా !

అరులన్ గెల్చి భవద్భుజాబల మపార్యం బంచు చూపించి, రా
జ్యరమన్ మాగుతినో? కిరీటినో? విపర్యాసంబు లేకుండ సో
దరభావంబునఁ జూచుమాద్రిజులనో? స్థైర్యమ్ముగా నిల్పు పై
జరియింపందగు "శాంతిభూషణము"నాఁ జర్చించుచున్ గానలన్.

కుంతవ్యంబులు గాని నేరములు లక్షల్ సేసియున్నారు, దు
ర్దాంతుల్, తుచ్ఛులు, దుష్ప్రవర్తనులు, కౌరవ్యాధముల్ వారలన్
పంతం బొప్ప వధింపగావలె యశోనారీలలామంబు, ని
శ్చింతం త్వద్భుజపీఠ మెప్పటివలెన్ జేరన్వలెన్ ధర్మజా!
ద్రుపదునకున్ జనించి, కడుదోర్బలులన్ పతులన్ వరించి, ది
వ్యపతిని దీర్ఘానంగలుగు పాపలఁ గాంచితి, రాజసూయమం
దు పుడమిఱేండ్ల మన్ననలతోడఁ గృతావభృథప్రపూతనై
త్రపచెడినట్టి నీచునికతాన పరాభవమంద నోర్చితే?

లేరే? జూదము లాడువా రవనిలో, లేరే? ధరానాయకుల్
లేరే? పందెము లొడ్డువారలును మున్ లేరే? నలాదుల్ గనన్
వా రీరీతిఁ గులాంగనన్ యనుజులన్ పణ్యంబుగా నొడ్డిరే?
యో రాజాగ్రణి! మానసంబును ఖలద్యూతార్థముల్ నొంపవే:
మానవతీమణిన్ చెఱగుమాసినదానిని వేణిఁబట్టి త
త్ప్రాణప్రియుల్, నృపాలురు, కృపాదిధరామరులున్న రాట్సభా
స్థానము నందు చీరలు మదంబున నొల్చి పరాభవింప, నీ
మానస మెట్టు లోర్చె? యభిమానము సర్వము గొడ్డువోయెనే?
దిక్కఱినట్టివారలకు దేవుఁడె దిక్కని వింటచే" యశో
భాక్కులు, భర్త లేవురును పౌరుషముం జెడి దాసులైరి, న
న్నక్కునఁ బ్రోచి కావు మవమాన"మటం చును వేడినంతనే
నక్కమలాక్షుఁ జేల వరమందుటఁగాంచియు సిగ్గునందవే.

బుడుతెండొక్కఁడు చేతి కందినయెడన్ బోనిచ్చునే? నాడె యా
జడులన్ కాలునిప్రోలి కంప కిటులే సైరించునే? యాపదల్
గడవంబెట్టడె? మీకు, నాకు, మరి లోకంబందు నెవ్వారికేన్,
"బుడమిం బుత్రులచేఁ బరాజయములొప్పుం" గాదె? యూహింపఁగన్.

దీనం బయ్యెను ధర్మపాశగళ బద్ధీభూతమై, పాండుసం
తానం బొక్కట దీప్తదక్కి, కడుచింతన్ గుంది, లేకున్న నా
లానంబున్ జెకలించి భీమగజమే లంఘించుచున్ రేగుచో
స్థానం బెక్కడ? రాజరాజవిషసంజాతారుణాబ్జాళికిన్.

అడవుల నుండు కాలమున నైన సుఖంబున నుండనిచ్చిరే?
యిడుమలఁ బెట్టరే మనల నెన్నియొరీతుల, "పుత్రిలోపలన్
బాడమినబుద్ధి పుల్లలనెఖోవును", వేఱొకట న్నశించునే?
జడమతులైనవారలకు, సర్వమెఱింగిన నీకుఁగ్రొత్తయే?

ప్రత్యర్థుల్ సతతం బపాకృతి నొనర్పంబూనుచుండంగ నీ
వత్యంతంబు ప్రతిజ్ఞరక్షణము సేయంజూడ యుక్తంబుగా
దత్యావశ్యక "సద్ధిధర్షణము" లోయ్యం జేయ యత్నించినన్
స్తుత్యుం డయ్యెదు మూడులోకముల నెంతో కీర్తి చేకూఱెడిన్.

విధియోగంబున కాలయోగమున దుర్వీర్యుండునై యాపదం
బుధిలో మున్గి తమోపహారియయి, సంపూర్ణప్రభావంతుఁడై
యుదధిన్ వెల్వడు మిత్రునట్టులనె నీయుద్యోగ మూసించి, తో
యధిగారాబుకుమార్తె చేరఁజని సౌఖ్యం బంది వర్ధిల్లుతన్.

---

# స్వాతంత్ర్యము

శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రి

[ప్రదేశము - గృహారామము.]

సుందరి, లక్ష్మి వేదికలపై గూర్చుండి మాట లాడుచుందురు. సూరిశాస్త్రి ప్రవేశించును.

సుం — శాస్త్రులుగారూ! నమస్కారాలు.

శా — శీఘ్రమేవ...సిద్ధిరస్తు.

సుం — మీకున్నూ ఈ పిచ్చి యున్నదండీ.

శా — నేను రిఫార్మర్ నేకాని స్త్రీలకు వివాహం వద్దని నోటితో చెప్పలే నమ్మాయి!

సుం — ప్రపంచమంతా పెండ్లిపందిరి అయి, కన్యక లందరు మగవారికి దాసీలు అయితే మీకు పరమ సంతోషం కాబోలు!

శా — అలాను కాదమ్మాయి! పెండ్లిచేసుకొని లో లోన మగవారిని దాసానుదాసులుగా చేసుకుంటే నాకు పరమసంతోషం.

సుం — నేటి యువకులు అలాను లొంగేవారే లెండి.

శా — ముక్కుపట్టి ముగుదాళ్లువేసి అలాగు చెయ్యాలి. అదీ మీ విద్యా చాతుర్యాదులకు ఫలము. అంతే కాని మీరు పురుషజాతిని, పురుషులు స్త్రీ జాతిని బహిష్కరించి వేరయితే కొలదికాలంలో సృష్టి యేమగుతుందో ఆలోచించు. బుద్ధిమంతురాలవు.

సుం — తీతువుపిట్ట ఆకాశం పడిపోకుండా కాలు అడ్డు పెట్టిందట! ఓహో! మేమే సృష్టి నిలువ పెట్టేవారము!

శా — కాదమ్మాయి! నీ నా కోసం మనము మాట్లా డుకోలేదు. నీ వంటే స్త్రీలోకం అంతాను. నే నంటే పురుషలోకం అంతాను. ఏదో యొక వ్యక్తినిగూర్చి కాదు మన సంభాషణ.

సుం — పెండ్లితో మా స్వాతంత్ర్యం పూర్తిగా నశిస్తుంది. అది మాకు దుర్భరం, దుస్సహం.

శా — అయితే పెండ్లి మాని యేమిచేస్తావు?

సుం — ఉద్యోగంచేసి వచ్చిన ధనముతో త్యాగ భోగాలు చేస్తాము.

శా — నౌఖరీలో మాత్రం పీల్చుటకు చల్లని మలయ మారుతాలు వీచుతాయి అనుకుంటావా? అది యెంత గొడవ! సేవ వాడికత్తితో నాలుక గీసి కోవడం. పక్కమీద దేహం వాల్చినా కంఠము మీద సురకత్తులదండు వ్రేలాడుతూనే యుంటుంది. అందువనే సేవ శ్వవృత్తి (కుక్క-బ్రతుకు) అన్నారు అనుభవజ్ఞులు.

సుం — తమమాట సత్యమేనండి. మా నాన్నగారు పగటిభోజనం సరిగాచేసి యెరుగరు. రాత్రికూడా టపాలు చూచుకొని నిద్రలేక దొర్లుతారు.

లక్ష్మి—సుంధరీ! 3 గంటలయింది. వాచీచూడు.

సుం — ఈ దినం ఆటకు రాను. నీకు శాస్త్రులుగారి సంగతి తెలియదు. ఫారములన్నిటిలోను వారి శిష్యులము. వారిక్లాసు మాకు పండుగ. చిరకా లానికి వారిదర్శనం. వారితో కొంచెం ప్రసం గింతాం. ఆట యెప్పుడూ వున్నదే.

శా — ఈ యమ్మాయి యెవ్వరు?

సుం — నెల్లూరునుండివచ్చి యీ సంవత్సరమే కలా శాలలో ప్రవేశించింది. మంచి చురుకయినది.

శా — నీవున్నూ పైకి వచ్చినావుగా.

సుం — "మాష్టరు!" ఉద్యోగంచేస్తే స్వాతంత్ర్యానికి ఏమి భంగమండి!

శా — మాష్టరు అంటే వందలకొలది పిల్లలకు సేవకుడు. నూరు పుస్తకాలు చదివితేగాని ఒక పుస్తకం చెప్పజాలడు. మొండి, పిచ్చి, తెలివి లేని యెట్టి ప్రశ్నలు వేసినా శాంతముగా చెప్పి సమాధానపర్చాలి. దానికైనా యెందరో యధికార్ల వేధించేవా రుంటారు.

ల — దేశసేవ చేసుకొంటే యేబాధా లేదుగదా!

శా — అదికూడా సేవకాదూ! ఒకరికి కాదు. దేశమంతకున్నూ. ఒక మతానికి, ఒక నాయకునికి, లోబడి యందరిని మెప్పిస్తూ, సేవచేయాలి. దానికెంత లోకజ్ఞానం పాండిత్యం ధైర్యసాహసాదులు, యుక్తి చాతుర్యాదులు, మంచి నడవడియుండాలో యాలోచించుకో! మీ వంటి పడుచులు తగిన సహాయము ధనము లేనిదీ యిల్లు కదలగలరా? ఎన్ని ప్రమాదాలు?

సుం — ఇన్నాళ్లు చదువుకొడవలో కాలం గడచింది. ఇపుడు కర్తవ్యం తోచ లేదు.

శా — నీ వనుకొన్న స్వాతంత్ర్యస్వరూపం చెప్పితే కర్తవ్యం చెప్పతాను.

సుం — నా యంతరాత్మ చెప్పినట్లు చేయడమే స్వాతంత్ర్యం అనుకొంటున్నాను.

శా — నీ యాత్మకంటె జ్ఞానవిజ్ఞానములచే బాగా పరిపక్వమైన యాత్మ చెప్పినట్లు వింటే నీ స్వాతంత్ర్యమునకు భంగం ఉండునా?

సుం — లేదండి. జ్ఞానవంతులు చెప్పినట్లు చేయవలసిందే.

శా — అట్టివారు చెప్పినట్లు వినుటకూ, చేయుటకూ, నీ మనస్సు లొంగినా సర్వము చక్కబడును. స్వాతంత్ర్యమంటే వినుము. అది యమూల్యమైన మనోభావము - జీవి, జన్మచే స్వతంత్రుడు. కావుననే పుణ్యముచేయుము, పాపము చేయకుము; అని శాస్త్రములు శాసిస్తున్నవి. అస్వతంత్రుని నెవ్వరూ శాసింపరు. కారాగృహబద్ధుని దేవాలయమున కేగమని కాని, సినిమాకు పొమ్మనికాని, యెవ్వరయినా చెప్పెదరా? నీ వనుకొన్న స్వాతంత్ర్యం చక్రవర్తికి కూడా లేదు. ప్రజాశయమునకున్నూ, పద్ధతులకున్నూ లోబడియే రాజ్యతంత్రములనునడుపవలయును. కారాగృహ బద్ధునకు గూడ నొక విధమైన స్వాతంత్ర్యం గలదు. తల వెంట్రుకను నూరు పాయలుగా చీల్చి చూపుటకంటె గూడ స్వాతంత్ర్యతంతువును విప్పిచూపుట కష్టతరము. ఎట్టి యిక్కట్టులో గూడ దానిని గాపాడుటకు నొక ద్వారము తెరవబడియే యుండును. అది పరిపక్వహృదయములకే స్ఫురించును. ఏ యాశ్రమము, ఏ వృత్తి, ఏ ఇక్కట్టులోనయినను, తన స్వాతంత్ర్యమును గాపాడుకొని జీవయాత్ర గడుపుటకు తగిన సూక్ష్మావకాశములు తరుచుగా నుండును.

ల — దానికి చిన్న యుదాహరణ చెప్పండి.

శా — వినుము - ఒక మహారాజుగారి కలాశాలలో ప్రిన్సిపాల్ పదవి ఖాళీ అయింది. దానికి నల్గురు పోటీచేసినారు. విద్యామతివారులచే నల్గురూ సమానులే. సహృదయవతంసుడగు నా మహారాజు చక్కని పోటీపరీక్షను పెట్టెను. ఒక టేబిల్ మీదను అయిదుపాత్రలతో పుష్పాసవమును (షాంపియన్) పెట్టించి యిది త్రాగవచ్చునండి. అని చెప్పి మహారాజు ఒక కప్పును గైకొనెను. వారిలో ముగ్గురు తమ కలవాటు లేకున్నను, ఇచ్చకమునకై త్రాగిరి. నాలవవాడు చూచూచి పాత్రను యథాస్థానమున పెట్టెను. రసజ్ఞుడగు మహారాజు వీతడు నన్నుగౌరవించుటకు మాచూచెను. తన వ్యక్తిస్వాతంత్ర్యమునకై త్రాగుట మానెను. కాబట్టి యీతడే యర్హుడని యెంచి వానికే ప్రిన్సిపాల్ పదవి నిచ్చెను. కావున కురాళ, మెుగమాటము, దౌర్బల్యము మున్నగువానికి లోబడి వ్యక్తి, తన స్వాతంత్ర్యమును గోల్పోవరాదు. గోల్పోయెనా, ఆవ్యక్తి చైతన్యము లేని బొమ్మ యని చెప్పవచ్చును. స్వాతంత్ర్యాభిలాషి, కొన్ని తావులయందు కష్టనష్టములకున్నూ, కొన్ని యెడల సర్వసంపదలకున్నూ లోనగును. స్వాతంత్ర్యం పేరుతో హద్దుమీరిపోరాదు. మనో

దౌర్బల్యముచే ప్రతిదానికి లోనుకారాదు. కావున స్వాతంత్ర్యం (Freedom) అందరికీ కోరదగినదే. స్వైరవిహారము మాత్రము దూష్య మవుతుంది.

సు — మీ పురుషపక్షంలో మీరు చెప్పిన దంతా సత్యమే కావచ్చును. కాని మావిషయంలో "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అనే సూత్రం బిగిస్తున్నదికదండి!

శా — మంచి ప్రశ్ననే వేసినావు. చూడు "పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే, రక్షంతి వార్ధకే పుత్రా న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి" —

అని చెప్పినారు. బాల్యమున తండ్రి, యౌవనమున భర్త, ముసలితనమున పుత్రులు స్త్రీని కాపాడుదురు. అబలలు సర్వకోమలలగు స్త్రీలు, తమ్ముతాము రక్షించుకొనజాల రని యెంచి యట్లు చెప్పినారు. అట్లు కాకపోతే భర్తతోపాటు తండ్రి, బిడ్డల రక్షణనుకూడా స్త్రీలు బహిష్కరింపవలసినదేనా? "న స్త్రీస్వాతంత్ర్యమర్హతి" — అంటె ఆత్మరక్షణశక్తి చాలదని దాని యర్థముగాని మనోభావమైన స్వాతంత్ర్యము లేదనికాదు. ౧, ౩, పాదాలవల్ల నేను చెప్పిన యర్థము స్పష్టము.

సు — తాము చెప్పినది సత్యమేనండి. ఇపుడు అనుమాననివృత్తి అయింది—కాని పెండ్లిచేసుకుంటే మాత్రం ఈస్వాతంత్ర్యం అణుమాత్రం ఉండదని తోస్తుంది. అత్త, మామ, భర్త, గీచిన గీటుకూడా దాటరాదు. తుదకు ఒక విద్యాసంస్థకైనా పోరాదు. క్రొత్తకోడ లంటే ఖయిదీ. సత్యకాలములో ఋషులు చెప్పినశ్లోకాలు మంత్రాలు చదివి యేమిచేసినా పాతివ్రత్య భంగమే అంటారు. అది మా భయము.

శా — నిష్కారణము ఋషులను, మంత్రాలను నిందించకు. వారు కరుణార్ద్రహృదయులు, మూడు కాలములకును సరిపడునట్లు చెప్పినారు. కేవలము తుచ్ఛమయిన యింద్రియలోలత్వమునకు వా రంగీకరింపరు గాని మిగిలిన సర్వవిషయములయందును వారు మహోదారులు. వివాహమంత్రములూ, ఋషులూ అనుగ్రహించిన స్వాతంత్ర్యం మీరు నే డనుకున్న దానికంటె పదిమండుగులు అధికము.

లక్ష్మి — అవి యేవో సంగ్రహంగా దయచేసి చెప్పండి.

శా — "గృహిణీ గృహముచ్యతే" భార్యయే యిల్లు అనగా గృహానికి సర్వాధికారిణి యని యర్థము. "మూర్ధానం పత్యు రారోహ ప్రజయాచ ధనేనచ" సంతానముచేతను ధనముచేతను భర్తకుప్రాధాన్యమును వహింపుము. సంతానము ధనము నీకుండి యని యర్థము "సమ్రాజ్ఞీ శ్వశురే భవ...శ్వం ద్విపదే చతుష్పదే" అత్త మామ మున్నగువారికి, ద్విపాద చతుష్పాదజంతువులకు సర్వమునకు, నీవే సర్వాధికారిణివి యని చెప్పి గృహప్రవేశకాలమందే మంత్రపూర్వకముగా సర్వము నొప్పగించును. మధూకరము అడిగేవాడుకూడా "భవతి! భిక్షాం దేహి" అని యమ్మగారినే సంబోధించి యడుగును. ముష్టివారున్నూ "అమ్మా బిచ్చ"మని అమ్మనే యడుగుదురు. "ధర్మే అర్థే కామేచ నాతిచరామి" ధర్మార్థకామము లనే మూడుపురుషార్థములలోను నిన్ను దాటి చరింపను అని యగ్నిసన్నిధిని భర్తచే ప్రమాణమును చేయింతురు. శాస్త్రప్రకారము భర్త తానుచేసిన పుణ్యములో సగపాలు భార్యకు ననాయాసముగా పంచిపెట్టును. పాపమునుచేసినా తా నొక్కడే యనుభవించును. నైట సర్వకష్టములకు, సర్వనైచ్యములకు, సర్వపాపముల కోర్చి సంపాదించిన ద్రవ్యమునంతా భార్యచేతిలోనే పెట్టును. తన కేమాత్రముధనము మిగిలినా యామెకాభరణాలను జేయించి వస్త్రాలంకార భూషితరాలైన యామెను జూచి లోలోన మురియుచుండును. పూర్వకాలమున భార్యయే పురుషునకు చక్కని బ్యాంకు. పనికిమాలినపనులకు నామె శరీరముమీది యాభరణముల నడుగజాలడు. ఆమె యివ్వదు. న్యాయమైన యవసరము వచ్చినపుడు ఆమెయే తన బంగారము నిచ్చి యక్కరతీర్చును. పూర్వకాలములో గృహస్థులకు యజ్ఞముచేయుట యే పరమపురుషార్థము. అట్టియజ్ఞమునకు గావల

సిన సంభారములలో నొక్కదానినయినా, భార్య యనుమతి లేనిదీ యింటనుండి తీసికొనరాదు.

“పత్నీహిపారీణహ్యస్యశే”—అని వేదంలోనే చెప్పినారు. ధనమును సంపాదించుటకే పురుషున కధికారము గాని దానిని రక్షించుటకు, వినియోగించుటకు స్త్రీలకే యధికారమును ప్రసాదించినారు. కావున మన వేదములు, ఋషులు ఈ విషయములో పరమోపకారులేకాని ద్రోహులుకారు.

లక్ష్మి — అయితే ఎందుకండీ అంతబంధిస్తారు స్త్రీని

శా — అది బంధించడం కాదమ్మాయీ; అది భద్రం చెయ్యడం. రత్నాభరణాదులను పెట్టెలలో పెట్టి జాగ్రత్తచేస్తారు. చీపురు, తట్ట, బుట్ట, మున్నగువానిని బైటనే యుంచుతారు. మమ్ము బంధించినా రని రత్నాభరణాదులు పోరాడవచ్చునా ?

“తస్మాత్ స్త్రీయువతిః ప్రియా భావుకా”

యౌవనముగల చిన్నది యందరికి ప్రియమైనది మంగళకరమైనది అని వేదంలోనే చెప్పినారు. పురుషుడు ఎవరిపేరుపెట్టి యెట్లు తిట్టినా సహించును గాని తన భార్యపేరుపెట్టి తిట్టినా పొడిచి పొడుచుకొనును. హృదయరహస్యమును గుర్తెరింగినవారు దానిని నిర్బంధమని భావింపరాదు. ప్రేమమోహముల కట్టడి యని యెంచి సంతసింపవలయును. ఇంతకు వివాహములోని రహస్యము మీకు పూర్తిగా తెలుస్తే యీ చిక్కులన్నీ తమంతట తామే తొలగిపోతాయి.

లక్ష్మి— చేసుకున్నా మానినా తెలుసుకోవడం మంచిదేకాదా! దయచేసి చెప్పండి.

శా — వినండి. శాస్త్రప్రకారము ఒకస్త్రీని స్వీకరించుట వివాహము. ఈ వివాహాల నెనిమిది విధములుగా విభజించిచూపినారు. వాటిలోగూడా పెక్కు లవాంతర భేదము లున్నవి. వివాహం మూలమున వధూవరుల హృదయములు రెండున్నూ యేకీభవించును. నాటిమొదలు సుఖదుఃఖముల యందు, మానావమానములయందు, సర్వవిషయము లందున్నూ దంపతులకు నద్వైతభావమే యేర్పడును. ఎంతటితాపములనొందినా పరస్పరహృదయములకు పరస్పరమందే విశ్రాంతి గలుగును. ముదిమిచేగూడ నాదాంపత్యప్రేమ క్షీణింపదు. దినదినాభివృద్ధి నొందును. మంచిదాంపత్యముకంటె నీ విస్సారసంసారములో భద్రమైన వస్తువు మరి యొకటి లేదు. దంపతుల ప్రేమతంతువులు రెంటిని నొకటిగా జేర్చి గట్టిగావేసిన ముడియే సంతానము. ఎన్నడు ఇరువురి సప్తధాతువులు సంతానములో మిళితములై ఘనీభవించునో యదిమొదలు వారికి నేకీభావము అత్యంతము సుదృఢమగును. హరిశ్చంద్రుడు చంద్రమతిని విక్రయించి తానమ్ముడు పోయెను. ఆమె కినిసెనా? ధర్మరాజు ద్రౌపది నోడి తనోడెను. ఆమె కాదన్నదా? మీదుమిక్కిలి తన చాతుర్యముచే భర్తలను దన్ను విడిపించినది. దమయంతి ద్వితీయస్వయంవరమును చాటించినా తన్ను రావించుటకే యట్లుచేసిన దని హృదయరహస్యమును దెలిసికొని మిక్కిలి మురిసిపోయినాడు నలుడు. సర్వప్రపంచములోని వినోదములు, విలాసములు, చిత్రములు, విచిత్రములు, సంతోషములు అన్నియు దంపతులలోనే ప్రతిఫలించును. పరస్పరసన్నిధానమే పెన్నిధానము. అదియే ప్రత్యక్షస్వర్గము. ఆదాంపత్యవాహినిలోని ప్రేమతరంగములకు తరుగూ విరుగూ లేదు. అందు సర్వము స్వేచ్ఛయే. సర్వము స్వతంత్రమే. స్వపరభేదమునకు నాదాంపత్యమున నిలువ నీడయే లేదు. ఒకచేతికి దెబ్బతగిలెనా రెండవచేయి దానిని నిమురును. అందులో దేనికిని న్యూనాధికభావము లేదు. భర్త గతించెనా సహగమనమును చేయునంతటి యతిగాఢప్రేమ, యెంతటి మహామోహము ఒక్క భారతభూమియందే నెలకొన్నది. భార్య మరణించెనా తిరిగి వివాహములేక విధురుడై యామరణాంత ముండుట మన చరిత్రలోనే కానవగును. స్త్రీల పాతివ్రత్య మహిమయు, నద్భుత దాంపత్య

బంధమును మన యసాధారణ భారత కీర్తిలతకు మూలాలవాలములు. ఈరెండే ఖండాంతరవాసులను నాశ్చర్యనిమగ్నులను జేసి వేయివిధముల భోగ్యతల నొందినవి. అట్టి భారతకీర్తికి హస్తావలంబము నీయ వీరే వలంతులు. పాశ్చాత్యనాగరకత ఎవరస్టు శిఖరాధిరోహణమును జేసి నేడు తలక్రిందుగా తిరుగబడుతున్నది. దాని వ్యామోహములో జిక్కితిమా వారికంటె నధోగతి పాలగుదుము.

లక్ష్మి— పురుషుడు భార్యయుండగా మరియొకదానిని పెండ్లియాడుచున్నాడు. ఇది న్యాయమా ?

శా — వివాహమునకు సంతానము ముఖ్యఫలము. అది లేనిచో మొదటి భార్యయనుమతితో రెండవ యామెను పెండ్లియాడు మని చెప్పినారు. మొదటి భార్య స్వయముగా అగ్నిహోత్రము నీయవలయును. దాని సాక్షిగా రెండవ యామెను పెండ్లియాడవలయును. ఆమె యగ్నిహోత్రము నీయకుండినా ద్వితీయవివాహము శాస్త్రప్రకారము సిద్ధింపదు.

సు — నేడు అట్లె జరుగుతున్నదండీ?

శా — శాస్త్రము, పూర్వాచారము లట్టివియని చెప్పినాను. వానిలో దోషము లేదు. నేడు సర్వము కట్టతెగి పొంగి పారలిపారుచున్నది. దానికి పూర్వులనుగాని, వారి పద్ధతులనుగాని ఎంత మాత్రము నిందింపరాదు.

లక్ష్మి— శాశ్వతబ్రహ్మచర్యం స్త్రీలకు కూడదా ?

శా — కొందరు బ్రహ్మచారులు బ్రహ్మచారిణులు కూడ దేశమున కవసరమే. కాని యీ కాలమున బ్రహ్మచర్యము మహత్తరకష్టము. మహాప్రమాదకరము. కాన దూరదృష్టిగలవారు ఇక్కాలమున బ్రహ్మచర్యముకూడదని నిషేధించినారు

సుం — అంతకష్టమండి బ్రహ్మచర్యము ?

శా — అంతకంటె వేరొకటి కష్టములేదు. గాలి, నీరు, ఆకు, అలము తిని తపస్సుచేసిన మహాయోగులు విశ్వామిత్ర పరాశరాదులుకూడా తప్పుద్రోవను బడినారు. మనము ఉల్లా ? వాశా ? సముద్రమునంతను త్రాగుటకంటెను, మేరు పర్వతమును పెకలించుటకంటెను ఇంద్రియములను నిగ్రహించుట మహావిషమ మని యర్జునుడు కృష్ణునితో స్వానుభవమును జెప్పుకొన్నాడు. నిజమయిన బ్రహ్మచర్య మనగా స్త్రీపురుషులు ఒండొరులను స్మరింపకుండుట. పేరునుగూడ బేర్కొనకుండుట. ఆట, చూపు, రహస్యసంభాషణ మున్నగు నవికూడ లేకయుండుట. ఇట్టి బ్రహ్మచర్యము సాధ్యమా ? మనస్సాక్షిని మేల్కొలిపి సత్యమును చెప్పినచో కోటికి నొక రుండుట కష్టము. ఒక్కొక్క సమయమున నింద్రియప్రకోపము నూరు తేళ్లు ఏక కాలమందు శరీరమంతట కరచి నట్లుండును. దానిని జయించుట మానవ ప్రకృతికి నతీతవిషయము. జీవులు ప్రకృతికిలోబడి ప్రవర్తింతురు. నిగ్రహము కష్టసాధ్యమని గీతలలోనే చెప్పబడినది. పలువురు బాలురు బాలికలు బ్రహ్మచర్య మనుపేరుతో పిరాలాపములను బలికి కొంత కాలము గడచినపిదప పరమనీచకృత్యములకు లోబడి ఛీ ఛీ యనిపించుకొన్నారు. అసువులను గోల్పోయినారు. ఆత్మహత్యలను జేసుకున్నారు. ఇంటికి ఒంటికి నపకీర్తి తెచ్చినారు. చేతులు కాలినపిదప నాకులు పట్టిన లాభ మేమి ? ముందుగానే భవిష్యత్తు నూహించి సంసారమార్గమును బట్టుట మంచిది దినమున కెన్నియో ఫలాహారములు భోజనములు వింతవింతరుచులు, గంటకొకవింత వింతవేషములు, పెక్కువినోదాలు ఇట్టి యుద్దీపక సామగ్రిలో మునిగి తేలియాడుచు బ్రహ్మచర్య మనుట దాని పరువుతీయడం. అది సిగ్గుచేటు. కొలది కాలముక్రిందట బాలికలు పెండ్లియనిన ముసిముసి నవ్వులతో మురిసేవారు. నేడు పెండ్లిపే రెత్తుట యనాగరకత. కొలదిదినములలోనే దీని విపరీత పరిణామం లోకానికి తెలుస్తుంది. దేవుడు ఏడమ్, ఈవులను దంపతులై తిరిగి సృష్టిచేయు డని యానతిచ్చెనని విందుము. క్రిందటి జర్మనీమహాసంగ్రామానంతరమున పలుదేశములవారు ప్రజాసృష్టికై పెక్కుపాట్లు పడినారు. తన యాత్మను తాను

చంపుకొనుటకు యత్నించువానిని ప్రభుత్వం ఎందుకు శిక్షిస్తున్నదో మీరు చెప్పండి.

లక్ష్మి— వాని తల్లిదండ్రులు మున్నగువారికి దుఃఖము కలుగుతుం దని.

శా — విచారించేవారు లేనపుడు హత్య చేసుకొన వచ్చునా ?

సుం— అదికాదండి. ప్రతిజీవి సంఘమునకు నొక యవ యవము. తన కృత్యమును జేయక హత్యాప్రయత్న మును జేసినందుకు శిక్షార్హుడు.

శా — సరిగా చెప్పినావు. స్త్రీపురుషులుకూడా సంఘావయవములే. వారును సృష్టిమాత్రమును పెం పొందించి తమ విధిని నెరవేర్చవలయును. కానిచో శిక్షార్హులే యగుదురు. శంకరులు, రామమోహనులు, శివాజీ మున్నగు మహాపురుషుల తల్లులు బ్రహ్మ చర్యమునే పాలించినచో దేశమునగతి యేమయి యుండునో తిలకింపుడు.

సుం— గంగకు కాలువకు పాటి!

శా — ఏ భూగర్భములోనే మహారత్న ముండునో యెవ డెరుంగును? బంగారుగర్భము లేవిన్నీ కావు. అన్ని మాంసమయగర్భములే. రామ్ సే మాక్డ నాల్డు జన్మతోనే ప్రధానమంత్రి యగునని యను కొనిరా ?

సుం— మా యూహ లన్నీ పెడదారినే పయనమును సాగిస్తున్న వండి.

శా — అది మీ దోషం కాదు. విద్యావిధానదోషం. తల్లిదండ్రులదోషం. మాదోషం.

లక్ష్మి— ఈవిద్య తప్పంటారా ?

శా — విద్య తప్పనను. విధానంతప్పంటాను. ఈవిధాన ములో నొకవిద్యార్థికైనా తన మతమునుగూర్చి యొకయక్షరమైనా తెలుస్తున్నదా? తల్లిదండ్రులు, గురువులు, దానిని బోధిస్తున్నారా? మహమ్మదీ యులు మనదేశాన్ని అయిదు వందలు సంవత్స రాలు పాలించినా వేషభాషలలో నించుకైనా మారలేదు. ఇంగ్లీషువారు ౧౫౦ సం॥లనుండి మనతోనే కలిసిమెలిసియుండి పాలిస్తున్నా వేషం మారలేదు. మనమో కోతులవలె పరుల ననుకరిస్తు న్నాము. ఒకరికట్టు, ఒకరిబొట్టు, ఒకరిపలుకు, ఒకరి తళుకు. ఆంధ్రుడు ఆంధ్రుడనిపించుకొనుట యనా గరికత. తనవానితోగూడ తనమాతృభాషతో మాట్లాడరాదు. అడిగా సగపాలు ఇంగ్లీషు. మీ యింట ఎపుడు పెండ్లి? మండే పెళ్లి-అని సమా ధానమును జెప్పెదరు. సోమవారమని పలుక చివ రకు రాదు. బెంగాలీవారు ముమ్మందు వాంగ్ల భాషకు స్వాగతమిచ్చినన్నీ పిదప మరలి మాతృ భాషా దేవిని పూజించి సాహిత్యములో, శాస్త్ర ములలోన, జగ త్తంతటను నేడు వాసికెక్కినారు. ఈ తెలుగువలువు గంగాయమునల సంగమములో అలజడి యెక్కువ యయింది. ఏభాషలోనయినను విద్య(జ్ఞానము) పూజ్యమైనదే. కేవల పరీక్షకు ౩౫ మార్కులకు జరుపుటలోనే వింతవింత వికా రాలు పొడచూపినవి. ౩౫ మార్కులు చాలునంటే ౬౫ తప్పులుచేయుటకు నించుమించుగా ననుమతిని దయచేసినట్లే కదా! స్త్రీలకు ౧౨ సం॥లకు కలిగే జ్ఞానం పురుషులకు ౧౮ సం॥లకుగాని కలుగబోదు. స్త్రీలకు ౫౦ సం॥లకు సర్వశక్తులు ఉడుగును. పురుషునకు యావజ్జీవము శక్తులు దీపించును. ఇట్టి భిన్నప్రకృతులకు ఒకే విద్యా విధానము ఎట్లు చక్కబడునో నే నూహింపజాలను. స్త్రీల కుద్యో గాపేక్షయే లేకపోతే ఈ విద్యావిధానములో సగ పాలు వృథాప్రయాసం?

ల — స్త్రీలకు సర్వవిషయముల నుద్యోగము కూడ దనియేనా మీ నిశ్చితాభిప్రాయం?

శా — పురుషులతోపాటు సగపాలు ధనార్జనాభార మును స్త్రీలు మోస్తామంటే యే పురుషుడు కా దంటాడు ? కాని ఒకటి రెండయితే గురుత్వంతులు అంతకు మించితే బొల్లిగద్దలు. స్త్రీలు కొలది గానే యుద్యోగములో ప్రవేశించినారు గనుక మర్యాదగా చూస్తున్నారు. సంఖ్య పెరిగిన సది దక్కదు. స్త్రీల సర్వాంగ కోమల రమణీయ భావములే కవితా సామ్రాజ్యమునకు మూలబల

ములు. ఉద్యోగములో! నవి నావాటికి కృశించి పోటువారును. సత్యముగా బురుషులలో శౌరుషము నేతిబీరకాయ. స్త్రీలలోనే యది మెండు. అట్టి తమ పౌరుషము నుద్యాపన చేసి కలము పట్టవలయును. శిశుసంరక్షణ గృహకృత్యనిర్వహణాదులను బరులచేతిలో బెట్టవలయును. అది మంచిపద్ధతి యని తలచితే యుద్యోగము చేయవచ్చును—

మాకు పూజాపురస్కారములు అక్కరలేదు. మేము శాలలో కట్టుబడి యుండజాలము. మీవలె నెండకు వానకోర్చి మునకాళ్లపోట్లకూ కొరడా దెబ్బలకూ తాళి బాటలలో బండ్లు లాగలేము. పొలములలో దున్నలేము అని యావులు తగవు పెట్టితే యే యెద్దయినా కాదంటుందా? ఇదిన్నీ యట్టిదే. ఉద్యోగము మేడిపండు, పయోముఖ విషకుంభము. తేనెపూసిన కత్తి. మురికి కాలువలో సువాసన. ఉద్యోగములో గౌరవము, ఎండమావులలో నీరు సమానముగానే యుంటవి. పొట్ట గడవకపోతే ముష్టితరువాత చేయవలసినపని యుద్యోగము. అనగా బానిసవృత్తి—

సుం— శ్రమ యిచ్చినాము. స్త్రీలదాయ విషయములో మీయభిప్రాయం చెప్పండి.

శా — తాను పుట్టింటిదాయమును మోసుకొని పోవుసరికి నత్తింటిపడుచులు తమదాయమును వారు మోసికొనిపోయి యుందురు. ఇరువురకు మోతశ్రమయే మిగులును. దాయభాక్కులగు స్త్రీలను పోషించు బాధ్యత పురుషులకు తగ్గును.

సుం— అట్లయినా స్త్రీకి తనహక్కుగా కొంత యాస్తి యుండుట మంచిది కాదండి.

శా — వివాహకాలమున పితాదులు అత్తవారొసంగిన స్త్రీధనము తనకున్నది. మనపూర్వపద్ధతి ప్రకారము భర్తృగృహమునకు తానే సర్వాధికారిణి. త్యాగభోగములు రెండున్నూ తనవే. తాను పెట్టినదే భర్తకు ప్రసాదము. ఇట్టిస్థితిలో నొకయింటిలో రెండు ధనపేటికలు, రెండు తాళంచెవులు, ఆ ధనమునకు వేర్వేరు సంరక్షణ బాధ్యతలు, నిజమైన యైకమత్యమునకు గుర్తులుగావు. దంపతులలో నొక విషయమున విభాగము జనించెనా అది యంతటను వ్యాపించును. దరిద్రకుటుంబములలో జనించిన యుత్తమకన్యకలకుమాత్రము తగిన సంబంధములు చేకూరుట యసంభవము. పురుషుని విషయంలో సోదరి దాయమును నేకరించును, భార్య తీసికొని వచ్చును. ఇందు పురుషునకు లాభనష్టములు సమానములే. స్థిరాస్తులను జీల్చుట, దూరమందున్న తోబుట్టువులు వాని ఫలములను రాబట్టుకొని యనుభవించుట సుకరములుగావు. ఏది యెట్లున్నను బురుషులు దీనికై తగవులాడరని నా నమ్మిక—

సుం— చాల శ్రమ యిచ్చినాము. లోనికి బోయి యల్పాహారమును గైకొందము; రండు. (మువ్వురును గృహములోని కేగుదురు.)

(శేషమ్మ ప్రవేశించి)

శే —శాస్త్రిగారూ! చిరకాలానికి దయచేశారు. మాసుందరి తనమాటే కాని ఎవరుచెప్పినా ఖండించి వేస్తుంది. నేను పెద్దదానను. నాచేతితో దాని తలపై నక్షతలు వేసేటట్లు బాగా బోధపరిచారా?

శా — అమ్మా! చిన్నసంగతి చెప్పుతాను. ఒకతర్క విద్యార్థి నూనె కొనుటకై గానుగవాని యింటికి స్వయంగా వెళ్లి నూనె కొని మెడగంటచప్పుడుతో గానుగచుట్టూ తిరుగుతున్న యెద్దును జూచి ‘ఎందుకు ఎద్దుమెడలో గంటకట్టినా’వని గానుగవానిని ప్రశ్నించినాడట. ‘నేను ఇంటిలో పనిపాట్లకు పోయినపుడు గంటచప్పుడును బట్టి ఎద్దు తిరుగుతున్నదీ లేనిదీ తెలుసుకొనుటకు కట్టినాను’ అని చెప్పగా విద్యార్థి ‘తాను తిరగకుండా నిలిచి మెడత్రిప్పి గంటచప్పుడు చేస్తే నీ కెట్లు తెలియు’నని యడుగగా గానుగవాడు ‘బాబూ! మాయెద్దుకు అంతతర్కం రాదు.’ అని సమాధానం చెప్పెనట. సుందరి స్వతఃచతురయినది. అందులో లాజిక్ చదివింది. మనమాటలు నిలువనిస్తుందా?

సుం— మాలాజిక్కు అంతా మీతర్కానికి కన్నబిడ్డ కదండీ!

తా — సుందరమ్మ! పోయివచ్చెద.

సుం— నమస్కారాలు. తిరిగి మరియొకసారి దర్శనం దయచేయండి. తాముచెప్పిన విషయాలన్నీ ఈ లోపున బాగా మననం చేస్తాము. శ్రమయిచ్చినందులకు క్షమించండి.

అందరు నిష్క్రమింతురు.

---

## జాబులు :

ఆర్యా,

ఈ దిగువను నేను వ్రాయు విషయమును తాము పరిశీలింప ప్రార్థించుచున్నాను. ఈ మార్చి భారతియందు శ్రీమండా నరసింహాంగారి "మీరాబాయి" వ్యాసము చూచుభాగ్యము లభించినది. కథారచన సరళముగానే యున్నది. కాని చరిత్ర కాధారభూతమును, ముఖ్యమునగు "కాలము"నుగూర్చి యీ వ్యాసకర్త ప్రాధాన్యత యిచ్చినట్లు తోచదు.

సాధారణముగా వ్యాసకర్తలు చరిత్రయందు విఖ్యాతులను మహనీయులకు వారికి సమకాలికులు కాని అన్యులకథాంశములను అనాలోచితముగా జత పరుచుట ఆచారమై యున్నది. శ్రీ కృష్ణదేవరాయల కాలము నాటికి లేని పింగళిసూరన్నను రాయలవారికినీ, తెనాలిరామకృష్ణునకునూ జతపరిచి కొన్ని నిరర్థక కథలనుకూడ చెప్పుదురు. అట్లే మహావిఖ్యాతుడగు రాజరాజనరేంద్రునకు, ఆధారములేని చిత్రాంగీ సారంగధరులకథను అంటగట్టెదరు.

ఇప్పుడు మరల యీ వ్యాసకర్త మహాభక్తురాలయిన "మీరాబాయి"ని చూచుటకై మొగలాయి సార్వభౌముడగు అక్బరుచక్రవర్తి తాన్సేను సహితముగా వచ్చె నని వ్రాయుచు రత్నహారమునుగూడ బహూకరించె నని వ్రాసెను.

చరిత్ర చూచినచో మీరాబాయి రాణాకుంభుని భార్య. ఈతడు మీవారు దేశరాజు. శ్రీ. కో. లక్ష్మణరావుపంతులుగారి మహామ్మదీయ మహోదయగ్రంథమునందు పేజి ౪౭౮ లో యితడు క్రీ. శ. ౧౪౩౩ లగాయతు ౧౪౬౮ వరకు రాజ్యముచేసె నని వ్రాయబడియున్నది. అక్బరురాజ్యమునకు ౧౫౫౬ లో వచ్చెను. అనగా కుంభరాణా మరణించిన నూరు సంవత్సరములవరకు అక్బరు రాజ్యమునకు రాలేదు. అక్బరుకు సమకాలికుడు మీవారురాణా, ప్రతాపసింహుడు. రాణాకుంభునకు ప్రతాపునకు మధ్య కొందరురాజులుమీవారు రాజ్య మేలిరి. పైగా ౧౫౫౬ సం॥ పూర్వము మనదేశముల్లో మొగలాయి రాజులు లేరు.

అట్టిచో అక్బరు మీరాబాయిని దర్శించుటకు వచ్చెననుట యెట్లు పొసగును? అక్బరుచక్రవర్తి స్వయముగా వచ్చి మీరాబాయికి రత్నహారము సమర్పించినగాని మీరాబాయిఘనత వెల్లడి అగుటకవకాశము లేదా? వ్యాసకర్త కేవలము పుక్కిటి పురాణములనే అధారముచేసికొనుటకు బదులు చరిత్రను శ్రద్ధతో పరిశీలించరాదా? చరిత్రలో ప్రసిద్ధుడైనంత మాత్రమున ప్రతికథయు అక్బరునకే ముడిపెట్టుట హాస్యాస్పదముగా నుండు నని చెప్పుటకు సాహసించుచున్నాను.

భవి:దిపాటి సీతారామయ్య

---

# భగ్నహృదయుఁడు

శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి

౧

నే నొక దగ్ధజీవనుఁడనే అయినాను - మదీయ మానసో
ద్యానమునిండ గుట్టలు పొదల్ కలబందలు గారకంప లే
కాని—పదే పదే పయిరుగాలికి నూగు గులాబిగుత్తులే
కానగరావు—'హాయి' యనగల్గునె యీ సుమనోవిహారికిఁ.

౨

నే నొక శుష్కజీవనుఁడనే అయినాను — మదాంతరంగిక
ధ్యానసమాధిలో వెకిలి దయ్యపుమూకల కొండకేక లే
కాని — ప్రసన్నభావకణికా లవలేశ విలాసమేనియుఁ
కానగరాదు — 'సిద్ధి'యన గల్గునె యీ పరితప్త మానికిఁ.

౩

నే నొక వ్యర్థజీవనుఁడనే అయినాను — మదీయ జీవితా
ఖ్యానమునందు క్లిష్టగతి కష్టసమన్వయ దుష్టసంధులే
కాని — సుగమ్యసుందర సుఖంకరసూక్తి సువర్ణపంక్తియే
కానగరాదు — 'బోధ'మన గల్గునె యీ బడిపిల్లవానికిఁ.

౪

నే నొక రంగభూషణమునే అయినాను — మదీయనాటకా
స్థానములో బుసల్ గుసగుసల్ సకిలింతలు చప్పరింత లే
కాని — 'సెబాస'టంచు రసికప్రవరుల్ తలలూచి మెచ్చుటే
కానగరాదు — 'ముక్తి'యన గల్గునె యీ నటనావిలాసికిఁ.

౫

నేనొక కష్టకర్షకుఁడనే అయినాను — మదీయబుద్ధి మా
గాణమునిండ ఒడ్డుమెరకల్ చిగిరింతలు రాలురప్పలే
కాని పసందుగా పసిడికంకుల వంగిన పంటపైరులే
కానగరావు — 'పుష్టి'యన గల్గునె యీ ముడిసేద్యగానికిఁ.

౬

నే నొక చిత్రకారకుఁడనే అయిపోయితి — నాదుకుంచెలో
పీనుగమొండెముల్ పునుకపేరులు కుంటికురూపి బొమ్మలే
కాని — వినూత్నయౌవన వికాస సముజ్జ్వల రూపరేఖయే
కానగరాదు — ‘తృప్తి’యన గల్గునె యీ తృషితాంతరాత్మకున్.

౭

నే నొక క్లిష్టగాయకుఁడనే అయిపోయితి — నావిపంచిపై
దీనగళంబుతో తెగినతీగలమీద విషాదగీతులే
కాని — రసంబు పొంగి పులకల్ మొలిపించెడి ప్రేమగీతమే
కానగరాదు — ‘సౌఖ్య’మన గల్గునె యీ రసలుబ్ధజీవికిన్.

౮

నే నొక నష్టజాతకుఁడనే అయినాను — మదీయజన్మచ
క్రాన కుజాష్టమాది కుటిలగ్రహచారపు నీచదృష్టులే
కాని — త్రికోణకేంద్ర శుభగ్రహవీక్షణ సామరస్యమే
కానగరాదు — ‘భాగ్య’మన గల్గునె యీ దురదృష్టమూర్తికిన్.

౯

నే నొక భగ్ననావికుఁడనే అయినాను — మదీయభావనాం
భోనిధిలో మహామకరముల్ సుడిగుండము లగ్గికొండలే
కాని — సుధా సుధాకిరణ కల్పక దివ్యమణీ వితానమే
కానగరాదు — ‘స్వర్గ’మన గల్గునె యీ యెదురీతగానికిన్.

౧౦

నే నొక దీనభిక్షుకుఁడనే అయినాను — మదీయ జీర్ణగే
హాన దరిద్రదేవత మహావికట ప్రళయాట్టహాసమే
కాని — యదృష్టలక్ష్మికడకంటి సుధామధురార్ద్రదృష్టియే
కానగరాదు — ‘శాంతి’యన గల్గునె యీ కరుణాపిపాసికిన్

---

# ఘాత*

శ్రీ ముద్దా విశ్వనాథం

[శంకరం - కొండప్ప వీథిలో]

శంకరం — వోరే కొండిగా! అదంతా ఫస్టు రంగూన్ కలప. ఒకొక్క దూలమే చేస్తుంది యాభయ్యేసి రూపాయిలు. దానిముందు ఉక్కుంగునూ పనికిరాదంటే నమ్ము. ఒక్క ద్వారానికైనా ఇనప మేకు లేదుకద. భవనం చూసవస్తూ సిమెంటు చపటాలే కాని, మచ్చుకయినా ఒక్క పెంకుముక్క అవుపడదు. అంతా మద్రాస్ ఫేషను. అంతా కోటకి మించిన భకడ్బందీ. ఆ పంఖిణీయే వేరురా. నిజంగా ఆ హవేలీ చూడని నేత్రాలు నేత్రాలే కావంటాను.

కొండప్ప — వోరి బ్రహ్మజమానవా! నీ కొచ్చాలన్నీ మనదగ్గిరకొయ్యకు. చేతులో పిక్క ఆడుతూవుంటే—మద్రాస్ ఫేషన్లే కాదు, లండన్ ఫేషన్లూ ప్యారిస్ ఫేషన్లూ కూడా నేను తెచ్చిపెడతా.

శంకరం — రేడికావులే. డబ్బుండంగానే సరా, దేవుడిచ్చినందుకు సార్థకంగా తనింత తిని, ఒకళ్ల కింత పెట్టడం మన గోపాలంగారొక్కడికే చెల్లింది. ఆ మారాజు మూడంతస్థుల మేడ కట్టాడూ అంటే - తెస్సాదియాన్య, "దేవీభవనం" రాజధానంతటికీ పేరెల్లిపోయింది గదుట్రా! —

కొండప్ప — ఆ!- అయితేనేం లోకం — గోపాలంగారూ, సీతాలంగారున్నూ! పాతికేళ్ల నాడు పోటీ గీటీ లేదుకాబట్టి, రైసుమిల్లు పెట్టి ఇష్టమొచ్చినట్టుగా దోచుకున్నాడు. ఇంకిప్పుడా పప్పు లేం ఉడకవ్. నీరూ నిప్పూ పుట్టని కుగ్రామమైనా సరే, బియ్యం మరపుండితీరాలి. ఎక్కడో మా కెందుకు?— మన వెంకటాపురంలోనే పక్కలో బల్లెంలాగ కోటయ్యగాడు మరోమిల్లు లేవదీశాడా? వాడూ గోపాలమూ-ఒకళ్లని కాదని ఒకళ్లు రేట్లు కోసుకున్నారా? ఆఖరికది వాళ్లకి గొంతుకోతగా పరిణమించిందా?

శంకరం — హేఁ!- కొండకో గొర్రె ఢీకొట్టడమా? అందుకనే కోటయ్యకి పుబ్బరంగా తిరుక్షవరమై, దివాలా తీసి, మాసిపోయి మట్టి మయాడు. పురాతనంగా పాతుకుపోయిన గోపాలంగారితో ఈ దాతృగ్యశిరోమణికి పోటాపోటీలా? ఒక్కనాడు ఆయన ఎడంచేత్తో దానంచేసినపాటి లేదు, వీడి ఆస్తంతా పోగు జేస్తే...

కొండప్ప — గోపాలమే కాని, మరెవ్వరూ బతక్కూడదా యేమిట్రా, ఆయనేం, వూరికి పుస్తె కట్టాడా?

శంకరం — నువ్వేమనూ. ఇవన్నీ బతికదలిచి చేసే పన్లు గావు. అయినా, అదేమిటో గాని, మాయలోకం—నాలుగురాళ్లు వెనకేసుకున్నవాణ్ణి చూస్తే అలోమని యేడ్చిపోతుంది; కళ్లల్లో నిప్పులోసుకుంటుంది.

కొండప్ప — వోరే శంకరీ!- మొత్తానికి గోపాలం బంగారు పిచ్చిక. పెట్టి పుట్టాడు, కలిసొచ్చింది. దైవం తిన్న జూశాడు, ఖాపుటా-యెగిరింది. అంతవరకూ చెప్పు,

* మద్రాసులోని ఆల్ ఇండియా రేడియో కేంద్రమునుండి బ్రాడ్‌కాస్టు చేయబడినది

ఒప్పుకుంటాను, ఆయనగారు మూడంతస్థుల మేడ కడితే ఎవడి కేమిటి గొప్ప!

శంకరం — ఎవడి కేమిటీ!- మన వెంకటాపురం లో ఇటువంటి ధర్మదాత ఉన్నాడంటే మనకే గొప్ప...

కొండప్ప — మహా దొడ్డదాత దొరికా డిలాగయితే యేం. సంతోషించాం; చాలించు.

శంకరం —అరేయ్ కొండా! రే పొచ్చే వవరా త్రులతో కలిసి గోపాలంగారి నూతన గృహప్రవేశ మహోత్సవం. ఇదుగో గాన కచ్చేరీలు జరపటానికి మైసూరునించి ఆస్థానవిద్వాంసులు దిగబోతు న్నారు. తెలిసిందా? మరి - దేముడు చాలాచాలా మేలుచేస్తే, తంజావూరునించో శ్రీరంగం నించో గాని సానాయిమేళాలు, - ఇంకా, వాటి దుంపతెగా, ఏమేమిటో చిత్రాలు ట్రా...

కొండప్ప —అవున్లే. వూళ్లో పెళ్లయితే, మధ్యని కుక్కలకి అడావిడిపొచ్చుట. అలాగ్గా...

శంకరం —వోరే కొండిగా!-ఆతొమ్మిదిరోజులూ- అప్పనకూ యిప్పనకూ అనకుండా - చాతు ర్వర్ణాలకూ, - హా. హ్హా. హ్హా! – షడ్రసిమిది పిండివంటలతో నిరతాన్న మహాప్రదానం... విన్నావా!—

[ప్రవేశం : పోలిగాడు]

కొండప్ప — ఏవిరోయ్, పోలిగా!–

పోలిగాడు — దణ్ణాలండి బాబయ్యా.

కొండప్ప — ఇలా రారా, గాడిదకొడకా! ఏవిటా తొందర?—

పోలిగాడు — యీాది యీాదంతా - ఆ కణ్ణెంచి ఈ కడికి పందిళ్లేసుకు రావాలండి. మరిగంటే, రాటలకోసఁవని తుమ్మలబీళ్లోకెళ్లొత్తా వండి.

కొండప్ప — అవును గానీ వోరే! నిన్నో సంగతి అడ గాలి. మర్మం లేకండా చెబతావా, లేదా?

పోలిగాడు — అడక్. తెల్పువండీ, ఇయాలకు వంద నుం దడిగ్రెను. యేమో, నిజం బగమంతు డికే తెలాలె. మా దొరగారి బవనం మని షిని మింగుతానంటదంట. వూళ్లో యెక్కడ సూశినా యిదే గోల!

కొండప్ప — పళేలే. నువ్వెళ్లు. పని చూసుకో,

[పోలిగాడు వెళతాడు.]

విన్నావుట్రా, శంకిరీ!- జనవాక్యం!- నాలుగురోజులు మెతుకులకోసమున్నూ, సంభావనడబ్బులకోసమున్నూ ఆశపడి, లోకం కోరు మయ్యడానికి చూస్తావుట్రా అబ్బాయ్?

శంకరం — అడుగడుగో. వృద్ధజంబుకం- పఠాభి తాత దిగుతున్నా డెందుకోగాని.

కొండప్ప — పఠాభితాత నిజంగా పూర్వపుణ్యం కొద్దీ అవతరించా డనుకో, మన గ్రామం లో. ఢిల్లీ కెళ్లినా ఆయన మాటకి తిరుగు లేదు. అంత ఘరానా!—

రండి, రాండి తాతగారూ! ఇప్పుడే మీ మా టనుకుంటున్నాం.

[ప్రవేశం పఠాభి.]

పఠాభి — తల చెరిసిపోయిన ముండావాణ్ణి- నా మా టెవరు లక్ష్యపెడతారు నాయనా! ఏదో- ఈనాలుగురోజులూ 'రామా, కృష్ణా' అని గడిపేస్తే, కళ్లు మూశేస్తాం, వొదిలి పోతుంది.

కొండప్ప — ఇంకా నయం. మీవంటి పెద్దబుర్రలు ఉండబట్టే, కొస్తంత మనగ్రామం ఇలా అయినా వుంది.

శంకరం —నిజమే. మనవూరికి మణిపూసలాగ గోపాలంగారంటూ ఉండబట్టే ఈమాత్రం

వాపయోగ్యంగా వుంది; ఈపాటైనా సవ్యంగా నడుస్తోంది కాలం.

పట్టాభి — పరమ లుచ్ఛా...ఆ పాపాత్ముడి పేరు నా దగ్గర ఎత్తకు. వాడినిండే నిక్షేపంలాంటి వెంకటాపురానికి పీడపట్టుకుంది...

కొండప్ప — అటువంటి మనిషి ఈ జిల్లా మొత్తం మీద లేడంటాడండి మన శంకరం.

పట్టాభి — వా ద్రోహి ఛండాలపు ముండాకొడు కంటే నమ్ము కొండయ్యా. మొన్న ఎలక్షన్లలో మన వోట్లన్నీ కూడగట్టుకుని, తన రైస్‌మిల్లుకి సరాసరి తోడేయించుకున్నాడు కదా! అదలా వుండనీ. మొన్న నీమధ్య కొత్తగా రప్పించిన పెద్దమిషన్లు రెండింటికీ - కన్నుమూసి తెరిచే లోపల - ఓ నాటకంపెండాలంత గోదాం కట్టించిపారేశాడు, తెలుసా?- దీనికంతకీ వాడి బాబుగారి ముల్లె ఎక్కణ్ణించి తెచ్చిపెట్టాడనుకున్నావ్ ? - కుర్ర వాజమ్మలకి ఈ పాలిటిక్సన్నీ ఏమి అర్థం అవుతాయి. తెల్లటి వన్నీ పాలే అనుకుంటారు!—

శంకరం — కొండా! నే నిందాకానే చెప్పాగాన ట్రా - పచ్చగా ఉన్నవాణ్ణి చూస్తే దిక్కుమాలిన లోకం కన్నుకుట్టుకుంటుంది......

పట్టాభి — ఓరి కుర్ర దామోదరుడా! - నిప్పులేందీ పొగపుట్టదోయ్. నిన్నగాక మొన్న పుట్టి, నాకు ధర్మపన్నాలు చెప్పొస్తున్నావా ?

కొండప్ప — వాడితో తేమిటి పోనిద్దురూ తాతా!- ఇప్పుడిస్కూలున్న బిల్డింగూ - మన గోపాలంగారు దానం చేసిందేటగా! అందుకనే అందరూ ఆయన్ని మహానుభావుడంటారు ...అయినా, దీని అంతర్యం మీకు తెలియాలిగానీ......

పట్టాభి — గ్రామం యావత్తునీ మంత్రించినట్టుగా ఇలానే కట్టేశాడు...వె-ధ-వ! - ఉత్తి చవటలు కాకపోతే, - ఇటువంటి దివ్యసౌధం చేతులారా ఎందుకు ధారపొయ్యాల్సొచ్చిందీ అనే పాయింటు ఒక్కళ్ళయినా ఆలోచించారూ ? నన్ను రెచ్చగొట్టకు కొండయ్యా, ఇవన్నీ చాలాకాలమై వొదిలేసుకున్నా.

కొండప్ప — అలా అంటే కాదు, తాతగారు. నిజంగా, మీ రో వొద్దు కాయబట్టిగాని, వెంకటాపురం అంధకార బంధురంలో పడిపోను గదండీ!

పోనీగాని, — ఇప్పుడు కొత్తగా కట్టిన మూడంతస్థుల మేడని గురించి - ఊరూవాడా పుకార్లు మోగిపోతున్నాయి కదూ, మరి పెద్దలు మీ వుద్దేశ మేమిటి ?

పట్టాభి — ఓరి అబ్బాయిలూ! మన గోపాలంగారు రైస్‌మిల్లు కట్టాడు చూడండీ. అది కట్టినప్పట్లోనే దేవత నరబలి కోరింది.

మరి వొచ్చి, అక్కడ పనిచేసే కూలీల్లో ఒకడు అప్పటికప్పుడు అదృశ్య మయిపోయినట్టు లోకం చెప్పుకోవటం జ్ఞాపక ముందా? అయితేమటుకి చెట్టుని ఒక్క ఆకు రాలిపోయింది. ఎవడి క్కావాలి ఆసంగతి. వూరూ పేరూ లేని వెంకటప్పయ్యలకోసం ఉన్నాడా చచ్చాడా అని వెతకటానికి ఎవడి కంత పట్టింది. ఏదో ఆషామాషీ - మసిపూసి మారేడుకాయ - చేసేశారు, ఐపోయింది! - గప్ చిప్ !!—

కాదుగానీ, తెలియ కడుగుతాను: ఎటువంటి ఉగ్రశాంతులూ జరపందీ మన గోపాలంబాబు ఇంతటి మొనగా డయినాడోయ్ పిచ్చిపుల్లయ్యల్లారా!— నాకింక తిక్క త్తించకండి. తీగ తీస్తే డొంకంతా కదుల్తుంది... [వెళ్ళిపోబోతాడు.]

కొండప్ప — తాతగారూ! మీరు కోపగించి వెళ్లి పోతే కాదు. పిల్లలవాళ్లం. ఇంటిల్లి పాదీనీ హడిలిపోతున్నాం. మీరే దో వొక ఉపాయం చెపితే కాని, గుండె తాళకుండా వుంది. ఉళ్లో ఒక్కళ్లా కణం కొరకటం లేదు, కన్ను మూయ్యటం లేదు. బెంగెట్టుకు ఛస్తున్నారు...

పతాభి — మనదేవత ఊరుకున్నంతసేపే గాని, కలుచుకుందిరా అంటే కుటుంబాలు కుటుంబాలే ఎగిరిపోతాయన్నమాట. అంతటితో వూరుకోదు. గ్రామాన్నంతటినీ ఒక్క కబళంకింద వూడిపారేస్తుంది. ఇహ నే నేమీ చెప్పను.

* * *

[కాళికాదేవి ఆలయం: ప్రజల కోలాహలం.]

(గంటలు మోగిస్తూ, పురోహితుడు మంత్రాలు చదువుతూవుంటాడు. జనం తోసులాడు కుంటూవుంటారు.)

"కల్పిగోచింది - కాళీకోచ్చవం చూస్తే మన వెంకటాపురంలోనే చూడాల. కలకత్తాలో కూడా యింత విస్తరం లే దంటరా!"

"ఓహోహో! ఏమి ఆ కళాసౌందర్యం! ఏమి ఆ జవహారిరి వైభవం!!"

"ఒరేయ్, మెళ్లో ఆ మణిపిపుత్రె చూడరా. ఉః - ధగధగలాడుతూ - తళుక్కు మంటూ - అఖండం దేంతో చేశా రంటవ్?—"

"కాళీమాయీ, తల్లీ! ఆదిశక్తీ! - రక్షించు, రక్షించు! - మమ్మల్ని చల్లగా చూశావంటే, వచ్చే పండక్కి మదు పేకపోతుల్ని..."

"హా-హా-హ్హా... బాపన జల్మెత్తలేదంటయ్యా!-"

పురోహితుడు — హరహరహర-ఓం...—"

"హూం! తల్లి పవిత్రపాదాలు రక్తప్రవాహంలో మునిగి తేలాల... రేయ్, రేశ్రేయ్..."

"వాకోక్, ఆ కోరలు చూడవోయ్. ఊరుదైనా సరే, టారెత్తి పరుగుచ్చుకోవాలన్నమాట."

[కాళీదండకం - ఇద్దరు పఠిస్తూవుంటారు.]

"శ్రీమన్ మహారేణుకాశక్తి దుర్గి మహామ్మాయి చాముండి కౌమారి కాత్యాయనీ చిత్రరేఖావతీ దైవ చూడామణీ రాజకంఠీరవీ లావణ్యసంభూత సౌభాగ్య లక్ష్మీ దయాంభోనిధీ రాజరాజేశ్వరీ మూలమంత్రాత్మకీ భజే సర్వరూపం నమో ఉగ్రరూపం నుతా శక్తిరూపం, శాంకరీ శాంభవీ శంకర స్వాంభవీ శృంగారధారీ ఓంకారరూపీ భవానీ భవస్మాయ కైల్వంగనే కొంతవాడన్, నీ వాతిలోకంబులెల్లన్ సృజింపన్ కృపాదృష్టి వీక్షింప, శిక్షింప రక్షింప త్రిమూర్తి స్వరూపంబులన్ దాల్చి వర్తింతువా తల్లి బ్రహ్మాండ భాండంబు లెల్లన్ తగన్ కుక్షిలో నుంచి వీక్షింతువో తల్లి,......దైత్యాళి రక్తంబు గ్రుక్కిళ్లతో గుక్కటన్ గ్రుక్కటన్ గ్రోలుచున్ కుంభి కుంభంబులన్ వ్రక్కలై ప్రక్క హుంకార ఫీంకారముల్ చేయ, కుంభినిన్ వేగ లంఘించి తద్దానవానీకము ల్బట్టి, ప్రాణంబులన్ గొట్టి పాశంబులన్ జుట్టి కుంతంబులన్ జీరి, బాణంబు ఖడ్గంబుచే తుండతుండీలు ఖండించి భూత ప్రేతాళ శాకినీ ఢాకినీ కోటులన్ తృప్తి పొందించ... కృపం జూచి రక్షించు కాళీ పరంజ్యోతి భూలోక మాతా నమస్తే నమస్తే నమస్తేన్నమః."

[మళ్లీ జనంలో ముచ్చట్లు]

"వొరేవ్, కుర్రాణ్ణి విగ్రహందగ్గిరకి తీసుకురా వొద్దంటే నీక్కాదూ? జడుసుకుంటాడు..."

"గోపాలంబాబుకి రొంత బత్తిరా దేవంటేను! అన్నీ తనే చూసుకుంటడు, తనే సేసుకుంటడు, దర్మపెబువు."

"ఆరి కమ్మొర్రు యిలువేలుపాక్. అందుకనే ఆంతోటి తాపత్రయం..."

"ఏఁవే, వెంకమ్మా! మీ చెల్లెలికి పురు దొచ్చిం దా?"

"ఇంకా లేదు పిన్నీ! మద్దినాల మా కుర్రాణ్ణి పంపుతా గానీ, జానెడు దొండతీగ ముక్క పంపిద్దూ."

"అరే, క్లైడీ ఫూల్! ఆడవాళ్లను రానుకు పోతావ్, కళ్లు నెత్తిమీదికొచ్చాయా?"

(గంట గణగణ మోగుతుంది.)

[దేవికి హారతి ఇస్తారు.]

పురోహితుడు —

"అందరూ రెండువరసలుగా కూచోండి, ప్రసాదాలొస్తున్నాయి."

* * *

[విరామం—ఆ గంటలు వినపడతాయి.]

కామేశ్వరి — బాబోయ్, బాబోయ్! — రక్షించండి నాయనోయ్ - ఆలస్యం చెయ్యకండి తండ్రోయ్ — నా బాబు నాకు దక్కడు, వెళ్లండి బాబోయ్ ... ఇంత మందీ కొయ్యబొట్టెల్లాటి మొగాళ్లుండి, దిక్కుమాలిన ముండని రక్షించ లేమ్రోవ్ —!

గుంపులోనించి ఒకరు —

"నీ పుసురు తగుల్తుందిలేవమ్మా గాడిదకొడుక్కి. పూరికే పోదులే..."

మరొకడు — "మాయలాడి దేముడికి ఈ దిక్కుమాలిన పక్షే కనిపించిందా!..."

ఇంకొకడు — పోవోస్. దేము డెక్కడున్నడు?- కలికమూర్తి నాలుగుపాదాలా కదం తొక్కుతావుంటే—"

ఉండండి, పట్టాభిగారు వస్తున్నాడు. దీనికి ఆలోచన ఆయనే చెప్పాల."

[ప్రవేశం: పట్టాభి]

పట్టాభి — "నేను మొన్ననే చెప్పలేదటయ్యా, ఆ మహానుభావుడు ఇదివరకే కూలివాణ్ణి బలిపెట్టాడనీ? ఎంత నెత్తురు పారందీ ఆమిల్లు కట్టడ మైందీ? ఇప్పుడీ మూడంతస్థుల శ్వేతాళగృహానికి ఎన్ని రక్తపుకాలవలు ప్రవహించాల్సివుంటుందో- బుద్ధిమంతులు మీరే ఆలోచించుకోండి, నే చెప్పటమెందుకూ."

ఒకడు : "తారగారూ, మీ రలా తప్పుకుంటే కుదరదు, ఈ వ్యవహారం. నడుంకట్టి పని చెయ్యాలి. ఇయ్యాళే ఆఖరైంది, రేపు మన మవుతం. తలమాసినముండా అలోమంటే గ్రామానికి అరిష్టం కామా?"

మరొకడు: "ఓ రెలవమ్మా!-తాతసంగతి నీకు తెలవదు. రాస్యం కొంతా పూడెయ్యటం...పుసిచ్చి వదిలెయ్యటం...అంతే...తక్కిన పనంతా మనం జరుపుకుపోవాల..."

ఇంకొకడు — "వోరేయ్, ఇందాకా కోలాటం చేశారు పిల్లలు. ఒకేళ వాళ్లతోగాని పొయ్యాడేమో..."

వేరొకడు — అప్పుడ్రోయ్. పద, పద. కనుక్కుందారి.

[కోలాటం]

"దేవకీపుత్రాయ
దేవదేవోత్తమాయ
భావజా గురువరాయ
భవ్యమంగళం॥

విమలరూపాయ వివిధ
వేదాంత వేద్యాయ
సుముఖచిత్తకార్మితాయ
శుభగమంగళం॥

రామచంద్రాయ జనక
రాజజామనోహరాయ
మామకాభీష్టదాయ
మహితమంగళం ॥...

కోటయ్య —"ఇదుగో ఇలా చూడండీ!—"

అందరూ — ఉండొరే, కోటయ్యబా బేటో సెబుతున్న డివండోశ్...

కోటయ్య — ఇవన్నీ రెయిందుకొచ్చిన కబుర్లూ అంట. తెల్లారితే రేపు మన గోపాలరావు పంతులుగారి 'దేవీభవనం' లో గృహప్రవేశం. మనం యిక్కడ వాదాలేసుకుంటూ కూర్చుంటే, కావలసిన కార్యం కాసా

అక్కడ చల్లగా జరిగి పూరుకుంటుంది. బలి అనేది సామాన్యంగా సుముహూర్తానికి ముందే జరిగిపోవాలి కనక, బహుశా ఈపాటికే ఐపోయుంటుందేమోనని నా అనుమానం. ఏదైనా పాపం, కుర్రకుంకది తీవాలు పుచ్చుకోకముందే తొందరపడాలి. తీరా, తరవాత ఏమనుకున్నా సార్థకం లేదు..."

(జనం) — "అవునవును"

" — "రైట్, పదండి!"

" — "వెళదాం, ఇప్పుడేవాడింటికెళదాం."

" — "తలుపులు బద్దలగొట్టి, సోదా చేదాం."

[కుక్కల మొరుగులు.]

" — "దురాత్ముడికి బాగా బుద్ధి సెప్పాల"

" — "ఓరి యెంకా! మాయింటికెల్లి, అటక మీద శాపాటి దుడ్లున్నయి, అయ్యన్నీ పట్రా...ఊ...ఇక్కడున్నట్టు రావాల"

(Clock strikes 11.)

" — "ఈడి బతుక్కి పారావా డొకడు! కొట్టేక్ ఒక్క టెంకిజెల్ల..."

" — "ముసిలికాలపు ముచ్చట్లురా, హా.హా. హ్హా!.."

" — "నసుమంతరపు సిరి - యేట మకున్నవ్!—హాస్లా పెళ్లా మంటుంది."

[తలుపులు బద్దలగొడుతూ]

" — "ఓరి మాయలముండా కొడకా, బలెయ్యటానికి నీకా సిక్కుమాలినదాని నిసుగే దొరికి నాడంట్రా?..."

" — "అప్పుడే అంతా ఐపోయింది గా మల్రా..."

" — "ఇదివరకెల్లా యేమిటో అనుకున్నాం గానీ, నీకిరాతకప్పనులన్నీ తెలిసొచ్చాయిలే. నిన్నూ, నీ మూడంతస్థుల మేడనీ నిమిషంలో నేలమట్టం చేశేస్తాం చూస్కో..."

కోటయ్య — మా వెంకటాపురానికి దాపరించిన ఓ బ్రహ్మరాక్షసీ! పిల్లవాణ్ని తీసుకురారా యివతలకి.

గోపాలం — పిల్లవాడెవరూ? ఎవరి పిల్లవాడండి కోటయ్యగారూ?...

(జనం) —"ఆ తియ్యటి మాటలు మాను. మెత్తటి పులి..."

" — "ఏమీ యెరగడు, ధర్మరాజు. ఖూనీల రాయుడు..."

" — "నిండుకుండ తొణకదండీ!..."

కోటయ్య — "అరేయ్, ఛటాచోర్!— నీ దేవత నరబలి కోరటం... కామేశ్వరి కొడుకుని నువు పొంది పట్టడం... చాలాకాలం క్రితమే కనిపెట్టాం. గ్రామం యావత్తూ ఒళ్లిలా కోడై కూస్తూంది. నీ వధ్వేపాలన్నీ లోకానికి తెలియవనుకోకు...."

గోపాలం — "అయ్యో దేముడా, పిల్లలకోసమని ఓమూల మేము తపించిపోతూ వుంటే ... నోరులేని కుర్రవాణ్ణి చంపడమా? రామ రామా!— మీ రెల్లా నమ్మారు ఈ కబురు కోటయ్యగారూ? ఎంత విడ్డూరమూ కాకపోతే, యేమిటీ పుకారు! సత్యప్రమాణికంగా పెద్దలు కట్టిన ఇంటికింద వుండి చెబుతున్నాను. నే నేపాపం యెరగను..".

ఒకడు —"ఈభడవాకబుర్లన్నీ మాకొద్దు. కామేశ్వరమ్మ కొడుకుని మీ యింటిదగ్గిర చూశాం. వాడిక్కడే మాయమైపోయాడు. ఇప్పుడు సోదా చెయ్యాలె."

గోపాలం —"అలాగే చెయ్యండి బాబూ. పాపం వుంటేకద భయపడ్డానికి!"

ఒకడు — "పాడు, పాపూ!..."

గోపాలం — "...అ-మ్మ—"

(జనం) — "ఒక్క గుంకి పోటు - మచ్చు సూపిచ్చరా.."

,, — "ఏమిటిశావ్. బ్రమయన్న నాకీ దుమ్ము తిరగెయ్యకె..."

,, — "వొద్దొద్దు...జీవం పోతే యేముంది. బుద్ది రావాల...ప్రాణి పుచ్చుకుని, ఇద్దిలాగ్గ వొక్క లెంపకాయ..." (ధ్వని)

[కుక్కల మొరుగులు]

,, — "చఛా. పని శేస్తే, జెన్మ జెన్మానికీ గేపక ముండాల...కుడికాలుది పనికిరాదు. ఊహూ...ఎడంకాలు పైజారుతీసి, ఒకటో రకమైన...(ఫడీ, ఫడీ... ధ్వని)

,, — "కసాయివోడయినా నయమే..."

గోపాలం — కోటయ్యగారూ !... మీకంత అనుమానం వుంటే నన్ను బలివెయ్యండి, కసి తీర్చుకోండి. దుర్భాషలాడకండి, బాబూ! ఎందుకింత ఆవేశం !

ఒకడు — "ఈ మెత్తటిమాటలు వింటే ఇన్నాళ్లూ గ్రామం కళ్లుమూసుకుంది..."

(జనం) — "అరేయ్, ఈ గుడ్డ సూశా ? — నెత్తురు మరకలు ! ఆఁ !!!—"

,, — "అయిపోవాది రోయ్, పిల్లాణ్ణి పొట్టనెట్టేసుకున్నాడు..."

కోటయ్య — "ఏమిటీ !—రక్తపుగుడ్డలా!!—

(జనం) — "దొంగనా కొడుక్కి శేరు లెలా వొచ్చినాయో ... మళ్లీ బాపన పుట్టక పుట్టాడు..."

,, — "ఏం పుట్టక పుడితే యేట్రా, నీతి లేకపోనాక..."

,, — "ఎంత ఘాత ! యెంత ఘాత ! !

,, — "మండ లిరగ్గొట్టేశా...ముందూ..."

కోటయ్య — "వద్దు. వద్దు. నోరు ఖాళీ చేసుకో వద్దు. వొంటిమీద చెయి వెయ్యొద్దు. క్రిమినల్ లోకి దిగిందంటే మనమని మనం శేరస్థుల మవుతాం. రాజయ్యా! ఆ నెత్తురు గుడ్డ జాగ్రత్తగా పట్టుకు పద. తరవాత సంగతి నే చెప్తాను.

(జనం) — "పి-ల్లల-పులి !!! "—

[అందరూ వికటంగా నవ్వుతారు.]

,, — "శేసు బనాయించనీ. పిల్లలపులి రంగు బయటపడితది! "

* * *

[పరుగెడుతున్న చప్పుడు.]

ఒకడు — " ఏమిట్రోయ్. అలా పరుగెడుతున్నవ్ ?"

మరొకడు—రామకోయిలకాడ...మున్నీబునాయుడు మీటింగంట...రా రా, సప్పని..."

* * *

మున్సీబు — సూడండి, అబ్బాయిలూ!—ఈయ్యాలం నించి గోపాలావుని యెంకటాపరంలో యెలేత్తున్నాం. ఎట్టివాళ్లు ఆపక్క తొంగి శూడకూడదు. ఒక్క పిట్టయినా అక్కడ వంగి వాలకూడదు. తెల్సిందా?—

అందరూ — యెల్లమండి బాబయ్యోరు. గిజామని చచ్చినా సరే, యెల్లమండి.

ఒకడు — ఇప్పుడా మేడయెంపు తిరిగి అందరూ ఛీ-ఛూ అని కొండ్రించి వుమ్మేస్తున్నరండి.

మున్సీబు — ఫట్టూ...బలేపని శేశినారు.

ఒకడు — అప్పుడే అది దెయ్యాలకొంప అని పేరడిపోయిందండీ.

మరొకడు — పడదూ?-పాపం పండితే యేమవుద్ది?-

మున్సీబు — ఇదుగో, ఈరోజు మొదలుకుని ఆరి మిల్లుకి యెవ్వరూ దాన్యం పట్టికెళ్లకూడదు. బంద్ కరో!— అందరూ కోటయబాబు మిల్లులోనే ఆడిచ్చుకోవాల.

అందరూ — అల్లానే.

మున్సీబు — మరి, యెవ జిల్లా సాచ్చికం శెప్పాలో...అదంతా నే సూస్తుంట...కోటయబాబు వొకీలుదగిర్నుంచి రాంగానే కబురెడ్తాను. యెల్లండి!—

* * *

[కోర్టువద్ద జనం]

"ఇవేళ అటో ఇటో తేలిపోవాలి."

"ఇప్పుడేం? రిమాండులో ఉంచిన్నాడే తేలిపోయింది."

"వోరే,—మనలో మనమాట — ఏమిటవుతుందంటావ్ ?"

"ఏటిరా దొఁగ్రిమొగ్గవా — న్యాయం పక్షీతే-పురికిక్కు పడి ఫ్రూరుకుంటుంది. అదృష్టం బాసుండి-అధికారిగానే కనికరించినాడంటే బాంగోలు కట్టేయ్యడం ఖాయం... నే చెప్పాను చూసుకో. ఫలానివాడు అన్నా వంటుగాని..."

"అదృష్టవంతు డయితే, జామీను మీదనే వొదుల్తారు."

"దేముడా! కోటయబాబు సాచ్చీకంమీద నెూసున్నదంట కే సంతానూ.;

"అవున్రోయ్. అన్నట్ల ఆఖరి సాక్ష్యం కోటయదేకాదూ. పదపద. వింటాం:

[కోర్టులో]

బంట్రోతు — ఉష్- సైలెన్స్. మాటాడకండి!—

* * *—

[కోర్టు వరాండాలో]

బంట్రోతు —"పిట్టల కోటయ్యగారూ!
పిట్టల కోటయ్యగారూ!!
పిట్టల కోటయ్యగారూ!!!—"

కోర్టుసుమాస్తా —
"దేముని యెదట —
"దేముని యెదట—
"ప్రమాణంచేసి—
ప్రమాణం చేసి —
"నిజం చెబుతాను —
"నిజం చెబుతాను —
"అబద్ధం చెప్పను —
"అబద్ధం చెప్పను —"

జడ్జి — ఆఖరిసాక్ష్యం కోటయ్యగారిది. ప్రాసిక్యూషన్ తరఫు వాదన కానివ్వండి.

ప్రాసిక్యూషన్ ఇన్స్పెక్టరు —
— ఏమండి కోటయ్యగారూ! గోపాలంగారు పిల్లవాణ్ణి చంపివేశారు కదండీ?

కోటయ్య — చిత్తం, అవునండి.

ప్రా. ఇ — పిల్లవాణ్ణి తీసుకువెళ్తాంటే మీరు చూశారు కదండీ?

కోటయ్య — చిత్తం, చూశానండి.

ప్రా. ఇ. కోలాటంభజనదగ్గిర మీరూ ఉన్నారు కామా?

కోటయ్య — నేనూ ఉన్నానండి.

ప్రా. ఇ. గోపాలం గారు ప్రతియేడూ శక్తిపూజ చేస్తారుగదండి?

కోటయ్య — చేస్తారండి.

ప్రా. ఇ. — గోపాలంగారు - శక్తికి నరబలి యివ్వటం మీరు ఎరుగుదురు కదూ?

కోటయ్య — చాలాకాలంనించీ పుకార్లున్నాయండి.

ప్రా. ఇ. — అయితే, కామేశ్వరి కొడుకుని తీసుకెళ్లి, అమ్మవారికి బలివేశాడనేకదూ?

కోటయ్య — చిత్తం. అంతేనండి, మరి. పిల్లవాడికోసం వెతకటికామండి ఏఖ్ఖడా దొరకలేదండి.

ప్రా. ఇ. — ఇదుగో, ఈరక్తపు మరకలున్న చొక్కా ఆ కుర్రాడిదే కదండీ?

కోటయ్య — అవునండి. ఇదే, ఈచొక్కా వేసుకున్నాడండి, కోలాటంలో.

ప్రా. ఇ. — గోపాలంగారిల్లు సోదా చూసినప్పుడు-మీరు పంచాయితీలో వున్నారుకాదూ?

కోటయ్య — చిత్తమండి. నన్నూ ఒక పంచాయితీదారుగా వేసుకున్నారండి.

ప్రా. ఇ. — ఈచొక్కా, ఈకత్తి గోపాలంగారిగదిలో - మీ యెదటనే కదండి, తవ్వితీశారూ?

కోటయ్య — చిత్తం. అప్పుడు నేనక్కడే వున్నానండి.

* * *

జడ్జి — ముద్దాయీతరఫు ప్లీడరుగారు ఇంకా యేమైనా అడగాల్సివుంటే అడగవచ్చు.

ప్లీడరు — ఏమండీ కోటయ్యగారూ! గోపాలంగారికీ మీకూ ఈమధ్యని నేస్తం చెడింది కాదూ ?

కోటయ్య — నేస్తం చెడ్డ మేమిటండీ. మేమూ ఆయనా రైస్‌మిల్లు వ్యాపారస్థులమేనండి.

ప్లీడరు — గోపాలంగారి మిల్లువల్ల మీ మిల్లుకి నష్ట మొస్తూందికదండీ?

కోటయ్య — అదేమన్న మాటండి! యెవళ్లదృష్టం వాళ్లది. ఆమాటకొస్తే, మామిల్లువల్ల వారికే దెబ్బండి.

ప్లీడరు — గోపాలంగారు పిల్లవాణ్ణి స్వయంగా చంపుతూవుంటే మీరు చూళ్లేదుగదండి?

కోటయ్య — అయ్యో. ఏమిటి మీ చేదస్తం. ఒకళ్లు చూస్తుండగా చంపుతాట్టండీ ?

ప్లీడరు — అదుగో ఆ మడతమాటలే వొద్దంట. నీకళ్లతో నువు చూశావా, లేదా - చెప్పవయ్యా.

కోటయ్య — నేను చూడకపోతే యేమిటండి. భగవంతుడు లేడటండీ. బాబూ, ఇలాటి ఘోరాలు దాగవండి.

ప్లీడరు — మరయితే, చంపేసి శవాన్నేం జేశాడంటారు?

కోటయ్య — అయ్యో బాబూ! మళ్లీ రెండోకంటివాడికి కనబణ్నిస్తాట్టండీ ? — దేవికి నైవేద్యం పెట్టి అరగించేశాడేమోనండి.

జడ్జి — ఏమిటయ్యా! నరమాంసమే తిన్నాడంటున్నావ్ ? పోనీ, ఆ యెముకలన్నా దొరకొద్దూ?

కోటయ్య — అమ్మమ్మమ్మా ! - నరమాంసం అనకూడదండి. దేవి ప్రసాదమండి. యెముకల కేంటండి, యెక్కడ పారేసినా, పాయె.

ప్లీడరు — ఏమండీ కోటయ్యగారూ, కళ్లారా చూడలేదని అంటున్నారుకదా, మరీ — గోపాలంగారే చంపేశారని ఎల్లా చెప్పగలరూ?

కోటయ్య — అదేనండి మాయ! పిల్లవాడూ, ఆయనా వారి సుమ్మంలోకి వెళ్లేదాకా చూశామండి. ఆపైనేం చూడగలమండీ ?—

ప్లీడరు — మరయితే,-ఆ వెంటనే మీరు జనాన్ని పోగుజేసుకెళ్లి, గోపాలంగారింటిమీద పడి ఆయన్ని చావగొట్టారుకదూ?

కోటయ్య — అయ్యోబాబూ! అదేంటండీ. నేను కోలాటందగ్గిర నిలుచునుండగా, గ్రామస్థులికెలా తెలిసిందోగాని – అందరూ పోగడి అల్లరి చేశారటండి.

ప్లీడరు — సరేకానీ – గోపాలంగారు పిల్లాణ్ణి ఎత్తుకు పోవటానికిన్నీ, జనం వెళ్లి అల్లరి చెయ్యడానికిన్నీ అట్టే వ్యవధి లేదు కాదటయ్యా ?

కోటయ్య — లేకపోవడ మేమిటండి ? సుమారు ఒక జామయినా ఐవుంటుందండి. కామేశ్వరమ్మ గోలెత్తిన తరవాతనే కదండీ, ఏళ్లంతా బయల్దేరిందీ? —

(నర్సిగాడు, కామేశ్వరికొడుకు)

నర్సిగాడు — "కోటయబాబూ! కోటయబాబూ!-"

జడ్జి — ఎవరా పొలికేకలు! –

నర్సిగాడు — కోటయబాబూ!

కుర్రవాడు — అమ్మోయ్!- అమ్మోయ్!!-అమ్మోయ్!!!

ఒకడు — అదేటి, కుర్రాడు ఆవిడొళ్లో దూరతా డెందుకూ!—

కామేశ్వరి — బాబోయి, నా కొడుకోయ్! బతికెల్లా వొచ్చావురా, నా తండ్రీ!! నా బాబూ!!

నర్సిగాడు — బాబూ! కోటయబాబూ! ఇదుగో బాబూ మీ కుర్రోడు...వుండండే ఏం జేసినా? ఎల్లిన కాణ్ణుంచి వొకటే పోరు, వొకటే గోల, పెసాదం ముట్టడు. నూడు

బాబ్యాకంక్తైపోనాడు. పది వోరాలిచ్చినా సరే, నేబరించలేను బాబో. నావోల్లకాదు.

(జనం) — "అరెరె. కామేశ్వరి కొడుకట్రా,

,, — "కామేశ్వరి కొడుకూ..."

,, — కామేశ్వరి కొడుకూ..."

,, — "కామేశ్వరి కొడుకూ..."

,, — "అవునవునూ, కామేశ్వరి కొడుకే..."

,, — "మనకామేశ్వరి కొడుకూ-" [కోలాహలం]

బంట్రోతు — సైలెన్స్. గోలచెయకండి.

జడ్జి — ఎంతఘాత! ఎంతఘాత!!—కాస్తంత ఆలస్య మయితే...

(జనం) — "దేముడిలాటి మారాజుని యెరక్కపోయి కారుకూతలు కూశినాం."

,, — "గోపాలంబాబు పాదాలమీద పడదాం, పదండెహె."

"ముండీ కోటయ్యగాణ్ణి కాళ్లూ శేతులూ కట్టి పడెయ్యాల రండి, రండి."

,, — "కొంపలు తీసే కొరివి!-ఈడి దుంప తెగా.."

,, — ఈనాళ్ని నరికి నాలుగ్గుమ్మాలా కట్టినా పాపం లేదురా.

,, — తుండితుండేలుకొట్టి కాకులికీ గద్దలకీ యెంగరెయ్యాల...

,, పీడి మొహంచూస్తే, పంచమహాపాతకాలూ చుట్టుకుంటాయి, థూ!—

,, — "గోపాలబాబు సత్తెమే ఆయన్ని కాపాడింది."

,, — "దేవిని నమ్ముకున్నవాళ్లె కెప్పుడూ కెరువు లేదురా."

,, "లేదు, యెప్పుడూ కెడువు లేదు."

[సరి.]

---

# కబీరుని పరీక్ష

శ్రీ పూర్ణానంద

౧

కొందఱు మాకు రాము డుపాస్యుడందురు. కొందఱు మాకు రహీము ఉపాస్యుడందురు. కొందఱు ప్రత్యాదేశమును బఱసితిమందురు. ఇట్లందఱును నానావిధ భేదభావముల జోడించుకొని నలుదిక్కుల తిరుగాడుచున్నారు. కబీ రనును కదా, తత్త్వోపదేశము లేకుండ ఆ రహస్యముయొక్క అంశమును కనుఁగొనజాలము.

౨

ఓ కబీర్ ! నీవు వ్యర్థ కోలాహలము నొనరించుచు టి వెందులకు ? నీవు, ప్రతి దివసమునను స్నాన మొనరింతువు ; ఇతరుల ముట్ట సేవగింతువు ; పుష్పముల నిడి దేవపూజ నొనర్తువు. ప్రపంచమున జనులు స్వహస్తమున మూర్తిని నిర్మించి, దాని నుండియే వాంఛితముల బడయ నభిలషింతురు. సమస్తజగత్తు, దేవమూర్తి జీర్ణమూర్తుల పూజ నొనర్చుచున్నది. తీర్థస్నానములను వ్రతములను ఒనర్చుచున్నది. పర్యటనమున, కాళ్లఱిగి గుంటలు పడిపోవుచున్నవి. సాధూ ! ఈదుఃఖమున కంతెక్కడ నున్నది. సత్యముననే,ఆ సత్యమయుడు వాస మొనర్చుచుండును — మిథ్యను నలుగగొట్టి పారవేయును. కబీ రనును కదా, ఎట సత్యవస్తువున్నదో అట దాని దర్శనము సహజముగనే లభించును.

౩

ఓసాధూ ! పురోహితుడు కడు నిపుణుడగు కసాయి. గొఱ్ఱెను చంపియు, మేకమీద ఇసుమంతయు దయజూపడు. స్నానమొనర్చి తిలకమును ధరించి, తీరుగా కూర్చొని, విధివిహితముగ దేవపూజ నొనర్చును. మఱియు, వధ్యశిలమీద, ప్రాణిహింస నొనర్చి, రక్తనదిని ప్రవహింపజేయును. పైగా, సభలో అతిపవిత్ర మగు ఉన్నతజాతికిఁ .జెందినవాడ నని గౌరవలాభము నందును వీరికడ జను లుపదేశము నందుదు రని విన నాకు నగవొదవును వీరు పాపపు పల్కుల వినిపింతురు, నీచపు పనుల జేయింతురు. ఆహా ! గోవధ నొనర్చు వారిని వీరు తురక లందురు. వీరేమి, వారికి దీసిపోదురా ?

౪

అరె ! వీరిరువురును మార్గమును కనుగొనలేదు. హిందువుల హిందూత్వమును జూచితిని, ముసల్మానుల 'ముసల్మానుత'ను జూచితిని. కబీ రనును కదా, సాధూ ! ఏ మార్గమును నేను అవలంబింతును.

౫

ఓ సాధూ ! చూడుము, జగ త్తెంత పిచ్చదో ! సత్యమును వచించిన నిన్ను వధింపగోరును. మిథ్యపల్కిన నిన్ను నమ్మును.

హైందవు డనును కదా, మా రాముడు! ముసల్మానుడు పల్కును కదా, మా రహీముడు — ఒండొరు లిట్లు తగవులాడుదురు. కాని, మర్మము నేరును తెలిసికొనలేదు. ఆచారవంతు లగు నైష్ఠికుల ననేకులను నిత్య ప్రాతఃస్నాన మొనర్చువారిని గాంచితిని. వారి జ్ఞానము స్థూలము. ఏమందువా, వారు పరమాత్మను విడిచి, పాషాణమును పూజింతురు. కొందఱు, తీర్థ వ్రతముల భ్రాంతులై యున్నారు. కొందఱు, పగిడీలను తగిలించుకొనుచున్నారు. కొందరు పంగనామముల నిడుకొనుచున్నారు. కొందఱు, శ్లోకముల పఠించుచున్నారు. కొందఱు భజనల నొనర్చుచున్నారు. కాని, వా రెఱుంగనిది పరమాత్మ యొక్కటియే. మిథ్యాభిమానమునకు లోబడి ఇంటింటను మంత్రోపదేశ మొనర్చుచున్నారే, వీరు శిష్య సహితముగ రసాతలమున కరుగుచున్నారు. అంతమున పరితాపము కల్గును. పీరులను, ఫకీరులను అనేకుల జూచినాడను. కొందఱు ధర్మశాస్త్రములను, కొందఱు ఖొరానును జదివి శిష్యుల ప్రోగు చేసు కొందురు— రహస్యమును జెప్పుదురు— కాని, వారు ఈశ్వరు నెఱుంగరు. హిందువుల దయ, ముసల్మానుల కరుణ— వారివారి గృహముల వీడి పారిపోయినవి. వారు తమ్ము దాము బుద్ధిమంతుల మని లో దలంతురు. నన్ను ఉపహసింతురు. కబీ రనును కదా, ఓ సాధూ! వీరిలో పిచ్చివా రెవరైనది, నాకు దెలియజెప్పుము.

౬

ఆ ఈశ్వరు డట్టివాడో నే నెఱుగను. ఈ ముల్లా చీత్కార మొనర్చుచు పల్కుచున్నాడే దాని అర్థ మేమి? నీ ప్రభువు బధిరుడా యేమి? అతి క్షుద్రమగు కీటకము యొక్క పాదనూపుర ధ్వనినిగూడ అతడు వినగలడు. జపమాలే త్రిప్పుము. తిలకమే దిద్దుము. దీర్ఘమగు జటనే పెంచుము. నీ అంతరము శాణితఖడ్గము; ఇట్లైన ఈశ్వరుడు లభింపడు.

౭

ఏ మనుజుడు తన్ను దా మనస్సునుండి దూరీకృతు నొనర్చుకొనినాడో, అత డుత్తీర్ణు డైనాడు. ఒకడు, 'నేను జ్ఞానిని' అని చెప్పును, మఱొకడు, 'నేను త్యాగిని' అని పల్కును. మఱొక డింద్రియజేత నని వచించును— కాని అభిమాన మందఱిని పట్టుకొనియే యున్నది. ఒక డనును కదా 'నేను యోగిని' అని. మఱొక డనును కదా 'నేను భోగిని' అని — అభిమానమే దూరము కానిది. ఇప్పుడు రోగి బ్రతుకున దెట్లు? ఒక డనునుకదా 'దాతను' అని. ఒకడు వచించును కదా, 'నేను తపస్విని' అని. నిశ్చితరూపమున ఆత్మతత్త్వమును ఎఱిగినవా రెవరును లేరు. అందరును భ్రమయందు నిమగ్నులు. కొందఱు, 'మేము యోగముల నన్నిటిని ఎఱుగుదుము' అందురు. కొందఱు 'రహస్యము నెఱుగుదుము' అని పల్కుదురు. ఆ ఆత్మదేవుని తెలియని పక్షమున ఈ కబు ర్లన్నియును వ్యర్థములు. కొందఱు, 'అన్ని మతసాధనల నొనర్చితి' మని పల్కుదురు. కొందఱు 'వ్రతముల నన్నిటిని ఆచరించితిమి' అని నుడువుదురు. కాని ఆత్మభ్రాంతి దూరము కాని యెడల వాని నెత్తిన క్లేశము లనేకము లున్నవన్నమాటే. గర్వాభిమానముల ద్రోసి

వైచిన వానిపట్ల కర్మబంధములు శక్తిహీన ములు. కబీ రనును కదా, నే నా స్వామి భృత్యుడను. నిజపదమున కుపనీతుడను.

౮

'ఓ సేవకుడా! నాకొఱ కెచ్చట అను సంధానము సల్పుచున్నాడవు. నేను నీ పార్శ్వమునసే ఉన్నాడను. నే నున్నది గుడియందు కాదు, మసీదున కాదు. కాబాలో నేను లేను. కైలాసమునను లేను. క్రియా కర్మలయందు నేను లేను. యోగ వైరాగ్యముల నేను లేను. అన్వేషించుట సరిగినపక్షమున తక్షణమే నన్ను చూడ గలవు. కబీ రనును కదా:— ఓ సాధూ! నేను సకల నిశ్వాసముల నిశ్వాసమధ్యమున ఉన్నాడను.

౯

ఆహా! ఈ జగ త్తెంత పిచ్చది! భక్తి భావము నేరును ఎఱుంగరు. కొందఱు పు త్రార్థులై అరుదెంచి 'ఓగోసాయీ! నాకు పుత్రు నొసంగుము, అందురు. కొందఱు, దుఃఖపీడితులై వచ్చి 'నాపై దయ జూపుము' అని పల్కుదురు. కొందఱు ధనకాములై వచ్చి ధనము నుపహారముగ సమర్పింతురు. ఆ పరమసత్యమును గ్రహించువా రేరును లేరు. అందఱును ఆమిథ్యనే అన్వేషింతురు. కబీ రనును కదా!- 'ఓసాధూ! ఈ అంధు లతో జేయదగిన దేమి?

౧౦

సాధువులజాతి నడుగుట వృథా. ఏమన, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులందఱును సాధన సల్పుచునేయున్నారు. సాధనమధ్య ముప్పదియారు జాతు లున్నవి. సాధకునిజాతి సంబంధ మగు ప్రశ్న నడుగుటయే వ్యర్థము. మంగలి సాధన నొనర్చుచున్నాడు. చాకలి సాధన నొనర్చుచున్నాడు. వడ్రంగి సాధన నొనర్చుచున్నాడు. రైదా సొక సాధకుడు. జాతినిబట్టి శ్వపచఋషి. మాదిగ. హిందూ ముసల్మాను లందఱును సాధకులై యున్నారు. దీన, విచార మేమియును లేదు.

౧౧

హృన్మధ్యమున ప్రేమసంచారము కాని వారు కాశీవాన మొనర్చిన నేమి? గంగా జలము త్రావిన నేమి? జోలె తగిలించుకొ నిన నేమి? గంత దొడిగికొనిన నేమి? నామము దిద్దిన నేమి? కబీ రనును కదా- 'సోదరా! వారి బ్రతుకే వ్యర్థము.

౧౨

నాప్రభుని నిగూఢలీల. యోగి ముద్రా దులవలన అతని నెట్లు తెలుసుకొనజాలును? అంధమతమే వ్యాపారముగ బెట్టుకొని అడవుల తిరుగాడు చున్నాడు. బ్రహ్మచారి పూజా, తర్పణముల వైమరచి యున్నాడు. కుంభకమున ప్రాణమును నిరోధ చి, యోగి అజగరమై విశ్వకేళియందు పందెమును బోగొట్టుకొనినాడు—బ్రహ్మమును బా.ద లేదు.

నామందిరము శూన్యము, గభీర రజని వలె నట నంధకారము—'నే నెట విశ్రమింతు ను.'? కబీ రనును కదా—'ఎట నీమందిరమున సూర్యచంద్రులు ప్రభాకలితులో అట విశ్రమింపుము.'

౧౩

ప్రేమరసానురంగుతో మనస్సును చిత్రిం పక యోగి వానినసక...

నాడు. దివ్యమందిరమధ్యమున ఆసనోపవిష్టుడై బ్రహ్మమును వీడి పాషాణమును పూజించుచున్నాడు. చెవుల విదీర్ణ మొనర్చి జటల పెంచుచున్నాడు గడ్డమును పెంచి మేకపోతు రూపును దాల్చినాడు. అరణ్యమున కరిగి అగ్నిని జ్వలింపజేసి కూర్చొనుచున్నాడు. కామమును దహించి నపుంసకుడైనాడు. నెత్తిని గొఱిగికొని, బట్టకు రంగు వైచుకొని, గీతను జదివి, యోగి వాచాలుడైనాడు. కబీ రనుచు కదా--ఓ సోదరా! సాధూ! వినుము! నీవు బద్ధుడవై మృత్యుద్వారమును సమీపింపవలసియున్నాడవు.

౧౪

సోదరా! నే పొరపడినప్పుడు సద్గురుడు నాకు సమీచీనమగు మార్గమును జూపినాడు. అప్పుడు నేను క్రియాకర్మలను, ఆచారములను త్యజించితిని. ప్రతితీర్థమునను మునుగుట మానితిని. అప్పుడు నేను కనుగొనిన దేమన, అందఱును జ్ఞానులు, నే నొక్కడనే పిచ్చివాడను. వారి మధ్యనుండియే వారిని దొట్రుపడ జేసితిని. అప్పటినుండి సాష్టాంగ ప్రణామము నెఱుగను. ఘంటవాయించుట విడచితిని. సింహాసనమున మూర్తి స్థాపన నొనర్పలేదు. పూలతో ప్రతిమార్చనము సల్పలేదు.

జపతపముల నొనర్చి శరీరమును దగ్ధ మొనర్చినను హరి తృప్తుడుకాడు. పంచేంద్రియముల వధించి పరిధానత్యజన మొనర్చినను హరి తృప్తుడు కాడు.

'ఎవడు దయాళుడో, ధర్మపాలనారతుడో, జగన్మధ్యమున ఉదాసీనతను వహించి యుండునో, సకల జీవులను ఆత్మవత్ లక్షించునో, అతడు అమృతపురుషుని బడయును. ఎవ డవమానమును సహించునో, కుకథల త్యజించునో, సకల గర్వముల నుండి ముక్తుడో.' కబీ రనును కదా, 'అతడు సత్యదేవతను జెందును.'

ఓ సాధూ! సాధనారహస్యము మిగుల నిగూఢము. మాలలను, ముద్రలను ధరించిన నేమి? లలాటమున చందనము పెత్తుకొనిన నేమి? తలగొఱిగికొని, జటల ధరించి, బూడిద పూసుకొని, నీటినిగాని బొమ్మను గాని పూజించి, కందమూలముల మెసవిన దాన నొరగెడి దేమి ?

తత్త్వజ్ఞాన లాభమును బొందనివాడు, తీర్థవ్రతనియమముల సల్పిన నేమి? భజన నొనర్చిన నేమి? శాస్త్రవ్యాఖ్య సల్పిన నేమి? ప్రపంచమునం దంతటను పరిభ్రమించిన నేమి? సంధ్యా తర్పణములను, షట్కర్మలను సల్పిన నేమి?

ఈ తత్త్వజ్ఞానహీను లందఱును తమ్ము సాధువుల మని చెప్పకొందురు; స్వాములై విషయముల భోగింతురు. వారు జ్ఞానధ్యానముల మర్మమును దెలియనివారు కేవల 'శుష్కతార్కికులు.'

తమ నెత్తిని కర్మభారము. కాని, వారితరుల చెవియందు మంత్రము నూది తిరుగులాడుదురు. వారికిబుద్ధి ఇట్టిది. పరమగురుడగు బ్రహ్మమును దెలిసికొనక వారికెంత కాలము లోభతరంగముల తేలియాడుదురోయి?

నిగూఢుడును, గభీరుడును, అపారుడును, ఖండాఖండాతీతుడును, అపారదృష్టి

యును, సర్వగమ్యుడును, అగు బ్రహ్మమే నిన్ను భ్రమజాలములనుండి విడిపింపగలదు.

నిర్మలదృష్టియు, బ్రహ్మనామమే ఆధారముగ గలవాడును, 'నీవు-నేను' అను భేదములనుండి ముక్తుడును అగువాతడే సాధనా రహస్యమున బ్రవేశింప సమర్థుడు---ఇదియే కబీరు చెప్పునది.

౧౬

జగత్తునం దందఱును రోగులే - ఏమందువా? అఖండుడగు ఆ వైద్యుని ఏరును కనుగొన లేదు.

కపటగురువునే అందఱును పూజింతురు. అసలైనవాని నెవరును జూడరు. అంధుడు అంధుని చేయి పట్టుకొని నడచుచున్నాడు. ఇప్పుడు మార్గమును జూపున దెవరు?

౧౭

మోహబంధనను గుఱించి ఇంకను విశేష రీతిని జెప్పుచున్నాడను. వినుము:- వారు భూతపిశాచముల పూజింతురు. వారింట మృత్యువు గూర్చొని ఆనందించు చుండును.

'భక్తరాజు' ఏకాదశిని నీటినైనముట్టడు. సావధానచిత్తుడై పురాణమును వినును. మరల ఇటచూచిన, ఈబుద్ధిమంతునకు, ఈ మంచివానికి మేషబలియు, తన్మాంసభోజనమును తప్పనిసరి. ఓ చండాలుడా! ఓ అపరాధి! ఓ పాపీ! దయావిహీనుడవై నీవంధకారమున గూర్చొని యున్నాడవు---నీ శరీరమును దయను సాధింప వినియోగింప వేమి?

నినుబోలు అకర్మణ్యు లనేకులు ఈజగత్తున దిరుగాడుచున్నారు--మనస్సున వారి గర్వమెంత? కబీరనును కదా! దయనుండి విచ్ఛిన్నుడైనవానికి నరకము తప్పనిసరి.

౧౮

పుత్రుని మస్తకముండనావసరమున ఎంతటి దయా ఎంతటి జాగ్రత్తా తలమీద కత్తిగాటు పడకుండ. కాని, మేకపిల్లను బట్టుకొని బలియిచ్చును. ఇసుమంతయు దయలేదు.

౧౯

దేవికొఱకు, గోత్రపోతు. పీరుకొఱకు మంచి మంచి వస్తువులు. ఆప్రభుని కొఱకు- మనల నిటకు బంపినాడే వానికొఱకు - ఏమియును లేదు!

౨౦

జీవితబ్రహ్మ నేరును ఉపాసింపరు. అందఱును మృతదేవతనే ఆదరింతురు.



# విరహిణి

శ్రీ పన్యాల వెంకటరంగనాథరావు

పలురంగుల్ మిళితంబులై అలలతో భాసిల్లుపింఛంబ! ఎం
తలదృష్టమ్ముల నాచరించితొ, చమత్కారమ్ముగా కృష్ణునిన్
వలలో వేసుకొ నెక్కినావు శిర, మే పన్నాగముల్ బన్నితో,
వలపున్ జూపితొ, భక్తి జూపితివొ, సంబంధమ్మునే జెప్పితో!

నెమిలిపింఛంబునై పుట్ట నీదు చెంత
నేను దిన మస్తమానము నీతొ గలసి
యుండుభాగ్యమె లభియించి యుండునేమొ-
ఏల మాయమైపోయెద వీవు కృష్ణ!

స్వరసల్లాపము చిన్ని వ్రేళ్లు పలుపన్ సంగీతమున్ బాడు - ఓ
మురళీ! ఆతనిముద్దుమోము, నధరంబున్ ఎన్ని పర్యాయముల్
సరిగా ముద్దులు బెట్టుకొంటివొ, అదృష్టం బన్న నీదమ్మ, నే
దరిఁజేరంగ నదృశ్యమౌ నతడు, నా దౌర్భాగ్యమో దోషమో!

అనవరతలీలలందు నిన్ననుసరించు
మురళినైపుట్టి యుండిన ముద్దుగొలుపు
నీదు చిన్నారి వ్రేళ్లపై నిత్య మలరు
భాగ్య మబ్బి యుండెడిదేమొ బాలకృష్ణ!

ఘలుఘల్ ఘల్ ఘలుఘల్ ఘలంఘలలు మ్రోగన్ చిన్ని పాదాలు ప
ద్దులతో నింపెడు గజ్జెలందియల! మీతో గూడి ఆ బాల గో
కుల గోపాలుని లేతపాదముల తళ్కుల్ జిమ్మగా నొత్తి, నే
వలఁజేయన్ మరినోచలేద! ఇది నా ప్రాలబ్ధమో! కర్మమో!

గజ్జెలందెలతో ఘలుఘల్లుమనుచు
పాలుమీగళ్లలోన నృత్యాలుసలుపు
చున్న నీ లేతపాదాలనొత్తు భాగ్య
మెన్నఁ డర్పింతువో నాకు చిన్నికృష్ణ!

---

శ్రీ ప్రణవానంద రచితము:

# గోముఖ యాత్ర

శ్రీ క. గో. కృష్ణ సంపాదితము:

గంగోత్రి గంగపుట్టిన స్థలమని సాధారణముగ చెప్పుదురు. ఏలనన ఇక్కడివరకే యాత్రికులు వచ్చుటకు తనుమార్గమును, సౌకర్యములును కలవు. కాని అసలు గంగపుట్టినచోటు ఇచ్చటకు ౧౩½ మైళ్ల దూరమున గంగానది కెనుక నున్నది. దానికి "గోముఖ" మని పేరు.

గంగోత్రి హరిద్వారమునుండి సుమారు ౧౮౦ మైళ్ల దూరమున నున్నది. ఇచ్చట తొమ్మిది లేక పది చిన్న చిన్న ధర్మశాలలును, మూడు నాలుగుదుకాణములును, గంగాదేవాలయమును, కాలీకమ్లీవాలా సత్రమును, పంజాబీ సత్రమును కలవు. బదరీనారాయణము, కేదారనాథము, యమునోత్తరులలోని దేవాలయములవలెనే ఇచ్చటి దేవాలయమును వైశాఖ శుద్ధ తృతీయనాడు తెరిచి దీపావళి అమావాస్యనాడు మూయుదురు. అప్పుడు గంగాదేవి ఉత్సవ విగ్రహములను ఇచ్చటికి ౧౩ మైళ్లు దిగువనున్న 'మార్కండేయ' అను గ్రామమునకు గొనిపోవుదురు. అక్కడికొక మైలుదూరమున నున్న 'ముఖువా' గ్రామములో నివసించు పండాలు, ధూప దీపనివేదనాదికములు జరుపుచుందురు.

ముఖువాగ్రామములో ౮౦ లేక ౭౦ బ్రాహ్మణ గృహములు కలవు. ఇచట సుప్రసిద్ధమగు, 'బోధిగుహ' కలదు. ఇచట శీతకాలములో గజమున్నర ఎత్తుమంచు పడును గాన, గంగాదేవిపూజానిమిత్తము, గ్రామసంరక్షణనిమిత్తము నాలుగైదు కుటుంబములవారు మాత్రమే యుండి, మిగిలాజన మంతా శీతకాలములో ఉత్తరకాశీప్రాంతమునకు వెళ్లిపోవుదురు.

గంగోత్రికి పోస్టాఫీసు రమారమి ౬౦ మైళ్ల దూరమున నున్నది. పోస్టుబంట్రోతు పక్షమున కొకమారుచొప్పున అయిదారు మాసములు మాత్రమే వచ్చును.

గంగాదేవి మందిరమునకు ౩½ పర్లాంగుల దిగువను గంగ లాకుగోడలవంటి తాడెత్తు రెండుతెల్లరాతి గోడలమధ్య సుమారొక వందగజములదూరము ప్రవహించి అచటినుండి క్రింద నొక శివలింగముపై పడుచుండును. అస్థలమే గంగ శివునిజటాజూటమున పడిన స్థల మని ప్రసిద్ధి. ఎత్తైన రాతిచరుపలమధ్య ప్రవహించు గంగాభాగమునకు, గౌరీకుండ మని పేరు. ఉత్తరదేశపుయాత్రికులు రామేశ్వరము తీసుకువెళ్లు గంగను గౌరీకుండమున కెనువనే గంగోత్రి, గోముఖములమధ్య నెక్కడయినను పట్టుదురు. ఏలనన గౌరీకుండమునకు దిగువ ప్రవహించు గంగ శివునిపై ఒకసారి అభిషిక్తమైనదే గాన అది రామేశ్వరస్వామి కభిషేకము చేయుటకు తగదని వారి యభిప్రాయము. యాత్రకు వచ్చిన సాధుల కిచ్చట "బాబా కాలీకమ్లీవాలా" వారు, పంజాబీసత్రమువారును ఒకరోజునకు 'సదావర్తము' నిత్తురు. గంగోత్రిలో రెండుమూడు నెలలుండదలచుకొన్న వారికిని, ఇంకను ఎక్కువకాల ముండదలచుకొన్న వారికిని ఒకపూట భిక్షనిత్తురు. రెండుసత్రములనుగూడ వైశాఖశుద్ధ తృతీయనాడు తెరచి శ్రీకృష్ణాష్టమినాడు మూయుదురు. ఎవరైన తరువాత నిక్కడ నుండదలచుకొన్నచో వారి స్వంత ఏర్పాట్లు చేసుకొనవలెను. యాత్రికులుగూడ అప్పటితో తగ్గిపోవుదురు. దీపావళివరకు కొద్దికొద్దిగ నొకరిద్దరు వచ్చుచుందురు.

ప్రతివస్తువు క్రిందినుండి ఇక్కడకు ౧౮౦ మైళ్ల దూరము గుర్రములమీదను, గొర్రెలమీదను, మేకలమీదను రావలసిఉండును గాన చాలప్రియముగ నుండును. ౭౦ తులముల శేరు బియ్యము ఎనిమిదణాలు. పప్పు గోధుమపిండి, శనగలు, బెల్లముకూడ ఎనిమిదణాలు. పంచదార రూపాయి, నెయ్యి రెండున్నరరూపాయిలు. కిరసనాయిలు మూప్పావలా. ఇక్కడ వస్తువులన్నీ తూనికే, కొలత లేదు.

గంగోత్రిలో చుట్టుపక్కలనంతయు "దేవదారు" చీడు, భూర్జవృక్షములు మొదలగువాని యడవులు గలవు. గంగోత్రి కెదురుగనున్న పర్వతశిఖరమున

భాద్రపదమాసములో "బ్రహ్మకమలములు" పుష్పిం
చును. అప్పుడా పుష్పములను భక్తు లెవరైన తెప్పించు
కొని గంగాదేవికి పూజ చేయించుకొనవలయు

నన్నచో, ఇక్కడి పండాల కెవరికయినను ఒక రూపాయి
ఇచ్చినయెడల ఉదయముననే వెళ్లి సాయంకాలమునకు
పుష్పములను తెచ్చి పెడుదురు.

ఇంతవరకు కెన్నడును, ఎవ్వరును యిక్కడి
దేవాలయము మూసినవెనుక శీతకాలములో నివసించి
యుండలేదు. ఏలనన శీతకాలములో నిచ్చట పదినెంద

లు, ఇరువదిఅడుగుల ఎత్తువరకు మంచుపడి ఇండ్లుకూడ
కప్పబడిపోవును. నేనును, సాహసాధకులను ప్రకాం
తానందులును రెండు సంవత్సరము లన్ని ఋతువులలో

నుకూడ మండ నిశ్చయించి అట్లే యుంటిమి. మా గంగోత్రి నివాసమునకు తోడ్పడినట్టి మిత్రులందరకును అనేకధన్యవాదముల నర్పించుచున్నాము. పరమపావని యగు గంగాభవానియు, సర్వమంగళకారకుడు పరమ శివుడును అందరికిని ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధి నొసంగుగాక!

## గోముఖయాత్ర

వైశాఖ శుద్ధత్రయోదశి ఆదివారము ౨౬-౫-౩౪ ఉదయము భోజనంతరము ౧౦౹౹ గంటలకు గోముఖమునకు ప్రయాణమైతిని. త్రోవ తెలిసిన ఒకస్వాముల వారిని వెంట తీసుకొంటిని. అర్ధ శేరు శేలపిండి, అర్ధ శేరు వేయించిన శనగలు, శేరు బెల్లం భిక్షలో మిగుల్చుకున్న రొట్టెలు, నేను యాత్రకు బయలు దేరుటకు ముందు మిత్రు లిచ్చిన గోదుమాది మార్గము, చిన్న చిక్కుత్తులు తీసికొని, చక్కని ఎండలో గంగను ఎడమ యొడ్డుకుదాటి సాగితిని. నే బయలుదేరుట చూచి మరి నలుగురు సాధులుకూడ వెంటబడిరి. ప్రారంభమునుండియే ఒక పెద్దరాతినుండి ఇంకొక రాతిమీదకి, దానిమీదనుండి ఇంకొక చిన్న రాతిమీదికి, దానిమీదనుండి మరియొకచిన్ని రాతిమీదికి దుముకుట, జారుట, పడుటలకు శక్తిమని దెబ్బతగులుట, కత్తులవంటి అంచులు కాళ్లకు తగిలి ప్రాణం గిల్లాడ్చుకు పోవుట, గీసుకుపోవుట మొదలైనకష్టాలు కలుగుతూ వచ్చినవి. ఒకమైలు నడచి "బ్రహ్మయోని" అనుస్థలము నకు వచ్చితిమి. ఇచ్చట తాడెత్తున బ్రహ్మాండమయిన రెండు రాతిచరపలు దగ్గరదగ్గరగ నున్నవి. వాటిమధ్య ఎప్పుడో గంగలో పెద్దవరదకు కొట్టుకొనివచ్చిన దూల ములు కొంచెము ఏటవాలుగా అడ్డుపడియున్నవి. వాటిపైనుండి పై తగ్రాకి మీదనుండి ఒకరు పట్టు కొనుచుండగ ఒక్కొక్కరమే బ్రహ్మయోనిని దాటి తిమి. ఈస్థలమున కెదురుగా నావలియొడ్డున శ్రీ శివా నందస్వాము లను ధనవంతులగు దండి స్వాములవారి కుటీరము గుహ కలవు. అచ్చట పైకొండనుండి జారి సర్వదా అన్నిసైజులరాళ్లు పడుచుండును. క్రిందబాటదు దూరములో గంగ తల్లక్రిందుగ నిచ్చెన మెట్లమీదనుండి పడులాగు ప్రవహించుచుండును. ఆరాలుడు రాళ్లలో నుండి పైనుంచి జారిపడురాళ్లన, కాళ్లక్రింద జారుడు రాళ్లను, క్రిందనున్న గంగనూ తదేకాగ్రదృష్టితో చూచుకొనుచు, గుండెలను తీసి అరచేతిలో పెట్టుకొని కొన్నిచోట్ల సాగవలెను. గంగకుపైన రెండు తాళ్లఎత్తున రాళ్లగుట్టలలోనుండి, జారిపోవు ఇసుకమట్టిలో ఏయడు గున కాయడును త్రోవ చేసుకొనుచు పెత్తిమీద వాలు గైదు వందలయడుగుల ఎత్తునుండి జారిపడు బండల ప్రక్కనుండియు కొన్నిచోట్ల పోవలెను. మధ్యమధ్య కొండపైనున్న భూర్జవనములోను, దేవదారు అడవుల లోను, చీడు [Pines] చెట్లలోను [వీటినుండియే కర్పూరతైలము తీయుదురు] వాటిమధ్యనుండు సమతల ప్రదేశములలోను కొంత ప్రయాణము సాగినది. "మన ప్రాణములు తీయుటకు మరలరాళ్లు వచ్చిన"వని ఎసుగు కొనుచు, మనస్సు నేకాగ్రం చేసుకొనుచు రాళ్లమీద కొంతవడి నడచితిమి. అప్పుడప్పుడు ముందునెళ్లువాని కాలిక్రింద చిన్నరాయి ఒకటిజారి, పేకలపాతరవలె రాళ్లన్నికదలి ఒక పెద్దరాయి వెనుకవానిమీద పడగా, కళ్ల నీళ్లుక్రమ్మ తీక్ష్ణమగుబాధను ఓర్చుకొనుచు, రాతిని కాలి మీదనే ఆపుకొని [అట్లు వెనుకవాడు ఆపుకొనక తొందరపడితే కాళ్లక్రింది రాళ్లుకూడ జారి గంగలో పడి అరక్షణంలో అదృశ్యమైపోవును] మొదటి వానిచేయి ఊతగా గొని ఎక్కుచు, రివ్వురివ్వున వచ్చు రాళ్లను తప్పుకొనుచు, "ఈగండమును దాటించి తివి పరమేశ్వరా" యనుకొనుచు కొన్నిచోట్ల నడచితిమి. ఇట్లు బ్రహ్మయోని దాటి రెండుమైళ్లు వెళ్లి తిమి. తరువాత "దేవగాడ్" అనువాగుయొక్క "శేడా" (దిబ్బ)కు వచ్చితిమి. గంగానదిలో పడు కొండ వాగులు లేక ఉపనదులు కొన్నికొన్ని మంచుపడు శీత కాలములోను, మంచుకరగువేసవికాలములోను మట్టి ఇసుక, రాళ్లు, పెద్దబండలు, చెట్లు మొదలగువాటిని తీసికొని వచ్చి గంగానది కడ్డముగ వేయుటచే నచ్చట త్రికోణాకృతిగ మేట ఏర్పడి పెరుగును. దానినే హిందీ లో "శేడా"అని వ్యవహరింతురు. రెండేండ్లక్రిత మీవాగు సుమారు తాడెత్తున, ముప్పాతికమైలు వెడల్పున గల "శేడా"ను నది కడ్డుగ వేసినది. అందుచే గంగ పొంగి శేడాను తెగగొట్టుకు వచ్చి గంగోత్రిలోని చాల దుకాణములను, పండాల కొటారములను. రెండు

మూడు చిన్న దేవాలయములను, కొన్ని ధర్మశాలలను కొట్టుకొనిపోయినది. ఈకేదా గంగకు కుడిరొడ్డున నున్నది. ఇట్లుపడుచు లేచుచు మరినాలుగుమైళ్లు వెళ్లితిమి.

అనంతరము చీడువాసము చేరితిమి. గంగకు కుడి వైపురొడ్డున చీడు అడవిలో చిన్నకుటీరము కలదు. "గోముఖము"వెళ్లువారి సౌకర్యార్థము,దానిని రమారమి ౨౦ వీండ్లక్రితము ఖుదాసింగు అనుధనవంతుడను ఒక పంజాబీ సాధువు కట్టించెను. సాధారణముగ ప్రతిసంవత్సరము గంగోత్తరినుండి గోముఖమునకు పోవు త్రోవలో మూడు నాలుగు మంచువంతెన లేర్పడి వైశాఖమాసాంతమునకు కరగిపోవుచుండును. గత శీతకాలము మంచు తక్కువపడుటచే ఈ వత్సరము వంతెన లేర్పడ లేదు. అందుచే ఎడమగట్టున నున్న ఆ కుటీరమునకు మాకు వెళ్లుటకు వీలులేకపోయినది. ముందునకు మరి మూడుమైళ్లు వెళ్లితిమి. సాయంకాలము ౬ గంటలయినది. పెద్ద భూర్జవృక్షముల యడవిలో ఒక ఊట (Spring) ప్రక్కనే ఆగితిమి. చుట్టుప్రక్కల నున్న ఎండు భూర్జపు కొమ్మల చేరి పోగుచేసి నెగడు వేసికొని దానిచుట్టు సర్దుకొని చలికాచుచు కూర్చుంటిమి. దగ్గరనున్న రొట్టెలలో కొన్నిటిని నాతో వచ్చిన స్వామికిని, కొన్నిటి నేమియు తెచ్చుకొనకుండ వచ్చిన సాధువునకు నిచ్చితిని. ఆరొట్టెలను నెగడుపై కొంచెము వెచ్చచేసుకొని తిని రాత్రి ౧౨ గంటలదాక నిప్పుకాగ కాగుచు కొంతవరకు ధ్యానములో కూర్చుంటిమి. తరువాత పరుండి వెన్నుచల్ల బడినపుడెల్ల లేచి బట్టల వెచ్చచేసికొనుచు రాత్రి గడిపితిమి.

పౌర్ణమీ సోమవారము [౨౮-౫-౧౯౩౪] మహావైశాఖి. తలవనితలంపుగా గొప్పపర్వదినము. మిక్కిలి చలిగా నున్నది. నాలుగుగంటలకే వెలుగు వచ్చినది. కాల్యకృత్యములుతీర్చుకుని దగ్గరనున్న కొద్ది బంగాళాదుంపలను నిప్పులో కాల్చుకుని మూటకట్టుకొని బయలుదేరితిమి. ౬ గంటలయినను సూర్యదర్శనం కాలేదు. వేళ్లుకొంకరపోవుచున్నవి. అలాగే ఒక మైలు వెళ్లితిమి.

తరువాత భోజవాసము చేరితిమి. ఈస్థలమునకు సంబంధించిన కుటీర మావలి రొడ్డున నున్నది. కుటీర మున్నచోట భూర్జవృక్షములే లేవు. ఈవలిరొడ్డుననే యున్నవి. గుర్తునకాస్థలము భోజవాసమని మాత్రము పిలవబడుచున్నది. ఇచటి కుటీరమును కూడ ఖుదాసింగు గారే కట్టించిరి. ఇంకొకమైలు వెళ్లినతరువాత నట నొక గుహకలదు. ఎదుటకొండచివర ౧౪,౦౦౦ అడుగుల ఎత్తున "బర్హు" అను దుప్పివంటి మృగములు నిర్భయముగ మేయుచు కనులపండువుగ కాన్పించెను. ఇచ్చట ఎలుగుగొడ్లు,చిరుతపులులు,కస్తూరిమృగములు,కొలదిగ పెద్దపులులును గలవు. ఇంకొకమైలు వెళ్లుసరికి రమారమి ౧౫౦ అడుగుల ఎత్తుగల నీలపు మంచుగోడ అడ్డుతగిలినది.దాని కెదుట నిలువబడితిమి. గమ్యస్థానము చేరితిమిగదా యని ఆనందమున్నుల మయితిమి.

ఈ నీలపుమంచు దిబ్బ ఉత్తరదక్షిణము లొక మైలు వెడల్పును, పూర్వపశ్చిమములు మూడుమైళ్ల పొడవును కలిగియుండును. ఈపెద్దమంచు దిబ్బ (Glacier) ఎదుటి భాగము కొంచెము ధనురాకారముగ నున్నది. దానిపాదతలములోని ఒక సొరంగము నుండి పెద్ద పంటకాలువంత నీటి ప్రవాహ మొకటి మంచుకరగి బహిర్గత మగుచుండును. దీనినే గోముఖమనియు, గోముఖకైలాస మనియు బిలుతురు. ఇది సముద్రమట్టమునకు పైని ౧౩,౫౬౦ అడుగుల ఎత్తున నున్నది. ఇదియే గంగయొక్క అసలు ఉత్పత్తిస్థానము. గంగోత్తరి సముద్రపు నీటి మట్టమునుండి ౧౦,౦౬౦ అడుగుల ఎత్తున నున్నది. ఈ మంచుదిబ్బ ఎగువనున్న రెండు శిఖరములే గోముఖ శిఖరములు [Gomukh Peaks] ౨౨,౬౩౦ అడుగులఎత్తు కలవి. వీటినే కొందరు గంగోత్తరి శిఖరములని [Gangotri Peaks] మరికొందరు సుమేరుశిఖరము అనియు పిలుతురు. గోముఖమునకెదురుగనిలుచుండినచో కనబడునది కేదారశిఖరము [Kedar peak]. ౨౨,౬౬౦ అడుగుల ఎత్తుకలది. గోముఖమునకు రెండుఫర్లాంగులు దిగువ మాకు కుడివైపున కొండప్రక్కనే నీలములవంటి [Turquoise blue] లోతైన చక్కని నీటికొల నొకటి

యున్నది. అది ఏబదేసిగజములు నిడివిగల భుజములుగల త్రిభుజసరస్సు [**Triangular lakelet**]. మేము గోముఖము చేరుసరికి ౧౧ గంట లాయెను. ఎండ బాగుగ వచ్చినది. గోముఖముదగ్గరగా, అచ్చటి గంగలోనికి, పైమంచు గోడమీదనుండి మట్టి, ఇసుక, మంచు అండలు, చిన్న రైలుపెట్టెనంత పరిమాణంమొదలు రోడ్డు మీద పరచు చిన్న కంకరరాయి పరిమాణం వరకుగల రాళ్లు కరుగుచున్న మంచుతో మిక్కిలి వేగముగ దబదబమని అనేక విధములగు ధ్వనులజేయుచు ఎల్లప్పుడూ పడుచుండును. కొన్ని "ఇదిగో! చూచుకోవడు! పడుచున్నాము"అని పడుటకు సిద్ధముగనుండి యింకను కొంచె మెంతులకో తటపటాయించుచు చూపరులకు భయము గొలుపుచుండును. కావున యాత్రికులు రాళ్లు పడని క్షణములలో పైకి అష్టావధానము చేయుచు గోముఖము తేసి తొంగిచూచి దర్శనముచేసుకొని తటాలున బయటికి వచ్చి గోముఖమున కిరువది ముప్పదిగజముల దూరము దిగువనున్న గంగలో స్నానాదికము చేతురు. అక్కడనే గోముఖగంగనుకూడ పట్టుకొందురు.

గోముఖము మొదలు దేవప్రయాగవరకు రమారమి ౧౪౦ మైళ్లు నదికి భాగీరథి యని పేరు. అక్కడ బదరీనారాయణమునుండి వచ్చు అలకనంద కలియును. కేదారనాథమునుండి వచ్చు మందాకిని అలకనందలో దేవప్రయాగ కెగువ ౪౦ మైళ్ల దూరములో నున్న రుద్రప్రయాగవద్ద కలియును. దేవప్రయాగనుండి గంగానది యని ప్రసిద్ధి. గంగోత్రికి ౭ మైళ్లు దిగువ, ౪౦ మైళ్లు ఎగువను హిందూదేశపు సరిహద్దున నున్న కేలూఘాగా అను ప్రదేశమునుండి వచ్చు జాహ్నవి యను వేరొకనది భాగీరథియందు కలియును.

చాలకాలమునుండి వెళ్లవలె ననుకొన్న గోముఖ కైలాసము చేరితి నన్న ఆవేశముచేత పరవశుడనై బట్టలను దిగవిడిచి కౌపీనముతో వడివడిగ రాళ్లబండలమీద దుమికి గోముఖద్వారమునకు మూడు గజముల దూరమునకు వెళ్లి (ఉత్తరాభిముఖమయిన గోముఖమునుండి ఆవిర్భవించినగంగ ఏడెనిమిదిగజముల దూరమువరకు ఉత్తరవాహినియై తదనంతరము పశ్చిమవాహిని యైనది) దిగి గబగబ ఏడుమునకలు వైచితిని. అక్కడ, అప్పటికింకను మంచుగోడ అడ్డుగుటచే ఎండకూడలేదు. నీళ్లు మంచుగడ్డంత చల్లనివి. కళ్లు చీకట్లు కమ్ముకుపోయినవి. దవుడలు నొక్కుపడినవి. ముక్కుపిండి నట్లయినది. జుట్టు అటు నిటు గుంజుతున్నట్లు తోచింది. తల బ్రామా ప్రెస్సులో పెట్టి నొక్కిన ట్లయినది. ఒడలంతా భగ్గుమని మండుచున్నది. కాళ్ల అస్తిత్వమే తెలియుటం లేదు. చేతివ్రేళ్లకణుపులమీద ఇనుపకర్ర దెబ్బలు తగులుచున్నవి. వ్రేళ్లచివరులలోను గోళ్ల లోను వందలాది సూదులతో "చురుకుచురుక"ని గ్రుచ్చుచున్నట్లుండుటచేత పూర్వపు ఠగ్గుల (**Thugs**) చిత్రవధలు స్మరణకు వచ్చినవి. రక్తము గడ్డకట్టి శరీరమంతయు కంది నల్లబడినది. కష్టముమీద నీటిలోనుండి బయటపడి పైనుండి పడురాళ్లను తప్పించుకొనుచు, ఎండలోనికి వెళ్లి నిలుచుని ఒకపావుగంటకి సక్కత్రిప్పుకొని క్రొత్తకౌపీనము ధరించి తల తుడిచికొంటిని. ఇత్తడికమండలువును, అల్యూమినపు థరిణెను తీసుకొని మరల మృత్యువుతో చెలగాటమువలెనె పైకి చూచుకొనుచు గోముఖముదగ్గరకు వెళ్లి గంగను పట్టితిని. ధగధగమండిపోవుచేతులతో బయటికి వచ్చి ఎండలో నిలబడి బట్టలు కట్టుకుని హారతికర్పూరము వెలిగించి పరమపావనియగు గంగాభవానికి హారతి నిచ్చి, గోధుమాదిచూర్ణమును, వెన్న బిస్కత్తులను బ్రహ్మార్పణము చేసి, ప్రసాదమును కూడనున్న సాధువులకు పంచిపెట్టి ధ్యానమునకు కూర్చుంటిని.

"ఇంతబాధపడి అంతదూరమువెళ్లి పుణ్యమును మూటకట్టుకుని వత్తురా? లేనిచో వెళ్లకపోయిననేమి? అక్కడనున్న దేవుడు ఇక్కడలేడా?" అని అనేక కుశ్శంకలను తార్కికులు కొందరు వేయుదురు. వేయుదురుగాక! పాపము! వారు, ఘ్రాణశక్తి లేనివాడు వస్తువుల గంధతత్వవివేచన మెరుగనియట్లుల ఆధ్యాత్మిక వాతావరణము, అంతరంగికభావములయొక్క వాస్తవికతత్వముల తెలిసికొనలేనివారు. అగరువత్తి వెలిగించిన చోట, వత్తివెలిగిపోయిన వెనుకగూడ సుగంధము దాని చుట్టుప్రక్కల చాలసేపటివరకు ఎట్లు వ్యాపించి పరిమళించుచుండునో అటులనే ఋషులు, మునులు, సిద్ధులు, యోగులు, భక్తులు, జ్ఞానులు మొదలగు

ఆధ్యాత్మికసాధనను సలిపిన స్థలములలోగూడ వారు గతించినను వారిచే వ్యక్తీకరింపబడిన ఆధ్యాత్మిక వాతావరణ మను సుగంధము, అయస్కాంతము (Magnet) చుట్టూ దానిశక్తిమండలం ఏర్పడియుండు నట్లు, అనేకవేలసంవత్సరములు వ్యాపించి యుండి దానియావరణలోనికి వచ్చినవా రెల్లరిమీదను దాని ప్రభావమును ప్రసరింపచేయుచుండును. అట్టి ఆధ్యాత్మిక వాతావరణ ప్రభావముయొక్క ప్రసారమును పొందగోరు ముముక్షువులు ఎట్టి కష్టములనైన సహించి అట్టి ప్రదేశములకు బోవుచుందురు. వారివారి అధికార తారతమ్యమునుబట్టి ప్రతివారికిని ఆ వాతావరణమును గ్రహించుశక్తి కొద్దిగనో, గొప్పగనో యుండును. అందుచే వారు దానిని జ్ఞాతముగనో, అజ్ఞాతముగనో గ్రహించుచునే యుందురు. ఆది అనుభవమువలన దెలుసుకోవలసినదే.

కొంతసే పయినది. ఫిరంగి పేల్చిన మ్రోతవంటి భయంకర మగు ధ్వనియొకటి తీవ్రముగ నా చెవుల బడి ధ్యానమునుండి లేపినది. చూచుసరికి గోముఖముమంచు దిబ్బలపైనుండి ఎప్పుడు పడుదునా యని నిరీక్షించుచున్న పెద్దరాతిబండ యొకటి గోముఖమునకు క్రింద నేను స్నానముచేసిన చోటున నొకరాతిచరప పైబడినది. ఛిన్నభిన్నమై నిప్పురవ్వలవలె సన్ననిరాళ్లుపైకి త్రుళ్లిపడుచున్నవి. పడినచోటుకూ, మాకుమధ్య ఒక పెద్ద మొద్దుగోడవంటి రాతిబండ అడ్డుగ పడియున్నది. అదియే మమ్ముల కాపాడినది. అది పడిన వెనుక నా వెంటనున్న స్వాము లింక నచ్చట ఉండుట కిచ్ఛగింపక పోయిరి. నాకును ధ్యానమునకు స్వస్థత లేకపోయినది. అట్లనే కొంతసేపు గీతాపారాయణ చేసికొనుచుంటిని. ఇంతలో సూర్యునికి చిన్న మేఘ మడ్డుపడియెను. చూడగా మేఘములు వృద్ధి యగుచుండెను. ఫోటో తీయుటకు వీలుండదని కెమెరా, తీసికొని గోముఖము దగ్గరకు సిద్ధమయితిని. ఒకఫోటో తీసితిని. రెండవది తీయునంతలో ఒకరాయి టకటక దొర్లుచువచ్చి మరియొకరాతిమీదపడి ఛిన్నభిన్నములై నావైపున కొకరాయివచ్చినది. నేను ఫోటో [Snap] తీయు సమయమున అసందర్భపుస్థలమున తప్పుకొన వీలుకాక వంగితిని. దైవవశమున ఆరాయి నాతలపైనుండి దూసుకుపోయినది. వెంటనే కెమెరా తీసుకుని బయటపడి పుస్తకములు వస్త్రాలు సర్దుకొనేసరికి కందిగింజలంత వడగండ్లుపడ నారంభించినవి. తొందరతొందరగ నందరము పేలపిండిని, ఉదయమున కాల్చుకొనిన బంగాళాదుంపలను, సెనగలు బెల్లమును తిని బయలు దేరితిమి.

౧-౩౦ గంటలయినది. కొద్దికొద్దిగ మంచు, వడగండ్లు, మధ్యమధ్య సన్ననిచినుకులు పడుచున్నవి. అప్పుడప్పుడు గ్రుడ్డియెండకాయుచున్నది. "గంగామాయీకీ జయ్" అనుచు ఒకరాతిమీదనుంచి మరియొక రాతిమీదికి పదిలముగ దుముకుచు కొద్దిగ జారుచు 'తొందర పడకు'డని ధైర్యము చెప్పుకొనుచు సాగితిమి. కత్తులవంటి బద్దరాళ్లు గీసుకుపోయినపుడు, రాళ్లు దొర్లి కాళ్లమీద పడి దెబ్బతగిలినపుడు, ఓంఓం నారాయణ యనుకొనుచు దిగ ప్రారంభించితిమి. మేము దిగినకొలది వాన మమ్ముల నెంబడించుచు హెచ్చుసుచునే యుండెను. కష్టపడి ౫ మైళ్లు దిగితిమి. "చీడుబాసు" కుటీర మింకొక మైలుదూరములో నున్నది. ౩ గంట లయినది. వాన ఎక్కువ సగుచుండెను. ఒక పెద్దరాతిబండక్రింద కర్షము వెలియువరకు విశ్రమించుట కాగితిమి. ఆరాతిచరపక్రింద ఒక ప్రక్క అర్ధ అడుగుల యెత్తుమాత్రమే యుండెను. వాన క్రమముగ వృద్ధి నొందసాగెను. చలిగాలి తీవ్రముగ వీవ మొదలిడెను. బయటకు కదలుటకు వీలులేకుండెను. అయి దారుగురము వడుములు వంచుకుని అతివినయముగ వంగి భగవత్ప్రార్థనము చేసికొనుచు ఒకరి వానుకొని యొకరము కూర్చుంటిమి. వెనుక ప్రక్కనున్న రాతికి చేరపడుదమన్న పై నుండి నీరు క్రిందికి దిగి వూటలను తడుపుచున్నది. తల ఎత్తుదమన్న పైనున్న రాతినీరు తలమీద, ఒంటిపై నున్న కంబళిమీద, పడుచున్నది. కాళ్లు చాచుకొందమన్నను రాతిబండ ముందు నేలమీదికి వ్రాలియుండుటచే వీలులేక యుండెను. మాలో నొకరు రాతిక్రిందనే గోయిత్రవ్వి మట్టిని లోనికి వచ్చు నీటి కడ్డుగ వేసికొని గోతిలోనే మకాముచేసిరి. ౪ గంటలకు వాన ఆగి సన్నముత్యములవంటివడగండ్లు

పడ నారంభించి అరగంటలో భూమిని కప్పివేసినవి. వెంటనే మంచు పడ ప్రారంభమాయెను. ఉరుములు ప్రతిధ్వనించుచుండెను.

సాయంకాలము ౮ గంట లాయెను. అర అడుగెత్తు మంచు పడినది. వాతావరణము ౩౮ డిగ్రీల యుష్ణము కలిగి యుండెను. తుదకు త్రోవలో కలసిన జమ్మూ క్షత్రియ బ్రహ్మచారి యొకరు సాహసము చేసి వాగోడును వేసికొని బయటికి వెళ్లి మంచులో కూరుకొని పోవుచున్న పందెడు కట్టెలను, రెండు మూడుదుంగలను ఈడ్చుకొని వచ్చి గుహాప్రక్క పడవేసిరి. ఆపుల్లల నంటించితిమి. కొంచెము సేపు చలికాగి చేతులు స్వాధీనమైన వెనుక పందుచేసుకొని బయటికి వెళ్లి అవశిష్టములు దీర్చుకొని మరల రాతిక్రింద దూరితిమి. రాతి బండపై నున్న మంచుకరగి లోనికి నీరుపారుచుండెను. నేను కూర్చున్న ప్రదేశము గాలికెదురగుటచే వెన్నంతయు చలిచే గడ్డకట్టుచుండెను. నిప్పువేడి ముందుకు కొంచెము తగులుచుండెను గాని పొగపైకి వెళ్లకపోవుటచే ఊదటపెట్టినట్లుండి కళ్లనుండి నీరు కారుచుండెను. అట్టి కష్టసమయములో ఆకలి బాధింపగా మిత్రులు స్మరణకు వచ్చిరి. వారు ప్రేమభక్తులతో నిచ్చిన గోదుమాది చూర్ణం, వెన్నబిస్కత్తులు నారగించితిమి. వారికి మరల మరల ననేకధన్యవాదము లర్పించినాము. శీతలప్రదేశమగుటచే నిక్కడ నాలుగురెట్లు అధికముగ ఆకలియగును. వాన కురియక పోయినచో గంగోత్రికి పోయి వండుకొని తినవచ్చునని యనుకొంటిమి. వీలులేక పోయినది. మిత్రులిచ్చిన పాథేయము లేనిచో ఎంత బాధపడవలసి యుండెడిదో ? ఆక్షణమున మా యానంద మపారము, అనంతము. వారి జన్మము సఫలమైనది ! వారియన్నము కోటిగుణితమైనది. వారికి గోముఖ యాత్రాఫలము లభించినది. ఇందులకే మనవారు ధర్మకార్యములను, తీర్థయాత్రలను తాము స్వయముగ జేయ లేకపోయినను చేయువారికి తోడ్పడుట యను సదాచారమును పెట్టియున్నారు. గంగానది పదిపంద్రెండు గజముల దూరముననే మహాప్రణవనాదమును చేయుచు, గుహలయందు ప్రతిధ్వనింప జేయుచు ఒకరిమాట ఇంకొకరికి వినబడనీకుండ ప్రవహించుచున్నది. నా కతి తీవ్రమయిన దాహమయినది. బయటికి వెళ్లుటెట్లు ? చివరకు చెయి చాచి బయటపడి యున్న మంచును రెండుమూడుపట్టెళ్లు తీసి అల్యూమినపుకప్పులో వేసి నిప్పుపై కరగబెట్టి త్రాగితిని. ఇక తెల్లవారుటెట్లు ? వెన్ను చలిచే వంచుకొనిపోవుచున్నది. ముందు కొంచెము నిప్పుసెగ. ఒక ప్రక్క జోగు. నిద్రపోవుటకు వీలులేదు. రాత్రి ౧౧ గంట లగుసరికి ఒక అడుగు ఎత్తు మంచుపడి ఆగిపోయి ఆకాశము తెరపి ఇచ్చినది. నీలాకాశమున నక్షత్రములు కానవచ్చెను. చంద్రుడు సంపూర్ణ కళలతో ప్రకాశించుచుండెను. దానితో చలి మరింత తీవ్రమాయెను. రాత్రి ౩ గంటలగుసరికి శీతోష్ణమానం ౩౦ డిగ్రీ లయినది. ఇచట అడుగు మంచు పడినపుడు గోముఖమువద్ద ౧౫ గజము ఎత్తు మంచుపడుట లెక్కయే.

పాడ్యమీ మంగళవారము [౨౫-౬-౧౯౩౮]
ఉదయము ౫ గంట లయినది. సూర్యకాంతి చుట్టు ప్రక్కల నున్న కొండశిఖరములపైని మంచుమీద పడి కరగిన చాంది వెండివలె కలంక రహితమైన తెలుపుతో తళతళ ప్రకాశించుచున్నది. ఎండకొరకు రాతి క్రిందనుండి తొంగిచూచుచున్నాము. ౫ గంటలయినది. క్రింద నుండి "ఓం ఓం ఓం, కృష్ణకృష్ణ, పరమేశ్వరా" యనుకొనుచు ఒకరివెనుక నొకరము బయటికివచ్చితిమి. "గంగామాయీకీజయ్" అని చేతులను కాళ్లను ఒక్కసారి సరిచేసుకొని ఎండలో మంచుపైన నిలబడితిమి. అంత కీళ్లపట్లు కొంత సడలి ప్రాణములు తావులకు చేరినవి. నాలుగుప్రక్కలనున్న కొండలు పిండారబోసినట్లు దూదివంటి తెల్లని మంచుతో కప్పబడినవి. వాటిమీదపడు సూర్యకిరణములు కండ్లలో చురుకు చురుకుమని పొడుచుచు మిరుమిట్లు గొలుపుచుండెను. కొండప్రక్కలనున్న చెట్లన్నియు అతినమ్రములై, గుహలోనుండి బయటికివచ్చు మాకు "నమోనారాయణాయ" యని వంగి ప్రణమిల్లుచున్నట్లు మంచుచే కప్పబడి, భారముచే వంగి, క్రుంగి, నేలకంటుచున్నవి. నాకము వదలి భూమిపై ప్రకటము కావలసివచ్చిన దనువాగ్రహముచేతనో యన అత్యుగ్రముగ ప్రచండవేగముతో జన్మస్థానమగు గోముఖమును వీడి సోపానముల

పైన వడివడిగ దూకుచు గౌరీకుండముదగ్గర సిద్ధముగ వేచియున్న శివుని జటాజూటమున బడుటకయి పోవు చున్న గంగాదేవియొక్క మహాప్రవాహము తప్ప సర్వమును మంచుమయ మయియున్నది. నిజముగ చూచి ఆనందించవలసిన దృశ్యము. పడినశ్రమ కంతకును మరపురాని ఈదృశ్య మొక్కటి చాలును. మేము క్రిందకు వెళ్లుచుంటిమో లేదో యని మెడయెత్తి సుస్తముగ తొంగిచూచుచున్నదోయన సర్వాంగపూర్ణముగ రజతాలంకృతమైన గోముఖశిఖరద్వంద్వము తూర్పు దిశను దూరముగ కానవచ్చుచు నుండెను. ఆహా ఏమి వాటిశోభ? సూర్యకాంతికి రాళ్లపైనున్న మంచు కొద్ది కొద్దిగ కరగి కొన్ని కొన్ని రాళ్లు బయట పడుచున్నవి. అప్పుడు బయలుదేరి ౧౦౦ గజములు సాగితిమి. త్రోవ గానక కొంతసే పొకరాతిబండపయి కూర్చుంటిమి. సాహసించి మరల బయలుదేరి నెమ్మది నెమ్మదిగ రెండుగంటలకాలమున కొకమైలుదూరము నడచితిమి. అప్పటికి మంచు చాలభాగము కరగి త్రోవబాగుగ కనబడ ప్రారంభించినది. తరువాత వడివడిగనడచి సాయంకాలము ౪॥ గంట లగుసరికి "గంగోత్రి" చేరితిమి. గంగాదేవాలయమునకు చేరగనే పంజాబీక్షేత్రము మేనేజరుగారు మమ్ముల కడుభక్తితో నాహ్వానించి ఒకగంటలో "కిచిడీ" (పులగము) తయారుచేయించి పెట్టిరి. గంగయొడ్డుకు తీసుకువెళ్లి కడుపునిండుగ నారగించి "అన్నదాత సుఖీభవ!" యనుచు మా గుహకు బోయి రాత్రి విశ్రమించితిమి.

---

# పజిల్స్

శ్రీ చందూరి నాగేశ్వరరావు

స్వతహాగా వెంకట్రావుకి అట్టే ఆలోచించడం అంటే గిట్టదు. చాలావిషయాలు అతను కొలతబద్దల లాంటి తన సిద్ధాంతలతో అటో యిటో తేల్చేస్తూ వుంటాడు. అంచేత అన్ని దీక్షవశీలమనస్కుడై చుని దారుణంగా ఆలోచిస్తున్న వెంకట్రావుని చూడగా నాకు ఆశ్చర్యం కలగడంలో వింతలేదు.

"ఏమిటీ అట్టహాసం అంతా?" అని అడిగాను.

"'లింక్స్' లో తప్పులురాకుండా వుండేందుకు ఎనిమిది ఎంట్రీలు పంపుతున్నాను. దీనికూడా 'ఛాయిస్' యివ్వాలంటే పదహారు పంపవలసివస్తుంది."

తీక్షణంగా చూశాను, గుడిగుండాలవంటి ఆ చదరాలవైపు.

"ప్రయిజ్ ఎంత?" అన్నాను.

"ఎంతలే! అయిదువేలు."

పాపం! ఇంతే!!

"ఆ మొత్తం అంతా నీకే వస్తుందనా నీ నమ్మకం?" అని అడిగాను.

"నా ఒక్కడికే కాకపోతే, యిద్దరికి. పోనీ ముగ్గురికి అందాం. లేదా, నలుగురికి చూడు. నలుగురికయినా ఒక్కొక్కరికి పన్నెండువందల యాభై వస్తుంది."

నాకు పజిల్స్ అన్నా, థర్డ్ ఫారంలో నా చేత గుంజీలు తీయించిన మాష్టరన్నా పరమద్వేషం. నా చెయ్యిచూసిన ప్రతి హస్తసాముద్రికుడూ నాచేతిలో అదృష్టరేఖవుందనీ, సిరి ఏ నాడో ఉప్పెనలా వచ్చి పడుతుందనీ, యుద్ధసమయాలలో ఫ్రాంటియర్సు కాపాడేటంత జాగ్రత్తగా వుండవలసిందనీ వాదిస్తూ వుండేవాడు. ఇప్పటికీ హస్తసాముద్రికులు అలాగే అంటారు. కాని మర్యాదగా బతికేందుకు పెద్దమనిషి తరహాకంటె కొంత కృత్రిమం ముఖ్యావసరమని తెలియని ఆరోజుల్లో వాళ్ల దంభాలలో కొద్దిపాటి నిజమైనా వుండకపోతుందా అనుకొనేవాణ్ణి. ప్రపంచంలో పజిల్స్ ముఖ్యంగా క్రాస్‌వర్డ్ పజిల్స్-అంటే నాకు వుండేవెర్రి వ్యామోహం కొత్తగా కాపరానికి వచ్చిన భార్యమీదకూడా ఏభర్తకీ వుండదు.. సుమారు నాలుగైదువందల రూపాయిలు ఫక్తు పజిల్స్‌కిగాను తగలేశాను; వ్రాతకి ఎంతమాత్రం అనుకూలంకాని ఒక ఫౌంటెన్ పెన్ బహుమతిగా పొందగలిగాను.

చూస్తూ చూస్తూ వుండగా వెంకట్రావు—నాకు కావలసినవాడూ, యిబ్బంది పడుతున్నప్పుడల్లా సహాయంచేసే సహృదయుడూ—గోతిలోపడిపోవడం నాకు ఈషణ్మాత్రమూ మనస్కరించలేదు. పజిల్స్ జూదమని నేను అననుగాని, జూదగాడిలో వుండే Tendencies కాంపిటీటర్‌లో పుట్టించగలిగే సామర్థ్యం వాటికి వుందని విశ్వసిస్తాను.

"వెంకట్రావ్, నువ్వు ఈ ధోరణిలో పడ్డావేమిటి?"

"ఏం?"

"ధనార్జనకు యిదో ఉపాయం అనుకున్నావా?"

"కాదు...కాదులే..." అన్నాడు, చిరాకుగా.

అతను యింకా ఎక్కువగా చీకాకు పడతాడనీ, తన ఉత్సాహానికి భంగం కలిగించినందుకు నన్నూ నా పితృదేవతలనూ మనస్సులో తిట్టుకుంటాడనీ నాకు తెలుసు. అయినా వక్రమార్గాన్ని పోబోతున్న మిత్రుణ్ణి మంచిదారిలోకి తీసుకురావడం నావిధికాదూ!

"పజిల్స్‌కీ, నల్లమందుకీ ఎంతోవారలేదు." అన్నాను. నాపలుకులు అతని కర్ణరంధ్రాలలోకి చొరలేదు.

"ఇదిగో, బ్రదర్, మన జీవితాన్ని నడిపేది (Guide) సహధర్మచారిణియా లేక విధియా (Mate or Fate) పొద్దుట్నుంచీ ఆలోచిస్తున్నాను. కాని ఆలోచన తెగడంలేదు."

'ఈ గర్భిణీస్త్రీకి ఆడపిల్ల కలగవచ్చును. తప్పితే నిశ్చయంగా మొగపిల్లవాడు' అని చెప్పిన జ్యోతిష్కుడిలా మాట్లాడాను. పజిల్స్‌కి ఒక ఆకర్షణశక్తి వుంది, దగ్గిరలో వుండి తమమీద ఏమాత్రం అభిమానం చూపుతున్నా సరే తమలోకి లాగేసుకొని అధఃపాతాళం లోకి అణగదొక్కేస్తాయి.

వెంకట్రావుకి పావుగంటసేపు నీతులు బోధించాను. నా బోధలన్నీ మన్నులోకే కుత్తినియలై పోయినై. నాలో తాంత్రికశక్తిగానీ, మాంత్రికశక్తిగానీ, ఆధ్యాత్మికశక్తిగానీ, మరింకే యితరశక్తిగానీ లేకపోవడంచేతనే నా పవిత్రప్రయత్నంలో జయంపొందలేకపోయాను. ఆరోజు ఆఫీసుకి సెలవుపెట్టి నిరశనవ్రతదీక్ష పూనుతానని బెదిరించి, ఉపవాసంచేసివుంటే ఫలితం ఎలా వుండేదో చెప్పలేను.

నేను ఓడిపోయాను. తెలివితేటలనూ అయిదు రూపాయిలనూ జతచేసి, ఎంత తేలికగా చూసినా ఒక వెయ్యిరూపాయిలపాటి లబ్ధి అయినా పొందాలని వెంకట్రావు సంకల్పం.

నీవు "సులభంగా వెయ్యిరూపాయిలు వస్తాయని త్రికరణశుద్ధిగా నమ్ముతున్నావు కనక అయిదు రూపాయిలకు ఇంకో అయిదురూపాయిలు కలిపి పది రూపాయిల ఎంట్రీఫీజుతో Fate Mate "కాంబినేషన్' కూడా పంపు" అని సలహా యిచ్చాను.

ఎంచేతనో, వెంకట్రావుకు నాసలహా నచ్చలేదు. నేను ఎగతాళి చేస్తున్నానేమో అనే శంకతో నావంక ఓరకంట చూశాడు. కాని నన్నుగురించి ఆలోచించేందుకు అతనికి వ్యవధిలేదు; Fate Mate లలో ఏదో ఒకటి తేల్చేయాలి. అవతల ఆఫీసుకి టైమవుతోంది. ఆ పజిల్‌కి 'క్లోజింగ్ డేట్' కూడా ఆరోజే!

అయిదురూపాయిలు మాత్రమే ఖర్చుచేసి, వెయ్యిరూపాయిలు జేబులో వేసుకోవడంలోనే మొగతనమూ, తన విజ్ఞానానికి తగినప్రతిఫలమూ వుందనీ, పదిరూపాయలు పాడు చెయ్యడం చాలా పొరబాటైన విషయమనీ వెంకట్రావు హెచ్చరించాడు. తొమ్మిది రూపాయల వడ్డీకి పావుకోళ్లు స్వాతివానకి ముత్యపు చిప్పలలా ఎదురుచూస్తున్న కూపోజాలలో, పదిరూపాయలు మనియార్డరుచేసి వెయ్యిరూపాయిల కొరకు (వెయ్యికి పైనే అతని లెక్కప్రకారం) అందుకోవడం అసంగతంగా అనిపించింది. మీకూ నాకూ ఆసిద్ధాంతంలో వున్న సొప్పుతనం తెలియకపోవచ్చు. కాని, అది వెంకట్రావు సిద్ధాంతం సుమండీ! అయిదు రూపాయిలతో, ఎంత హీనంగా చూసినా, వెయ్యి రూపాయిలు రావాలి. పదిరూపాయిలతో నా... 'నో' 'నో' 'నో'.'

జారిపోతున్న నిక్కీకుళ్లి చూసి, జాలిపడి, చెడుసులోని మంచి చూపిద్దామనే ఆపేక్షతో Fate, Mate ల గురించి నేనుకూడా ఆలోచించడం ఆరంభించాను.

Mate అంటే సహధర్మచారిణిలాంటిది. జీవితాన్ని Guide చేసేది. నడిపేది, నడిపించేదికూడాను. బాగానే వుంది. జీవితాన్ని guide చేసేది mate అవడంలో పొరబాటు లేదు.

ఇంక Fate. ఈజీవితం అంతా Fate కాక మరింకేమిటి? నేను ఈకథ వ్రాయడం, మీరిది చదవడం, 'రాత్రి వొంటిగంటదాకా ఏమిటండీ ఆవ్రాత' అంటూ శాంత విసుక్కోవడం, యిదంతా ఏమిటి Fate కాక? సృష్టి స్థితి లయ కారణం Fate అంచేత మన జీవితాన్ని guide చేసేదికూడాను Fate!

ఆలోచించాం. చాలాసేపు ఆలోచించాం సోదాహరణాలతో సహా. వేదాంత దృష్టితో వీక్షించాం; సాంసారికదృష్టితో పర్యాలోచించాం. చెట్టు ముందా, విత్తు ముందా?

కాని, ఏది ముందో తేల్చెయ్యాలి. వెంకట్రావు సిద్ధాంతాల ప్రకారం ఒకటి ముందూ, రెండోది తరవాతా అయివుండాలి. పరీక్ష ఫేలయిన కుర్రాడి మొహంలా ఏవిషయమూ కొశ్చన్ మార్కులతో వుండడం అతను సహించలేడు.

'దొర - దొంగ' ఆటలోమాదిరిగా రెండు కాగితం ముక్కలమీద ఆ రెండు మాటలూ వ్రాశాం. ఎగరేశాం. తియ్యగానే Mate వచ్చింది. మళ్లీ రెండుసార్లు చూశాం. తతిమ్మా రెండుసార్లూ Fate వచ్చింది. మెజారిటీ. ఎక్కడయినా అంతే కామా! Fate అని కూపనుమీద వ్రాస్తున్నప్పుడు గడియారం టంగుటంగు మంటూ పదిఘంటలు కొట్టింది.

"విజయసూచకం" అన్నాడు.

"మూఢనమ్మకం" అన్నాను.

కాంపిటేషన్ మేనేజరు సీల్డ్ కూపను ప్రచురిత మయింది. వెంకట్రావు పంపిన ఎనిమిది ఎంట్రీలలోనూ ఒక ఎంట్రీలో ఒకే ఒక్క తప్పు ఉంది. గడియారం జయధ్వానాన్ని సూచిస్తుం దని వెంకట్రావు అపోహ చెందాడు గాని Mate అని కాంపిటేషన్ మేనేజరు జవాబులో ఉంది.

ఈ Fate Mate ల విషయంలో యుద్ధం సద్దులాడుకున్నాం.

"నేను Mate వ్రాయమంటే నువ్వే Fate వ్రాశావు" అన్నాను నేను.

"కాదు, నేను Mate వ్రాయబోతూ వుంటే నువ్వే Fate వ్రాయమన్నావు" అన్నా డతను.

నాది పొరపాటయినా, అతనిది పొరపాటయినా, అతని Fate అలా ఉంది. అయిదువేల రూపాల యోగ్యత లేకపోయింది.

ప్రయిజ్ లిస్టు వచ్చింది. వెంకట్రావు పేరు కూడా వుంది. 'ఆల్ కరక్ట్'గా ఒక మిస్ పంపించింది. ఆమెకి అయిదువేలూ పోగా ఒక తప్పువారు పద ముగ్గురు ఉన్నారు. ఒక్కొక్కరికి రూ ౮౩-౧౫-౮ వచ్చింది.

ప్రయిజ్ లిస్టులో వెంకట్రావు పేరు చూచినపుడు నాకు ఈర్ష్య కలగకపోలేదు. పజిల్స్‌లో ఎంతమాత్రం అనుభవమూ లేని వెంకట్రావు మొట్ట మొదటిసారి సుమారు డెబ్బయినాలుగు రూపాయిలు సంపాయించగలిగితే, యింతో అంతో అనుభవం వున్నవాణ్ణి, ఆ సాధక బాధకాలు అనుభవించినవాణ్ణి అయిన నేను......అంకగణితం అదే అరథ్‌మెటిక్ యిక్కడ ఫేలవుతుంది లెండి. ఆవిషయం నేనూ ఒప్పుకుంటాను. ఇలాటి ఈర్ష్యలు పొడచూపితే, వెంకట్రావుకి ద్రాంతరీత్యా వాటిని బైటికి పొసగని య్యకుండా చేసి, మనస్సులోనే కప్పెడుతూ వుండాలి. వెంకట్రావు జయం నాదే అన్నట్లుగా ఎంతో నేర్పుతో నటించగలిగాను.

అతని ఆకస్మిక జయాన్నీ, అదృష్టాన్నీ శాంతా దేవితో చెప్పగా, ఆమె మొహం అంతా కళ్లు చేసు కొని, "అయితే వుండండి, యివ్వాళనుంచి నేను మొద లెడతాను, పజిల్స్ సాల్వ్ చెయ్యడం" అంది.

నా గుండెలలో రాయి పడింది. 'కీ' యిచ్చి వదిలిపెడితే తనంతట తానే తిరిగే స్ప్రింగు బొంగరం లాంటిది శాంతా దేవి.

"శాంతా, స్కూలు ఫైనలు పాసయినంత మాత్రాన పజిల్స్ సాల్వ్ చెయ్యగలనని నీ నమ్మకం?"

నా అర్ధాంగి ధరించిన తెల్ల చీరకీ ఆమె మొహానికీ ఎంతో తేడా కన్పించలేదు.

"ఏం బి. ఏ. పాసయితేగాని పజిల్స్ సాల్వ్ చెయ్యలేరా?"

"హృదయవికాసమూ, ఆత్మ- ఔన్నత్యమూ, శాస్త్రపరిచయమూ, ప్రపంచజ్ఞానమూ...

"ఏమి టవన్నీ!! ఎందుకలా ఏకరువు పెడు తున్నారూ?"

"అవన్నీ వుండాలి."

"పజిల్స్ సాల్వ్ చేసేందుకా?"

"అవును."

"వెంకట్రావుకి యివన్నీ ఉన్నాయా?"

"ఊ."

శాంతా దేవి ఒక్కమారు దీర్ఘంగా ఆలోచించి, బూజుపట్టిన దూలాలవైపూ, చీమలు పాకుతున్న గోడలవైపూ చూస్తూ, "ఏమండీ, మీరు పజిల్స్ సాల్వ్ చెయ్యగలరూ?" అని అడిగింది.

"ఊ" అన్నాను ఢంబాచారిలా. అంతటితో వూరుకోక, నా అనుభవాలన్నీ ఆమె వీనులకి విందు గొలిపేటట్లు నివేదించాను.

నా లెక్చరంతా కాలేజీగరల్ వలె కాక ఎంతో శ్రద్ధగా విని, "అయితే, నేను సాల్వ్ చెయ్యగలను,— అవసరమైనపుడు మీ సహాయం వుంటుంది కాదూ!"

ఆకాశం విరిగి నెత్తిని పడ్డట్టయింది. నా చెవులు నన్ను మోసం చేస్తున్నాయేమో అని భ్రమించి, "ఏమిటిదీ?" అన్నాను.

"పజిల్స్ నేనూ సాల్వ్ చేస్తాను," అంది శాంత, ఎంతో ఓర్పుతో.

స్త్రీవిద్యవల్ల కలిగే చిక్కులు అనుభవపూర్వకంగా యిప్పుడిప్పుడు తెలుస్తున్నాయి. శాంతా దేవిని వాళ్ల వాళ్లు మెట్రిక్యులేషన్ వరకూ చదివించడం పొరబాటేమో అని ఒక క్షణకాలం సంశయించాను. కాని, యిదంతా స్టేషనుకి ఆలస్యంగా వచ్చి తప్పిపోయిన రైలుకోసం విచారించడంలాంటిది.

"శాంతా! నువ్వు ఈ అఖాతంలో పడకు. పజిల్స్ నీబుర్రని పాడుచేస్తాయి. అసలే నీది మైమరపు స్వభావం. పజిల్స్ సాల్వ్ చెయ్యడం ఆరంభించావంటే, క్యారియర్ భోజనం మనకి ప్రాప్తమవుతుంది."

"మరీ చోద్యంగా చెప్తారు! మొదటి ప్రయిజ్ ఎవరికి వచ్చిం దన్నారూ! మిస్ అలివేణికా? ఈమారు శాంతా దేవికేనూ!"

వ్యవహారం అప్పుడే ముదిరిపోతోంది. వెంకట్రావు నామాట వినక చెడిపోయాడు. చెడిపోయినా రూ. ౨౩-౧౫-౨ వచ్చాయి. కాని, నాకుగాని నా సహధర్మచారిణికి గాని అలాటి అదృష్టం వుందని అనుకోను.

భార్యని వొప్పించి తన దారికి తీసుకురాగలిగిన సామర్థ్యం భర్తలో లేని సందర్భంలో, అతనే ఆమె యిష్టాన్ని అనుసరించి ప్రవర్తించడం శ్రేయస్కరం. ఈవిషయం వెంకట్రావూ వొప్పుకుంటాడు. నేను చేసిందికూడా అంతే!

ఒక నెల గడిచింది. అంటువ్యాధిలా నాలోకూడా అంటుకించింది ఈబాధ. ముగ్గురం ఒక కూటంలా తయారయాం. ఆఫీసునుంచి రాగానే నేనూ, వెంకట్రావూ, శాంతా వాదప్రతివాదాలు సల్పుతూ వుండేవాళ్లం. తరుచూ— యిద్దరం ఒకవైపూ, మూడోవారు యింకోవైపూ అవుతూవుండేవాళ్లం. కాని, ఏఒక్కమారూ మేం ముగ్గురం ఏకీభవించి నట్లు నాకు జ్ఞాపకంలేదు.

ఇద్దరం ఏకీభవిస్తే తప్పనిసరిగా భేదం పొడసూపేది. నేనూ, వెంకట్రావూ ఒక పక్షమై శాంతని వేరు చేశామా, ఆరోజున ఎంతలేదన్నా, రెండు గాజుకప్పులయినా బద్దలవుతా యన్న విషయం అనుభవపూర్వకంగా తెలుసుకోగలిగాను. అయిదున్నరనుంచి రాత్రి ఎనిమిదిన్నరదాకా వాదించుకునేవాళ్లం.

Sight,, Light, Night ల గురించి వాదించుకొన్న రోజున ముగ్గురివీ మూడు అభిప్రాయా లయిపోయినై. కాంపిటీషన్ మేనేజరు 'క్లూ' కి తెలుసు: 'మానవుడు యిది లేకపోతే జీవించడం దుర్భరం.'

ఏది? Sight Light Night లలో ఏది? Sight, అంటే దృష్టి. Light, అంటే వెలుగు. Night అంటే నిశీథం. ఈ మానవుడు మానవుడిలా బతికేందుకు ఆ మూడూ అవసరమే అంటారు మీరు. కాని, ఆ కాంపిటిషన్ మేనేజరు ఒప్పుకోడు; తను యిచ్చిన 'క్లూ'కి ఈ మూడింటిలోనూ ఏదో ఒకటి మాత్రమే సరిఅయిన జవా బంటాడు.

నేను 'దృష్టి' అన్నాను. శాంత 'వెలుగు' అంది. వెంకట్రావు 'నిశీథం' అన్నాడు. ఈ విషయమై మేము ఎంతఘాటుగా చర్చ జరిపామంటే, మా పక్కింట్లో కాపరం వుంటున్న అయ్యరుగారు మా యింట్లో ఏదో గలాటా జరుగుతోందని పొగాకు నములుతూ పరామర్శించేందుకు వచ్చారు.

అయ్యరుగారు వెళ్లిపోయిన తర్వాత, "మీ కంఠం కంచుగంటలా మోగుతోంది. కొంచెం నెమ్మదిగా మాట్లాడండి." అని శాంత నన్ను వారించింది; వెంకట్రావుని ఏమీ అనలేక.

మళ్లీ వాదప్రతివాదాలలోకి దిగాం.

"'నిశీథం' తప్పు అయితే, యికనుంచి పజిల్స్ సాల్వ్ చెయ్యడమే మానేస్తాను," అంటూ వెంకట్రావు ప్రతిజ్ఞ చేశాడు.

"'వెలుగు' తప్పు అయితే, నేనూ అంతే," అంటూ శాంత మారుప్రతిజ్ఞ ఉత్తరక్షణంలో చేసింది.

నేనుమాత్రం ఏమీ చెయ్యలేదు. చెయ్యలేక పోయాను. కాఫీ మానేద్దా మని ప్రతిజ్ఞచేసి, ఆ ప్రతిజ్ఞ నిలుపుకో లేకపోయినప్పటినుంచీ, యింక ప్రతిజ్ఞలు చెయ్యకూడదని ప్రతిజ్ఞ పట్టాను. ఇద్దరూ నన్ను జడ్జిగా ఎన్నుకున్నారు. జీవితంలో నిజంగా నే సబ్ జడ్జినో, జిల్లా జడ్జినో అయే యోగ్యత లేక పోయినా, ఈవిధంగా జడ్జిని అయ్యానని అనిపించు కున్నాను.

శాంతాదేవి పజిల్స్ అకౌంట్ వేరే 'మెయిన్ టెయిన్' చేస్తోంది. ఇప్పటికి రూ. ౧౯-౧౧-౦ ఖర్చు అయింది, రాబడిసున్న. అరసున్నా అయినా కాదు నిండుసున్నే!

పాపం! వెంకట్రావు వోడిపోయాడు. శాంతాదేవి నెగ్గింది. 'వెలుగు' రైటయింది. అనన్యసామాన్యమైన ఆమె విజయాన్ని నిజంగా సీసమాలికలోనే పొగడాలి గాని, ఈ వ్యావహారిక భాషలో వ్రాయడం అంత భావ్యం కాదు. ఆడదానితో పోటీపడి వోడిపోయినందుకు, వెంకట్రావు మనస్సులో చిన్నబుచ్చుకున్నా, పైకిమాత్రం గంభీరంగానే ప్రవర్తించాడు. 'స్పోర్ట్స్‌మాన్'లాగు పజిల్స్ సాల్వ్ చెయ్యడం మానేశాడు. శాంతాదేవికి మాత్రం పజిల్స్ దినదినాభివృద్ధి చెందింది.

పజిల్స్‌లో తప్పులు వస్తున్నకొద్దీ, అదృష్టహీనుణ్ణి అనే నిరాశా, డబ్బు నిష్కారణంగా వ్యయమవుతోందే అనే దిగులూ నాలో ఎక్కువ కాగా, శాంతకి ఆశా, ఉత్సాహమూ అపరిమితమయి పోతూ వుండేవి. మొదటిబహుమానం తనకే వచ్చినట్లు ఆమె అప్పుడప్పుడు సరదాగా కలలుకూడా కంటూ వుండేది. ఆ స్వప్నసుఖాన్ని వర్ణిస్తూ మర్నాటి ఉదయం నాకు విపులంగా చెప్పేది.

ఆరు నెలలు గడిచినై.

ఒక శుక్రవారం ఉదయం వెంకట్రావు దగ్గిరికి పదిరూపాయిల చేబదులు అడగడానికి వెళ్లాను. అతను లెక్క చేతిలో పెట్టి, "ఏం, బ్రదర్, పజిల్స్ ఇంకా మానెయ్యలేదూ?" అని అడిగాడు.

"లేదు."

"ఇప్పటికి ఎంత ఖర్చయింది?"

"'పెద్దకాగితం' దాటుతుంది."

"కోడలికి బుద్ధిచెప్పిన అత్తగారిలాగు ప్రవర్తిస్తున్నావే!!"

"ఏం చేస్తాం. బెటర్ హాఫ్ (Better - half) మాట తోసేస్తే, బిట్టర్ హాఫ్ ((Bitter - half) అయి వూరుకుంటుంది. అంచేత ఏమీ పాలుపోకుండా వుంది."

"నేను చెప్పినట్లు చేస్తావూ?"

"ఊఁ. అంతకంటేనా?"

"ప్రతినెలా ఆరో, ఎనిమిదో ఈ పజిల్స్ కని నిర్ణయించు. అంతకి ఎక్కువ ఖర్చు పెట్టకు."

"కష్టం చెయ్యగలనోయ్, శాంతని వొప్పించాలి."

"పద. మన మిద్దరం కలిసి వొప్పిద్దాం."

మాయింటిదగ్గిర వెంకట్రావు బాతాఖానీ ప్రారంభించాడు. ౧౯౩౦ లోని 'వరల్డ్ డిప్రెషన్'తో మొదలెట్టి, మా యింట్లో 'ఎకనమిక్ డిప్రెషన్' కలుగ చేస్తున్న పజిల్స్‌దాకా వచ్చాడు.

"ఆర్థికదుస్థితి యిలా వున్న రోజులలో, ఏమండీ శాంతాదేవిగారూ, మీరు పజిల్స్ కని ప్రతినెలా సుమారు పాతికరూపాయిలు..."

వెంకట్రావుకి వాక్యం ఎలా పూర్తి చెయ్యాలో తెలియలేదు. శాంతాదేవి ప్రబంధకన్యలా కనుకొలకుల్లో నుంచి నావంక చూస్తూ నవ్వింది.

"అవును, శాంతా! పజిల్స్‌కి మనం అంత తగలెయ్యకూడదు," అన్నాను, మిత్రుడి భుజంమీద ఆనుకుంటూ

కాంత వెంకట్రావుని వుద్దేశించి అంది! "ఏమండీ, మీ మిత్రులు అంత తగలెయ్యకూడదంటారు; కొంత తగలెయ్యవచ్చుననా వారి ఉద్దేశం ?"

"తగలెయ్యడం ఎంతమాత్రం మంచిదికాదు ... ...కాని... పజిల్స్ కని ప్రతినెలా ఏ ఆరో, ఎనిమిదో..."

"చేకూర్చాలి (Calculative)", అంటూ కాంత చిలిపితనంగా చిరునవ్వు నవ్వింది.

సహాయాన్ని అర్థిస్తున్నట్లుగా వెంకట్రావు నా కళ్లల్లోకి చూశాడు.

ఇద్దరమూ కలిసి అతికష్టంమీద ఆమె ప్రతినెలా పదిరూపాయలు మాత్రమే పజిల్స్‌కిగాను ఖర్చు పెట్టేటట్లు అంగీకరింపచేశాం.

ఇప్పటికి నూట నలభైరెండు రూపాయిలు ఖర్చయాయి. నేను పజిల్ ప్రపంచంనుంచి పింఛినీ పుచ్చుకున్నాను. కాంతకూడా ఒక ప్రాయిని ఫవుంటెన్ పెన్ సంపాదించింది.

ఏనాడో ఒకనాడు, అనుకోకుండానే, ఆకస్మికంగా కొన్నివేల రూపాయిలు వస్తాయని కాంత మనః పూర్తిగా నమ్ముతుంది.

"ఏం, వస్తే రా వచ్చునూ" అంటాడు వెంకట్రావు నన్ను వోదారుస్తూ.

కాని, నేనుమాత్రం కాంతాదేవిచేతిలో అదృష్టరేఖ వున్నా, ధనలాభం కలుగుతుం దని నమ్మలేను; కలగదని నిరాశ పొందలేను...పజిల్...అలాగే అన్ని పజిల్స్..."

---

# సందర్శనము

శ్రీ కాంభట్ల విశ్వనాథశాస్త్రి

ఆయెది మత్పురాతనభవార్జితపుణ్యశలాక, నూత్నశో
భాయితదివ్యమూర్తి, ప్రియభావనిదర్శితసుప్రసన్నతా
చ్ఛాయిక, ముగ్ధభావ్యతదృగంచలచంచలసంచరక్రియా
పాయనకృన్మహౌషధి, భవావిలచిత్తున కెట్టు లబ్బెడున్.

కారుమొయిళ్ల దట్టపుబొగల్ పచరించెడు నీనిశీథవి
స్ఫారతమశ్ఛటాకృతదిశాంతమునన్, నిబిడీకృతోత్సుకో
దారత నీయెడారిసుకదారిపయిన్ బయనించినన్ సరే;
భారము కాదు నా, కమృతభావభవన్ముఖదీప్తి నించినన్.

అరవిరితావికైపు, పవనాంకురపుంజవికార మొంది, చం
దురునునుతీయకాంతుల నెదుర్కొని, పూలమరందజాలమా
ధురి, గొనిపోవుపోకడల దోచుముదంబది యేల? హైమపుం
బరిమళమున్ సుధాభరితభవ్యభవద్ద్యుతి గోచరించినన్.

నను తెలిమబ్బుటూయెలల నూగెడు నీదుకచాంతనిస్సృతాం
జనఘనరుక్తమఃక్రమణసాధ్వసతన్ గని కర్కశించి, యం
తనె, నిను పీడుమోడు చెడదన్ మెరయించిన మందహాసపుం
దునుగు జిలుంగుటంచలము నూది వసింపగనిమ్ము నెమ్మితో.

ఘనజీమూతముల న్విదిల్చి, విశదాకారంపుటభ్రాన, ని
త్యనవామోదపుగ్రొమ్మెరుం గగుచు బర్యాప్తంబుగావింప, భూ
మిని, నింగిన్ భవదీయభావవిభవోన్మేషంబుగా దోచె, గా
నను, నే ధన్యుడ, నబ్బె నీక్షణము పౌనఃపున్య మేపారగాన్.

# మలయా : బ్రిటిష్ సామ్రాజ్యం

శ్రీ శనివారపు సుబ్బారావు

మలయా అను దేశము హిందూదేశమునకున్నూ, చీనా దేశమునకున్నూ మధ్యనున్నది. మలయా దేశము స్వభావోగా మహమ్మదీయులదే. హిందూమహాసముద్ర తీరాన నున్న భాగములలో పెనాంగో, డిన్నింగ్, మలాకా, సింగపూరు అను ప్రదేశములు బ్రిటిషువారి యాధీనములో నుండును. వీటికే 'స్ట్రైట్సు సెటిల్మెంట్సు' అని పేరు. పెరాకు, సెలాంగూరు, నెగ్రిసెంబిలాన్, పాహాన్గూ అను ప్రదేశములు ఫెడరేటెడ్ మలె స్టేట్సు అను పేరిటను క్వెలన్టాన్, టెన్గాన్, జోహారు అను ప్రదేశములు ఫెడరేషన్లో చేరకుండా నుండేటట్టుగను నుండెను.

*    *    *

## ఈస్టు స్ట్రైట్సు సెటిల్మెంట్సు

ఈస్టిండియా కంపెనీవారు ౧౭౮౬ లో హిందూ దేశమునుండి చీనా, జపానులకు సుళువుగా వెళ్లుటకుగాను మలయా దేశమును తమ స్వాధీనములోనికి తీసికొని హిందూమహాసముద్రమునుండి చీనా, జపానులకు వెళ్లేదారిలోనున్న సింగపూరునకు 'బేసు' అనుదానిని నిర్మించుటకు నిశ్చయించుకొన్నారు.

బ్రిటిషువారు పెనాన్గూనందు ౧౭౮౬ లో ప్రవేశించిరి. ౧౭౮౬ లో ఈస్టిండియాకంపెనీ తరఫున ఫ్రాన్సిసులైటను ఇంగ్లీషు ఆయన యుద్యోగిగ నుండెను.

ఈ పెనాన్గూ ప్రదేశమును ఆ జిల్లాకు సంబంధించిన సుల్తానునుండి తీసికొనెను. సయాము రాజువల్ల, మలయా సుల్తాన్లు బాధపడేవారు. అట్టిబాధలు లేకుండ చేయుటకు బ్రిటిషువారు మలయా సుల్తానులకు తోడ్పడ్తామని చెప్పిరి. ఈ సహాయమును చేస్తామన్నందుల కున్నూ ఏటేటా కొంతసొమ్మును సుల్తానులకు కప్పం క్రింద ఇస్తామన్నందులకు బ్రిటిష్‌వారికి మలయాసుల్తానులు 'స్ట్రైటు సెటిల్మెంట్సు' అనే భూభాగములను ఇచ్చేశారు. ౧౮౧౯ లో జోహారీసుల్తాను నుండి బ్రిటిషువారి తరఫున జావాలో లెఫ్టినెంటుగవర్నరు జనరలుగానున్న 'స్టాంఫోర్డురాఫ్లెస్' సింగపూరును సంపాదించెను. అప్పట్లో ఈ సింగపూరు మనుష్యులు నివసించే ప్రదేశముగ లేదు. ఇపుడిది తూర్పు పాశ్చాత్యదేశముల రెంటికిని గొప్ప వర్తకస్థానముగా ఉన్నది. పోర్చుగీసువారున్నూ, డచ్చివారున్నూ ఇంగ్లీషువారికన్న ముందుగా మలయా దేశమునందు ప్రవేశించి వర్తకము చేసుకొంటూ ఉండిరి. పోర్చుగీసువారు మలాకా అను స్ట్రైటు సెటిల్మెంటు ప్రదేశమునం దుండేవారు. ఈప్రదేశమును పోర్చుగీసువారివద్దనుండి డచ్చివారు తీసుకొన్నారు. డచ్చివారివద్దనుండి ౧౮౨౪ లో బ్రిటిషువారు వియన్నాలో జరిగిన ఒడంబడికవల్ల (వియన్నా ఆస్ట్రియా దేశములో నున్నది) తీసుకొన్నారు.

## ఫెడరేటెడ్ మలేస్టేట్సు

ఫెడరేటెడ్ మలెస్టేట్సు అను పేరిటనున్న పెరాకూ, సెలాంగూరు, పహానంగ్, నెగ్రిసెంబిలాన్ అను ప్రదేశములు విడివిడిగా సుల్తానులకు ప్రజలకు సఖ్యతలేక తరుచుగా కలహములు కల్గుచుండెనను కారణాలతోటిన్నీ, ఆర్థికరీత్యాఅభివృద్ధిలోనికి రావడము లేదను కారణముతోటిన్నీ వీటిని బ్రిటిష్‌వారు తమ రక్షణలో నుంచుకుంటూ సుల్తానులకు నామకార్థపుస్వాతంత్ర్యమును ఇచ్చుపద్ధతితో ౧౮౭౪ లో 'సర్ ఫ్రాంక్ సీటన్‌హామ్' అను ఆయన బ్రిటిషువారి స్వాధీనమునకు తెచ్చెను. ఈ సీటన్‌హామ్ అను ఆయన 'సెలాన్‌గల్' అను స్ట్రైటు సెటిల్మెంటు

నందు ౧౮౭౪ లో అసిస్టెంటు రెసిడెంటు ఉద్యోగిగా ప్రవేశించి ౧౮౮౨లో రెసిడెంటు అయ్యెను. ౧౮౮౯లో పెరాల్ అను ప్రదేశములో రెసిడెంటుగా నుండెను. ౧౮౯౬ లో ఫెడరేటెడ్ మలేస్టేట్సునంతటికి మొదటి రెసిడెంటుపదవిని బడసెను. ౧౯౦౧మొ. ౧౯౦౪ వరకు స్ట్రైటు సెటిల్మెంటులకు ఫెడరేటెడ్ మలేస్టేట్సులకు (ఎఫ్. ఎమ్. ఎస్.) కలిపి యుద్యోగము చేసెను. ఈ వుద్యోగంలో స్ట్రైటు సెటిల్మెంటు ప్రదేశాలకు గవర్నరు హోదాతోనూ, ఫెడరేటెడ్ మలేస్టేట్సులకు హైకమీషనరు హోదాతోనూ ఉండెను. ౧౯౧౪,౧౮ మహాసంగ్రామంలో (జర్మనీ, ఇంగ్లీషు యుద్ధంలో) లండన్ నందు ప్రెస్ బీరో ఆఫీసర్లలో జాయంటు డైరెక్టరుగా పనిచేసెను. ౧౯౨౬ ప్రాంతములకు ఈయన మలేదేశములోని తొమ్మిది రబ్బరుకంపెనీలలో డైరెక్టరుగా నుండెను. మలేదేశములోని బ్రిటిష్ పెట్టుబళ్లకునూ, ఈయనజీవితమునకునూ ఈ రీత్యాసమిష్టిసంబంధం సంభవించెను. ఈ సమిష్టిసంబంధంవల్ల బ్రిటిష్ వారు ఆర్థికంగాను, రాజకీయంగాను బాగుపడడం, మలయ దేశస్థులు ఆర్థికరాజకీయములలో అస్వతంత్రులు కావడం సంభవించెను.

ఇంగ్లీషు రెసిడెంట్లను ఈ ఫెడరేటెడ్ మలేస్టేట్సులోని సుల్తానులు ప్రజలు సులువుగా తమ ప్రదేశములలో నుండుటకు అంగీకరించలేదు. వారిని అంగీకరింపజేయుటకు బ్రిటిషువారు వీరిని అనేకరీతులుగా నిర్బంధించిరి. ఆనిర్బంధములకులోనై బ్రిటిషు రెసిడెంట్లను వారిప్రదేశములలో నుండుట కంగీకరించిరి. ౧౮౭౪ లో 'పెరుకు' అనుస్టేటులో బ్రిటిషు రెసిడెంటుప్రవేశించి మలేదేశస్థులమతంతోటి, ఆచారాలతోటి జోక్యం కలిగించుకోకుండా ఉంటామని నాతో ఒడంబడికను చేసికొమని ఆసుల్తానుతో చెప్పగా ఆసుల్తాను బలవంతముగాఒప్పుకోవలసివచ్చెను. రెసిడెంటుకే ప్రదేశములోని ప్రజలు పన్నులను చెల్లించాలనే ఉత్తర్వులు జారీఅయ్యెను. ఈ వుత్తర్వులవల్ల బ్రిటిషువారు మలేదేశస్థులను జయించినట్లుగా భావించి స్వాతంత్ర్యప్రియులు ఆ రెసిడెంటును హత్యచేసిరి. ఈ హత్యవల్ల జరిగిన అల్లకల్లోలమును ఆపుచేసి మలేప్రజలలో భీతాంగమును కలిగించుటకుగాను చైనాలో, హాంగ్ కాంగ్ నందున్న బ్రిటిషు సైనికులను ఇండియాలోనున్న బ్రిటిషు సైనికులు, ఘూర్కా సైనికులను బ్రిటిషువారు పెరాకునకు రప్పించుకొనిరి. ఈ హత్యకు నొకవిచారణసంఘాన్ని నియమించిరి. ఆవిచారణసంఘుపర్యవసానంగా నలుగురు మలేప్రజలను వురితీసిరి. చాలమందిని యావజ్జీవదండనము విధించి జైలులో నుంచిరి. మరినలుగుర్ని 'సైసిలెస్' అనుప్రదేశమునకు ప్రవాసశిక్షగా పంపించిరి. బ్రిటిషురెసిడెంటును చంపినగ్రామమును భీభత్సముచేసి ఆగ్రామప్రజలు తిరిగీ నివాసములేకుండా వుండునట్లు చేసిరి. మలేస్టేట్సులోని మిగతాప్రదేశాలను బలవంతంగా స్వాధీనం చేసికొనిరి. ౧౮౮౮ వరకు 'పహాన్గూ' బ్రిటిషువారికి లొంగలేదు. మిగతావి సులువుగా త్వరలోనే లొంగిపోయెను. ఈ స్టేట్సు అన్నిటిలోను రబ్బరు ఉత్పత్తియగును. ప్రపంచకంలో ఉత్పత్తి అయ్యేరబ్బరు అంతటిలో అనగా అయిదింట మూడు పాళ్లు రబ్బరు ఈ స్టేట్సులో ఉత్పత్తియగును. అందువల్ల వీటిని బ్రిటిషువారు ఏల స్వాధీనం చేసుకోకుండా నుండగలరు?

* * *

## ఫెడరేషన్‌లో చేరని స్టేట్సు

అయిదు గలవు. ఒకటి జోహారె. ౧౯౧౪ లో బ్రిటిషువారి చెప్పుచేతలలోనికి ఈ స్టేటు వచ్చెను. వీరిచెప్పుచేతల్లోనికి వచ్చాక జోహారెద్వారా, పెనాంగ్ సింగపూరునకు రైలుదారి వేసిరి. ౧౯౧౦ నుండి జోహారెయందున్న తగరపుగనులవ్యాపారము బ్రిటిషుకంపెనీలవారిద్వారా అమితంగా అభివృద్ధిలోకి రావడం, బ్రిటిషుకంపెనీలవారు ఈ వ్యాపారలాభాలు గడించడం అప్పటినుంచి నేటివరకు జరుగుతూనేఉంది. రెండవది కెలాన్‌టాన్. ఇందున్న సుల్తానునకున్నూ బ్రిటిషువారికిన్ని జరిగిన ఒడంబడికనుబట్టి, డఫ్ డెవలప్‌మెంటు అను బ్రిటిషుకంపెనీ ఈ ఎస్టేటులో ౨౫౦౦ మైళ్ల చతురపు భూమిని సంపాదించెను. ౧౯౦౯ లో బ్రిటిషుపరిపాలన ఈ ఎస్టేటులో సాగుటకు ఏర్పాట్లు బాగా జరిగెను. ఈ

ఏర్పాట్లవల్ల ఈడఫ్ కంపెనీ సంపాదించిన భూమిలో ౫౦ వేల ఎకరాలభూమిని మూడులక్షలపౌనులకు ఇచ్చుటకున్నూ, ఈ మూడులక్షల సొమ్మునకు కంపెనీ యిచ్చిన ౫౦ వేల యకరాలలోనుంచి యీ ఎస్టేటు యొక్క సుల్తాను రైలుమార్గమును వేశాక మరో ౫౦ వేల యకరాలభూమిని యీడఫ్ కంపెనీ కోరచోట సుల్తాను ఇచ్చుటకున్నూ నిర్ణయము జరిగెను. సుల్తాను రైలువేయలేక కంట్రాక్టును అమలులోనికి తీసుకురాలేదనే నేరమును యీ డఫ్ కంపెనీ ౧౯౨౦ లో సుల్తానుపై మోపి 'కెలాన్ టాన్' ప్రభుత్వమునుండి యీ డఫ్ కంపెనీ నష్టపరిహారముక్రింద పుచ్చుకొనుటకు బ్రిటిషుకోర్టులో దావాచేయగా బ్రిటిషుకలోని యల్ స్ప్రెకెరీ ఒకమధ్యవర్తిని ౬ వత్సరాలవరకు వాయిదాలమీద వాయిదాలు వేశాక నియమించెను. ఈమధ్యవర్తి పరిష్కారమువల్ల డఫ్ కంపెనీకి ౩౭,౮౦౦ పౌనుల సొమ్మును ఈదావాకు అయిన ఖర్చులను కెలాన్ టాన్ ప్రభుత్వమునుండి తీసికొనగలిగెను. మొత్తం మీద ౬,౭౮,౦౦౦ పౌనులు సుల్తానునుండి రాబట్టుకొనెను. ఇదిగాక మిగతా భూప్రదేశమునుండి రబ్బరు మున్నగువాటిని ఉత్పత్తిచేసి వాటివల్ల మరికొంత లాభమును పొందుచుండెను. ఈ సొమ్మును సుల్తానిచ్చుకోలేనని చెప్పగా కొంచెము ప్రజలవల్ల మంచివాడు కాడని అనిపించుకొని పన్నులు హెచ్చించి ఈ సొమ్మును సులభముగా ఇయ్యవచ్చునని సలహాను బ్రిటిషుఅధికారులు ఇచ్చిరి. మూడవది పెన్ గాన్. ఇదికూడా గనులపరిశ్రమకు మంచిప్రదేశము. దీన్నికూడా బ్రిటిషువారు తమ స్వాధీనములోనికి తెచ్చుకొని గనులపరిశ్రమను వృద్ధిచేసి రైలుమార్గమును నిర్మించిరి. మిగతా కెడహా, పెర్లిస్ అనునవికూడ క్రమేణా బ్రిటిషువారి అధీనమయ్యెను. ఈ ఐదుస్టేట్సులోనూ వుండే బ్రిటిషుఉద్యోగులకు రెసిడెంట్సు అనేపేరుగాక, 'ఎడ్వైజర్' అను పేరుతో నుండి ఫెడరల్ కౌన్సిల్ వీరిచెప్పుచేతలలో నుండునట్లు చేసికొని వీటిపరిపాలన అంతా నిజానికి బ్రిటిషువారున్నూ, నామకార్థం స్వతంత్ర్యంతో సుల్తానులున్నూ పరిపాలించుచున్నారనేదే గ్రహించవలెను.

* * *

౧-వ పట్టిక

| దేశాలవారు | స్ట్రెయిటు సెటిల్మెంటు వైశాల్యం ౧౬౦౦ చ. మై. జనాభా | ఫెడరేటెడ్ మలే స్టేట్సు ౨౭౫౦౦ చ. మై. జనాభా | ఫెడరేషన్ లోలేని మలేస్టేట్సు ౨౨౫౦౦ చ. మై. జనాభా | జరసి ౫౧౬౦౦ చ. మై. జనాభా |
|---|---|---|---|---|
| చైనావారు ... | ౪,౬౭,౦౦౦ | ౪,౯౫,౦౦౦ | ౧,౭౩,౦౦౦ | ౧౧,౩౫,౦౧౦ |
| మలేదేశస్థులు ... | ౩,౦౦,౦౦౦ | ౫,.౧౧,౦౦౦ | ౮,౭౮,౫౦౦ | ౧౬,౮౯,౫౦౦ |
| భారతీయులు ... | ౧,౦౦,౦౦౦ | ౩,౦౫,౦౦౦ | ౫౮,౦౦౦ | ౪,౬౩,౦౦౦ |
| యూరేషియనులు, ఇతరులు ... | ౯,౦౦౦ | ౩,౩౦౦ | ౧౩,౩౦౦ | ౨౫,౬౦౦ |
| యూరోపియనులు ... | ౮,౦౦౦ | ౫,౭౦౦ | ౨౦౦ | ౧౩,౯౦౦ |
| జరసి ... | ౮,౮౪,౦౦౦ | ౧౩,౨౦,౦౦౦ | ౧౧,౨౩,౦౦౦ | ౩౩,౨౭,౦౦౦ |

౧౯౩౧-వ సంవత్సరపు జనాభా లెక్కలనుబట్టి మలేస్టేట్సులో ౧-వ పట్టికలో గనుపరచిన విధమున ఆసియా దేశస్థు లున్నారు. చైనా దేశస్థులే మలే దేశస్థులతో కొంచెం ఇంచుమించు సమానంగా గలరు. పిమ్మట భారతీయులు లెక్కలోనికి వస్తారు. బ్రిటిషువారు స్ట్రైటు సెటిల్మెంటులోనికిన్నీ చైనావారినీ, భారతీయులనూ కూలీలుగ పని చేయుటకు దిగుమతిచేసుకోవడం మొదలిడిరి. చైనా దేశీయులలో కొందరు ధనికులు పెట్టుబళ్లను పెట్టి యిందు వ్యాపారం సాగించడం ఉంది. భారతీయులలో హెచ్చుగా దక్షిణఇండియానుండి అరవవారే హెచ్చుగా వచ్చియుండిరి. చైనాకూలీలు, భారతీయ కూలీలు రబ్బరుతోటలలో హెచ్చుగా బ్రిటిషుయజమానులక్రిందను కొంతమంది చైనాయజమానులక్రిందను పనిచేయడం గలదు. యూరోపియనులలో కూలీలుగ పనిచేసేవారు లేరు. దక్షిణభారతదేశంనుండి వెళ్లిన అరవవారిలో కొంతమంది గుమాస్తాలుగ ఇంగ్లీషు కంపెనీలలోను ప్రభుత్వపుశాఖలలోను చేరిరి.

* * *

## మలే పరిపాలనవిధానం

స్ట్రైటు సెటిల్మెంటు మొదటలో భారతదేశ పరిపాలనకు లోబడి వుండెను. పిమ్మట బ్రిటిషువారి వలసరాజ్యముగ చేసుకొన్నారు. ఇండియన్ పినల్ కోడ్డులోని శాసనములే యిందు యిప్పటికిని అమలులో నున్నవి. వీటికి శాసనసభ కలదు. అందున్న సభ్యులలో ౧౨ గురు ఉద్యోగీయులు ౧౩ గురు అధికారేతరసభ్యులు గలరు. ఈ అధికారేతరసభ్యులలో ౧౧ గురిని గవర్నరే నామినేషన్ వల్ల నియమించును. చేంబరు ఆఫ్ కామర్సు (వాణిజ్యసంఘం) వల్ల యిరువురుమాత్రం ఎన్నికోబడుదురు. పరిపాలనా విధాన మంతా గవర్నరు అధికారంక్రింద నుండును. గవర్నరునకు నొక కార్యనిర్వాహకసంఘం వుండును. అందున్నవారిలో యిరువురు తప్ప మిగతవా రంతా ప్రభుత్వోద్యోగీయులే. వలసరాజ్యపరిపాలనలో అనాదిగ నుండే మలే దేశస్థులకు ఎట్టి ప్రాతినిధ్యమున్నూ లేదు. చైనా శ్రీమంతులకుమాత్రం చేంబరు ఆఫ్ కామర్సుద్వారా పరోక్షంగా పైన తెలిపినరీతిని ప్రాతినిధ్యం వుంది.

స్ట్రైటు సెటిల్మెంటుయొక్క గవర్నరే ఫెడరేటెడ్ మలే ప్రదేశాలకు హైకమీషనరుగ నుండును. ఈ ఫెడరేటెడ్ మలేస్టేట్సు అన్నీ బ్రిటిషువారి రక్షణలో నున్నవి. ఇందున్న నాల్గు స్టేట్సులోను బ్రిటిషురెసిడెంటు వుండును. ప్రతిస్టేటునకు స్టేట్సు కౌన్సిలే అధికారమును వహించును. ఈ స్టేట్సు కౌన్సిలునందు బ్రిటిషు రెసిడెంట్లు, యీ రెసిడెంట్ల క్రిందనున్న సెక్రెటరీలు, సుల్తానులు, మలే దేశములో పనిచేసే పెద్దఅధికార్లు, చైనావర్తకులు సభ్యులుగా ఉందురు. ౧౮౯౬ లో బ్రిటనునకు ఈ స్టేట్సుకు జరిగిన ఒడంబడికప్రకారము స్ట్రైటు సెటిల్మెంటులో నున్న సైనికశాఖ ఖర్చును ఈ స్టేట్సువారే భరించుచూ యుద్ధాలు వస్తే ఆ యుద్ధాలలో ఈ సైన్యము బ్రిటను వారితరఫున పనిచేయుటకు నిర్ణయముకూడ నుండెను.

పైన వివరించిన నాల్గు స్టేట్సునకు కలిపి ఫెడరల్ కౌన్సిలు ఉన్నది. ఈ ఫెడరల్ కౌన్సిలు నాల్గు స్టేట్సుకూ సంబంధించిఉండే శాసనములను చేయుచుండును. ఇందు ప్రవేశపెట్టబడు ఏశాసనమైన మొదట హైకమీషనరు ప్రవేశపెట్టుటకు అనుమతి నీయవలెను.

మతవ్యవహారములలో సుల్తానులతో జోక్యము కలుగజేసికోరు. మిగత వ్యవహారములలో సుల్తానులకు పెత్తనం లేదు. బ్రిటిషువారికే పెత్తనం ఉన్నది. స్ట్రెయిటు సెటిల్మెంటునందున్నూ, ఈ ఫెడరేటెడ్ మలే స్టేట్సునందున్నూ ఉన్న భూప్రదేశమంతా గవర్నమెంటుదే. గవర్నమెంటే ఆ భూములను కవులకుగాని దీర్ఘ వాయిదాతో కవులకుగాని క్విట్ రెంటును కట్టే పద్ధతినిగాని ఇచ్చు హక్కులన్నియూ ప్రభుత్వమునకుండునట్లుండెను. ఈ హక్కులవల్లనే బ్రిటిషువర్తకులకు చాలాభూమి సంక్రమించెను.

* * *

మలే దేశములలోని సరకుల ఎగుమతికిన్నీ ఇతర చోటులనుండి వచ్చేదిగుమతికిన్నీ ఏర్పడ్డ ఓడలవ్యాపా

రమునకు బ్రిటిషుఇండియాస్టీమ్ నావిగేషన్‌కంపెనీ, (పి. యండు. ఓకంపెనీతాలూకు) చక్కాట్సుస్టీమ్ కంపెనీ, బిబ్బీస్టీమ్‌కంపెనీ, ఓషన్‌స్టీమ్‌కంపెనీ, (బ్లూఫన్నెల్ లైను), గ్లెన్‌లైను (రాయలుమైలువారి ఆధీనములో నున్నది) లాపోర్టు అండు హోల్ట్ (ఇది ఎల్డర్ డెంపాస్టర్ అండ్ రాయలుమైల్‌వారి అధీనములో నుండెను) మున్నగు బ్రిటిషుకంపెనీలచేతుల లోనే యుండెను. ఈ దేశపు ఓడలవ్యాపారంలో సగభాగం బ్రిటిషువారిదే—గత సగభాగంలో ౨ వంతు డచ్చివారికి, ౨ వంతు జపానువారికి గలదు. మిగతా భాగాలు ౧౫ దేశాల వారికిందను ఉండును. గనుల పరిశ్రమవిషయంలో ౧౯౨౫ జూనులో కౌమున్‌టింగ్ అను బ్రిటిషుకంపెనీ తగరవ్యాపారంలో సగటున టన్ను ౪౬ పౌనుల ౧౭ షిల్లింగుల ధరగల దానిని ౧౪౩ పౌనుల ౧౨ షిల్లింగుల ౯ పెన్నీలకు అమ్మెనట. దానినిబట్టి ఒక టన్నుకు ౯౬ పౌనుల ౧౫ షిల్లింగుల ౮ పెన్నీల లాభముచొప్పున వచ్చెనట. ౧౯౨౪ లో 'క్రౌహాట్‌ఫులా లిమిటెడ్' అను కంపెనీ టన్ను ౪౫ పౌనుల ౪ పెన్నీల విలువగల దానిని టన్ను ఒకటికి ౧౪౪ పౌనుల ధరకు అమ్మెనట. టన్ను ౧౦౩ పౌనుల ౪ షిల్లింగుల ౮ పెన్నీలు లాభము వచ్చెనట. ఈవిధముగ తగరపు వ్యాపారపు కంపెనీ లుండెను.

౨-వ పట్టిక

| కంపెనీల పేర్లు | | వసూలుచేసిన ధనం | సంవత్సరం | తయారు చేసిన సరకు | నికర లాభం | షేరుకు వచ్చిన లాభం, |
|---|---|---|---|---|---|---|
| | | పౌనులు | | టన్నులు | పౌనులు | నూటికి |
| గోపెన్గ్ కన్‌సాలిడేటెడ్ | ... | ౩,౯౫,౭౬౮ | సెప్టెంబరు ౧౯౨౪ | ౯౨౯ | ౧,౦౯,౦౦౩ | ౨౦ |
| కౌమున్‌టిన్ గిటిన్ డ్రెడ్జింగు | ... | ౩,౦౦,౦౦౦ | జూన్ ౧౯౨౫ | ౧,౩౫౪ | ౧,౦౬,౭౯౦ | ౭౦ |
| క్రౌహాట్ ఫులా | ... | ౧,౦౦,౦౦౦ | డిశంబరు ౧౯౨౪ | ౩౯౨ | ౪౮,౦౬౯ | ౩౦ |
| మలయన్ టిన్ డ్రెడ్జింగ్ | ... | ౧,౮౫,౦౦౦ | జూన్ ౧౯౨౫ | ౧,౦౪౭ | ౫౧,౩౭౧ | ౨౫ |
| పాహాన్గ్ కన్‌సాలిడేటెడ్ | ... | ౪,౭౫,౦౦౦ | జూలై ౧౯౨౫ | ౨,౬౦౮ | ౧,౨౬,౮౪౯ | ౨౦ |
| రామ్ బటన్ లిమిటెడ్ | ... | ౧,౦౦,౦౦౦ | జూన్ ౧౯౨౪ | ౨౨౧ | ౧౯,౮౯౮ | ౧౫ |
| సన్‌గై బేసి మైన్సు | ... | ౧,౩౧,౪౦౭ | డిశంబరు ౧౯౨౪ | ౫౯౨ | ౪౬,౨౨౦ | ౨౫ |
| టెక్కా టైపింగ్ లిమిటెడ్ | ... | ౪,౯౯,౯౮౦ | ,, ౧౯౨౪ | ౬౬౯ | ౬౦,౬౯౫ | ౧౨½ |
| టెక్కా లిమిటెడ్ | ... | ౩,౫౮,౫౭౭ | మార్చి ౧౯౨౫ | ౩౭౯ | ౩౯,౭౫౦ | ౭½ |
| ట్రోనోహా మైన్సు లిమిటెడ్ | ... | ౨,౦౦,౦౦౦ | డిశంబరు ౧౯౨౫ | ౬౩౭ | ౮౨,౫౦౬ | ౨౫ |
| పౌనులు | ... | ౨౬,౫౫,౭౩౨ | | ౮,౮౬౮ | ౬,౯౧,౦౭౦ | |

ఈ వివరములు, లేబరు రీసెర్చివారు ప్రచురించిన బ్రిటిషు ఇంపీరియలిజమ్ ఇన్ మలేస్టేట్సు అను ఆంగ్లగ్రంథములో నుండెను. ఈ బ్రిటిషు కంపెనీల క్రింద పనిచేసే కూలీలరీతి బానిసవ్యాపారము మాదిరిగా నుండేది. రోజుకూలీ, కాంట్రాక్టుకూలీ అని రెండు పద్ధతులు. గనులు త్రవ్వుటకు కూలీలను సప్లై చేయుటకు బ్రోకర్లుండేవారు. ఆబ్రోకర్లు తీసుకునే లాభంపోను కూలివానికి గిట్టేది చాల తక్కువగనే ఉండేది. ఇది గాక ఒకగుంపుకు ఒక మేనేజరుక్రింద ఒక ఠండి గనులను త్రవ్వించి అందువచ్చేలాభంలో యజమానికి కొంతభాగాన్ని, యీ మేనేజరుకు కొంతా ఈయడం ఉండేది. ఈ పద్ధతులవల్ల గనులలో పనిచేసే కూలీలకు సగటున రోజుకు ఒకషిల్లింగ్ ఉండేది. దానివల్ల కంపెనీలవారిలాభాలు ఏలావున్నాయో కూలీల స్థితి ఎట్లున్నదో తెలిసికొందురుగాక.

రబ్బరువ్యాపారం మలేదేశంలో క్రమేణా అభివృద్ధిలోనికి వచ్చెను. ౧౯-వ శతాబ్దంవరకు రబ్బరు దక్షిణఅమెరికాదేశంలోని 'బ్రెజిల్' అను దేశమునుండి ప్రపంచమునకు కావలసిన రబ్బరులో చాలాభాగము సప్లై అయ్యేది.

౧౯ వందల సంవత్సరమునుండి, రబ్బరు ఉత్పత్తికి మలేదేశములో బ్రిటిషువారే దోహదం చేసిరి.

'కూ్య' అను ప్రదేశములో మొదట రబ్బరు విత్తనములను మధ్యఅమెరికా అడవులనుండి తెచ్చి పాతిరి. బ్రిటిషువారితాలూకు రబ్బరు ఉత్పత్తి కంపెనీలు ౧౯౧౦ నాటికి ౨౦౦ ఉండెను. ౧౯౨౫ నాటికి అవే ౩౦౦ వరకు పెరిగెను. ౧౯౨౩ నాటికి ఈ వ్యాపారముమీద బ్రిటిషువర్తకులు ఏడుకోట్ల ఏభయిలక్షల పౌనులను పెట్టిరి. ౧౯౨౬ నాటికి పది కోట్లవరకు ఈ పెట్టుబడి పెరిగెను. ఈ రబ్బరు కంపెనీలలో పగటున వాటాకు ఈదిగువ వత్సరాల్లో ఈ దిగువరీతిగ వచ్చెను.

3-వ పట్టిక

| సంవత్సరము | నూటికి షేరులు |
|---|---|
| ౧౯౨౨ | ౮ |
| ౧౯౨౧ | ౨ |
| ౧౯౨౩ | ౩౪ |
| ౧౯౨౪ | ౬ |
| ౧౯౨౫ | ౭ |
| ౧౯౨౬ | ౨౦ |

పౌను తొమ్మిది లేక ౧౦ పెన్నీలకు గిట్టును. అనగా ౯ అణాలు లేక ౧౦ అణాలకు పౌను ఎగుమతి ధర రెండుషిల్లింగులకు షుమారు ఉండును. అనగా పౌను రు. ౧-౮-౦. దీనినిబట్టి లాభము ఈ వ్యాపారంలో ఏల ఈ బ్రిటిషుకంపెనీవార్లకు గిట్టేది. రబ్బరుతోటలలో పనిచేసేకూలీలకు ఒకషిల్లింగులోపు కూలి అనగా ౧౨ అణాలు లోపు. భారతదేశమునుండి కూలీలను రబ్బరుతోటలలో పనిచేయుటకు కంట్రాక్టులో దొరికేకారణం వల్ల దిగుమతి చేసుకొనే వారు. భారతదేశంనుండి కూలీలసప్లైకి భారతదేశంలో "ఎమిగ్రేషన్" డిపార్టుమెంటు అనునది ఒకటిఉండెను. ఈ శాఖద్వారా కూలీలను కంట్రాక్టురేటుతో మలయా దేశమునకు ఎగుమతిచేసేవారు. కంట్రాక్టులోని షరతులు నిరక్షరకుక్షులైనందున వీరికి తెలియక మలయా వెళ్లాక అక్కడ రబ్బరుతోటలయజమానులకు బానిసలు కావలసివచ్చేది. ఈ కూలీలసంఖ్యలో మరణసంఖ్య చాలా హెచ్చుగా నుండేది.

౧౯౨౧ లో వచ్చిన ప్రాపంచికవ్యాపార మాంద్యమువల్ల రబ్బరువ్యాపారములో నష్టమురాగా రబ్బరువ్యాపారముచేసేవారంతా ఒకసంఘంగా కూడి యెవరెంత ఉత్పత్తిచేయాలో, కూలీలను ఏరీతిగ తగ్గించుకురావాలో మున్నగునవి యోచించిరి. ఈ వ్యాపారముమీద పెట్టుబడి పెట్టిన బ్రిటిషు వర్తకుల రక్షణకు తగుసదుపాయములను జేయుట కొరక విచారణ సంఘమును అప్పట్లో విన్స్టన్ చర్చిల్ వలసరాజ్యముల సెక్రెట్రీగా ఉన్నందున, ఆయనయే సర్ జేమ్సుస్టాలిన్‌సన్ (తర్వాత ఈయన లార్డయ్యెను) అను ఆయన అధ్యక్షతతో నియమించెను. ఈయన ౧౯౧౪-౧౮ యుద్ధమునకుపూర్వము (జర్మనీ-ఇంగ్లీషుయుద్ధము) జాన్‌వాల్కర్ అండ్ సన్సు లిమిటెడ్ అను కంపెనీకి మేనేజింగ్ డైరెక్టరుగా నుండెను. ఈ కంపెనీవారి రిపోర్టు ౧౯౨౨ మేలో ప్రకాశితమయ్యెను. ఆ రిపోర్టును ఆధారంగా తీసికొని బ్రిటిషువర్తకులు ఆట్టేదెబ్బను తినకుండా బయట పడిరి. ౧౯౨౫-౨౬ సంవత్సరములలో బాగా లాభములను సంపాదించేస్థితికి రాగలిగిరి. కూలీలలోమాత్రము పనిలేనివారిసంఖ్య పెరిగిపోయింది. ౧౯౨౫ ప్రాంతములో భారతదేశంనుండి దక్షిణాదినుండి వెళ్లిన అరవ కూలీలకు రోజుకు ౧౦ అణాలుకూలీ ఉండేది. ౧౯౨౫-౨౬ సం॥రములలో లాభాలు బాగా వచ్చినా కూలీల రేటుమాత్రం హెచ్చలేదు.

మలేదేశములో రైలునిర్మాణము, ఓడరేవుల నిర్మాణము, సింగపూరు నావికాదళాశ్రమము, విద్యుచ్ఛక్తివ్యాపకము మున్నగువాటికి మలేప్రభుత్వమునకు వచ్చే ఆదాయమునుండిన్నీ, మలేప్రభుత్వం తరఫున

అప్పుపత్రాలు జారీచేసినా సొమ్ము రాబట్టి వీటిని నడిపించుటకు బ్రిటిషు అధికారులు ఏర్పాట్లను చేసిరి. మలేగవర్నమెంటుకు వచ్చే ఆదాయములో ఎగుమతి సుంకాలవల్లా దిగుమతిసుంకాలలో నల్లమందు మత్తు పదార్థములమీద వేసే హెచ్చుసుంకంవల్లా వచ్చేది. ఈ విధరీతిగా ఫెడరేటెడ్ మలేస్టేట్సుప్రభుత్వం అప్పులను తీసుకొనెను.

౮-వ పట్టిక

| అప్పు మొత్తం | సంవత్సరాలు | వడ్డీ రేటు నూటికి |
|---|---|---|
| పౌనులు | | |
| ౬౯,౧౩,౩౫౨ | ౧౯౧౦—౧౯౧౭ | ౩½ |
| ౨౩,౯౩,౬౦౦ | ౧౯౨౧ | ౬ |
| ౫౧,౫౫,౦౦౦ | ౧౯౨౧ | ౫ |
| ౪౨,౦౦,౦౦౦ | ౧౯౨౨ | ౪½ |

ఈ అప్పులకిచ్చే ప్రోకరేజి వడ్డీ మున్నగు వాటి క్రింద, ప్రభుత్వానికి వచ్చే ఆదాయంలో చాలాభాగం పోయేది. సింగపూరు నావికాదళాశ్రమమును కట్టుటకు బ్రిటిషుప్రభుత్వమునకు కార్మికపక్షము అధికారములోనికి ౧౯౨౪ రాగా అప్పట్లో వారు దీనికి సొమ్మును వినియోగించలేదు. బాల్డ్విన్ ప్రభుత్వము బ్రిటన్‌లో అమలులోనికి రాగానే యిందుకు సొమ్మును ప్రత్యేకించిరి. ౧౯౨౫ మార్చిలో లార్డ్‌కర్జన్ లండను లోని ప్రభువులసభలో మాట్లాడుతూ సింగపూరులో నావికాదళాశ్రమమును కట్టుటకు కావలిసిన స్థలమును కొనుటకే ౧౪౬౦౦౦ పౌనులు అయినవనియు ౧౯౨౮ నాటికి ఎనిమిది లక్షలపౌనులను వినియోగించుటకు పార్లమెంటు ప్రత్యేకించిన దనియు చెప్పెను. ౧౯౨౬ లండన్ పార్లమెంటులో జరిగిన చర్చలో ఈ నావికాదళాశ్రమమును కట్టుటకు ౯౪౧౪౫౦౦ పౌనులు ఖర్చు అగునవియు, ఇదిగాక ౧౦ లక్షల పౌనులు యంత్రము లకు అగునవియు రక్షణక్రింద ౧౫ లక్షలు ఖర్చు అగు నవియు తేల్చిరి.

మలేదేశములో నిర్మించేయీ పనులన్నిటివల్ల బ్రిటిషుకంపెనీలవారికిన్నీ లండనులోని ఇనుపఫ్యాక్టరీలవారికిన్నీ లాభాలు కలుగు నన్న సంగతిని పై సందర్భాలనుబట్టి గ్రహింతురుగాక! ఈ రీతిగా మలేప్రభుత్వమునకు అప్పుపెట్టి బ్రిటనువారు మలేదేశీయులను ఆర్థిక రాజకీయములలో అస్వతంత్రులనుగా జేసి వైచిరి. అమెరికావారు తమకు కావలిసిన రబ్బరునకు దక్షిణ అమెరికాయందునూ, ఆఫ్రికాలోనూ ఆయా ప్రాంతములలో కంపెనీలను స్థాపించి బ్రిటనుమీద ఆధారపడకుండా యత్నాలు చేసుకుంటున్నారు. సింగపూరునావల్ బేసు (నావికాదళాశ్రయము)వల్ల జపాను వర్తకప్రాబల్యమునకు అడ్డంతగులు నని జపాను ప్రభుత్వము గ్రహించెను.

సింగపూరులోనే బ్రిటిషుకంపెనీలవారు రబ్బరుతో వస్తువులు, టైరులు తయారుచేసే ఫ్యాక్టరీలను నెలకొల్పుతున్నారు. తోటలద్వారా పండ్లను పెంచి వాటిని చెడిపోకుండా డబ్బాలలో వేసి నిలువవుంచుటకును, పైనాపిల్సు (అనాసపండ్లు) వ్యాపారమును విరివిగా సాగించుటకును సింగపూరులో కంపెనీ లుద్భవిల్లెను. ఫ్యాక్టరీవ్యాపారము వృద్ధియైన కొలదియు కూలీలలో సంఘీభావము పెరిగి కట్టుబాట్లు ఏర్పడుతున్నాయి. డన్‌లప్ రబ్బరు కంపెనీతో మలేదేశము లోని రబ్బరుకంపెనీలు చాలాభాగము ఏకమై సంబంధము కలిగించుకొనెను. రబ్బరుకంపెనీలలో పనిచేసే కూలీలలో ౧౯౩౫ ప్రాంతములో ౬౦౦౦ మంది కార్మికులు సమ్మెకట్టును కట్టిరి. ఆసమ్మెవల్ల కొంత వరకు వారికి లాభము చేకూరెను. మలేదేశములోని కూలీలలో సంఘీభావము హెచ్చుకావడము వల్లనూ, కంపెనీయజమానులు ఏక మవడంవల్లనూ ఈ ఉభయులకు శాంతిఅనేది లేదు. మరొకప్రక్కను మలేసుల్తానును నామకార్థంగా చేయడంవల్ల మలేప్రజలలో స్వాతంత్ర్యకాంక్ష రానురాను హెచ్చయినది. అందుకు వారు పాటుపడుతున్నారు. చీనా ఇండియాస్వాతంత్ర్య సమస్యలనుబట్టి మలేస్వాతంత్ర్యసమస్య తేలగల దని దూరదృష్టిగల రాజకీయవేత్త లనుకొనుచున్నారు.

# శ్రీదేవి నీడ

శ్రీ జనమంచి కామేశ్వరరావు

వీధి తలుపు
బార్లా తీసి,
గడిగడియ "కమ్"
అని తెరచి,
తలుపులను
ఓర్లాబెట్టి,
తనువంతా
కనులై విరియ,
మనసంతా
మరులే నిండ,
శ్రీదేవికి
కరములనెత్తి,
. ఎకందనే
హారతెత్తి,
నిలిచుంటిన్
నిరీక్షణలో—

●

రొదలన్నీ
నీరవించాయ్;
యిరులెన్నో
తెరలు విప్పాయ్;
శశికరముల
గిలిగింతలతో,
పృథంతా
వెన్నెల విరిసె.

●

శ్రీదేవికి
కరములనెత్తి,
ఎకందనే
హారతెత్తి,
నిలిచుంటిన్
నిరీక్షణలో—

●

భోంయ్యను
రొదలకు
గుండెలు
ధనంధనా!
ఘల్లను
మ్రోతకు
ఎదలో
లల్లబీ!

●

పిట్టపారినా,
కుక్కతూలినా,
నీడదేవిదని
నిల్చును చూపు.
కాచినవెన్నెల
చాలును గాకిక,
శ్రీదేవి నీడవిక
రా! రా! రానీ!

●

ధమ్మను
వీధిలో
తలుపు;
"కమ్" అని
కేరును
గడియ.

●

# ఛీఛాంగ్ అంటే ఏమిటి?

చైనీ భాష తెలియని వాళ్లకు ఛాంగ్ ఛీ అంటే అయోమయం. కాని చైనా వారికి ఆపదం మహానర్థ సూచకం. ఈ వ్యాధి, లేక వ్యాధులవల్ల యేటా లక్షలాది జనులు నశించి పోతున్నారు. అసలు దీనికి కారణ మేమిటో చైనీయునికి తెలియదు. ఒకళ్లు అదేదో దేవల కల్ల వచ్చినా యని తలుస్తారు, ఒకళ్లు కప్పల వల్లని, ఒకళ్లు సీతా కోక చిలకలవల్లను కల్గుతా యనీ, ఇలా పలువురు పలువిధాల అనుకోడమే గాని అసలు విషయం ఎవ్వరికీ తెలియదు.

తరుస తరుసకే యీ మహావ్యాధి లెక్క లేకుండా ప్రజలను బలిగొంటుంటే అనేక మందులు ప్రయోగించి తంటాలు పడ్డారు చైనీయులు. ఎలాగయితేనేం కొందరు చైనా శాస్త్రజ్ఞులు యూనాన్, క్వాంగ్ సీ రాష్ట్రాలలో పరిశోధన సల్పి ఆ ఛాంగ్ ఛీ అనేది తీవ్రతరమైన మలేరియా అని కనుకొన్నారు. వెంటనే క్వైనైను వైద్యం ప్రారంభించి అపరిమితమైన మేలు పొందిరి.

జాతిసమితి మలేరియా కమిషన్ వారు తెలిపిన క్వైనైను మోతాదు అందరకు తెలిసినదే. జ్వరపు ఋతువులందు రోజూ 6 గ్రైనులు జ్వరమున్నపుడు 5 లేక 7 రోజులవరకు రోజూ 15 మొదలు 20 గ్రైనులవరకు క్వైనైను పుచ్చుకొనమన్నారు. వారి నివేదిక 124 పుటలో తెల్పినట్లు మలేరియాకు గొప్పగా పని చేయుటే గాక క్వైనైను నిరుపద్రవకర మైనది.

ఛాంగ్ ఛీ సమాచారం, దాని పుట్టుపూర్వోత్తరం తెలిసింది కనుక క్వైనైను చాలా అవసరమైన ఔషధమని చైనీయులు గ్రహించారు.

M. No. 315.

# అన్నా గో పా లా!

శ్రీమతి జలగం ధనలక్ష్మి

మానవుల కుండు సద్గుణసంపత్తిలో విశ్వాసము ప్రధానమైనది. విశ్వాస మనగా దృఢమయిన నమ్మిక. కొందఱ కీపరిస్థితి త్వరలో గలుగును. కొందఱ కనేకమార్లు పరీక్షించిన వెనుక కల్గును. కొందఱు జీవితాంతమువఱకును అపనమ్మకమే కల్గియుందురు. ఇట్టి నిష్కళంకమైన నమ్మకము పసిబాలురకు సులభముగా కల్గును పెద్దలందు కూడ కొందఱు మెత్తని యమాయక హృదయు లుందురు. అందువలన వారు జగతీవలయమున కెడుగులేదని విశ్వసింతురు. వారి హృదయములు ప్రేమ పూరితములై విశ్వాసముతో నిండియుండును. కొందఱికి యవిశ్వాసము, యసూయ ఉగ్గుపాలతోనే యలవడి మనంబుల గాఢముద్రితములై వెలిద్రోయుటకు వీలులేని వగును. పసిబాలుర విషయ మట్లు కాదు. వారి హృదయములు లలితములైనవి. హాస్యమునకన్న పలుకులను రూఢిగా నమ్ముదురు. జగమందుండు ప్రతి విషయమును మంచికొఱకే యని తలంతురు. ఈయాథార్థ్యమును భోదించుటకొఱకే క్రీస్తు ప్రభువు తనశిష్యులముందు ఒకశిశువును ఉంచి "మీరును యీశిశువు వలెనేయుండు" డనెను. అట్లన్న శిశువువలె చిలిపిచేష్టలు చేయమని కాదు. వారివలె పెద్దవారును అమాయకహృదయులై, యసూయాక్రోధా ద్యవిశ్వాసములు లేక నిష్కల్మషహృదయులై యుండవలె నని యర్థము.

పసిబాలురకు, వారి దృఢమైన విశ్వాస పాశములకు కట్టుబడి పరమాత్ముడు వారికి సులభముగా లభింపగలడని నా నమ్మకము. ఏల లభింపడు ? నమ్మక ముదయించువఱకు చాల కష్టము. విశ్వాస ముదయించిన వెనుక సర్వకార్యములును సాధ్యపడును. దీనికి తార్కాణము ధ్రువుని చరిత్ర. ధ్రువుడు పిన్నతల్లి సురుచి కోపముతో హరికరుణ పొంద మనినపుడు హరికరుణయొక్క మహాత్త్వమును నమ్మి యతనినిగుఱించి ఘోరతపము గావించి శాశ్వతపదవిని పొందెను. కీర్తిశాలి యయ్యెను. అతనిప్రాయము పంచవర్షములే. ప్రహ్లాదునివిషయమునను అంతియే. ఆశ్చర్య మాశ్చర్యము! పసిబాలుర విశ్వాస మతినిర్మలమైనది. ఇందుల కొకచిన్నికథ అతిమనోరంజక మైనది ఉన్నది. ఈకథను వివేకానందస్వాములవారికి వారిమాత బాల్యవయసున నుడివెనట. దానినిందు సమయానుసారముగ బొందుబఱచుచున్నాను.

ఒకగ్రామమున భర్తృవిహీన యయిన వనితయు యామె కుమారుడును నుండెడివారు. ఆపిల్లవాడు తనతల్లి యేమాట చెప్పినను దానిని త్రికరణ శుద్ధిగా నమ్మి ఆవిడమాట జవదాటక తనమాతృవాత్సల్యమును జూపించెడివాడు. ఇట్లుండ నాతని తల్లి తనకుమారునికి విద్యగఱపించవలెనని మది నెంచి, ఆ గ్రామోపాధ్యాయునికడకు వెళ్లగా అతడు డబ్బుదెచ్చినగాని చదువు

చెప్ప ననెను. ఆనిరుపేదరాలు భర్తృవిహీన, డబ్బు నేవిధముగా తేగలదు. అందువల్ల యాప్రయత్నమునుండి విరమించెను. ప్రక్క గ్రామమునకు వెళ్లి విచారించగా అందు డబ్బులేకనే బాలునికి విద్యచెప్పుటకు ఉపాధ్యాయుడు సమ్మతించెను ప్రాతఃకాలమున నాలుగుగంటలకు పిల్లలకు విద్య చెప్పుటకు ప్రారంభించి నాలుగంటలకు వదలుదురు. మరల సాయంసమయమున ప్రారంభించి నెనిమిది గంటలకు వదలుదురు. కావున ఆ పసిబాలునికి వచ్చునపుడు పోవునపుడు త్రోవ చాల చీకటిగా నుండును. అందును మధ్య యరణ్యము. ఒక్క దిన మా బాలుడు తన తల్లితో "అమ్మా! నాకు విద్య నేర్చుకొన నభిలాష గలదు; కాని, నాకు ఆ కటికచీకటిలో పోవుటకు భయముగా నున్నది ఎవరైన తోడుగా వచ్చిన బాగుండును" అనెను. పాప మానిర్భాగ్యురాలు తన పుత్రుని పలుకులు విని తనయసహాయస్థితిని దలంచి చింతించెను. ఏమిచేయగలదు? కండ్లనీరు నించి "దిక్కులేనివారికి దైవమే దిక్కను" సామెత ప్రకారము దైవమును ధ్యానించి బాలుని నూఱడించు కొఱకై "నాయనా, నీవు పోవునపుడు నీకు భయముగా నుండినయెడల "అన్నా! గోపాలా!" యని పిలువుము. మీయన్న వచ్చి నిన్ను దోడ్కొని పోవును." అనెను. ఇది సత్యమని ఆ యమాయకబాలుడు నమ్మెను. ప్రతిదినము పాఠశాలకు తెల్లవాఱుజామున మూడుగంటలకు పోవుట యలవాటు కాబట్టి మఱుదినము అతడు వేకువ



చి॥ సౌ॥ జలగం ధనలక్ష్మి

జామున బౌకి బయలుదేరెను. అరణ్యమంతయు గాఢాంధకారముగ నుండెను. అతనికి తన తల్లిపలుకులు స్మరణకు రాగా ఆ పలుకులు నిజమని త్రికరణశుద్ధిగనమ్మి ఎలుం

గత్తి "అన్నా! గోపాలా! రావన్నా! నాకు భయముగానున్నది" అని పిలిచెను. ఎవ్వరును రాకపోయిరి. మరల "అన్నా! గోపాలా! నన్ను బడికి తీసుకొనిపోవన్నా! మనతల్లి చెప్పినదన్నా! గోపాలా! రావన్నా!" యని పరితాపముగా పిలిచెను. తోడనే అపర మాత్మ్యుఁడు, సర్వజనశరణ్యుఁడు, భక్తవత్స లుఁడు, ద్వారకానాథుఁడు నాడు ప్రహ్లాదుని పలుకులకు భంగము రానీయక హిరణ్యుని వధించుటకు ఏయాకార ముండవలెనో ఆ యాకారముతో నుండి ప్రత్యక్ష మయిన యట్లు బాలుఁకు పూర్తి మనో నిశ్చయముతో "అన్నా!" యని పిలిచినందులకు బాలుని యన్నగా నుండిన ఎంతవయ స్సుండవలెనో అంతే ప్రాయము గలవాఁడై, ఒక చిన్న గోవుతో వచ్చెను. గోపాలుఁడు బాలుని జూచి "ఏమి నాయనా! నన్నెందులకు పిలిచితివి." యని యడిగెను. అందుల కా బాలుఁడు "అన్నా! గోపాలా! నాకు బడికి పోవుటకు భయముగా నున్న దన్నా! దారి చీకటి యన్నా! అమ్మ నిన్ను పిలచికొని పొమ్మనిన దన్నా" యని తన యమా యకత్వ ముట్టిపడునట్లు తన తల్లి మాటల యందు పూర్ణవిశ్వాస ముంచి అతి దీనముగా పల్కెను. అందులకు గోపాలుఁడు "నాతోటిరా, నాయనా! నీకు భయము లేదని" ధైర్యము బలికి అతనిని దోడ్కొని బడి వద్ద విడిచి తన దారి నేఁ బోయెను. మరల సాయంసమయమున వచ్చిన పుడు "అన్నా! గోపాలా!" యని పిలచెను. గోపా లుఁడు వచ్చి యతనిని యింటి వద్ద విడిచి వెళ్లిపోయెను. ఈ పరమాద్భుతమైన సంగ తిని ఆ బాలుఁడు తన తల్లికి చెప్పలేదు. అది యతని కాశ్చర్యముగాతోచినగదా చెప్పుటకు? తల్లి పిలవమన్నది, పిలచెను, అన్న వచ్చెను. ఇంతియెకదా? యని బాలుఁడు నమ్మెను. ఇట్లనేకదినములు జరిగెను. ఒకప్పుడు ఉపా ధ్యాయుఁడు పిల్లవాండ్లను జూచి "నాయన లారా, రేపు మన గృహమున నా జన్మదినో త్సవము జరుగనున్నది. వారి వారికి తో చినవి తెండు" అని చెప్పెను. అందులకు బాలురందఱును సమ్మతించిరి. కొందఱు ధాన్యము తెచ్చెద మనిరి. కొందఱు పండ్లను తెచ్చెద మనిరి. ఇట్లు బాలురందఱును పలు విధములగు సామగ్రిని దెచ్చెద మనిరి. కాని మన బాలుడు మాత్రము యేమియు చెప్పక నీళ్లు నములుచుండెను. ఏలననగా, యతనివద్ద నేమియు లేదు. తన తల్లి నడిగిన నుండునో నుండదో తాను బీదపిల్లవాఁడు. ఆదినము ఇంటికి వెళ్లిన వెనుక తన తల్లిని ఉపా ధ్యాయున కేదైన నిమ్మని యడిగెను. అందుల కాతల్లి కండ్ల నీరు వదలుచు "హా! గోపాలా!" యని ప్రలాపించెను. అబాలుఁ డు "అమ్మా! ఆయన్న నన్ను ప్రతిదినము వెంటబెట్టుకొని పోవుచున్నాఁ డమ్మా" యని మాటవశాత్తున చెప్పెను. ఈపలుకులు వినిన యాయమయాశ్చర్య మింతయంత గాదు. ఆ విషయమై కుమారుని ప్రశ్నించెను. అందుల కతఁడు "అమ్మా! నీ వాదినమున చెప్పినట్లు నేను అన్నా! గోపాలా! యని ప్రతిదినము పిలుతును. అన్న వచ్చి నన్ను తోడ్కొని పోవును" యని చెప్పెను. ఆపలు కుల కాతల్లి యొడలు పొంగిపోయెను. సర్వేశ్వరుని నోరార స్తుతించెను. బాలుని చూచి "కుమారా! మనకు గోపాలుడు తప్ప ఎవ్వరు లేరు. కాబట్టి నీవు ఉపాధ్యా

యునికి కావలసిన బహుమానము నా గోపాలునే యడుగుము" అని నుడివెను. మఱుదినము వేకువజామున ఆ బాలుఁడు బడికి పోవునపుడు తనతో వచ్చు గోపాలుని చూచి "అన్నా! గోపాలా! మా గురువుల గృహమున ఉత్సవము జరుగ నున్నది. అందఱకు అమ్మను నేనైన కానుక నిమ్మని యడిగితిని. అమ్మ నిన్నడుగ మన్నది" అని చెప్పెను, తోడనే గోపాలుఁడు ఒక మట్టి పిడతయందు తనతో నుండు గోవులలో నొకదానినుండి పాలుపిండి బాలున కిచ్చి "నాయనా! ఈ పాలనుగురువులకు సమర్పించి పాత్రను తీసికొనిర"మ్మని చెప్పి పాఠశాలవద్ద డించి వెళ్లెను. బాలుఁడు బడిలో ప్రవేశించుసరికి ఉపాధ్యాయుడు బాలురందఱు నిచ్చు సామగ్రి యంతయు తీసి సర్దుచుండెను. ఇతను వెళ్లి తన పాలను తీసుకొమ్మని బ్రతిమాలెను. పిల్లవాండ్రందఱు నిచ్చు విలువగల సామగ్రిలో యీ బీదబాలుని చిన్న పిడతపాలు ఆ ఉపాధ్యాయునకు లెక్కలేకుండెను. ఈ పిల్లవాడు "అయ్యా! నా పాలను తీసుకొని పాత్ర నివ్వు" డని బిగ్గఱఁగా రోదన చేయసాగెను. ఈ దొందడిపడలేక ఉపాధ్యాయుడు ఒక పిల్లవానిని చూచి "ఆ పాలను ఒకపాత్రలో పోసి పిడత వాని కిచ్చివేయు" మని చెప్పెను. ఆ పిల్లవాడు ఒక పాత్రలో ఆ పిడతయందుండు పాలను బోసెను, కాని పిడతయందుండు పాలుమాత్రము వక చుక్కయినను తగ్గలేదు. ఇట్లు పెక్కుతడవలు పోసెను. యథాప్రకారము పిడతలో పాలుండెను. పోయుచుండిన వెంటనే పాత్ర నిండుచుండెను. పిల్లవానికి చేతులు నొప్పులెత్తెను. మన బాలుఁడు "పాలుబోసికొని వట్టి పాత్ర నివ్వ వయ్యా నాకు"యని కేకలు వేయుచుండెను పాలు పోయుచుండిన బాలుఁడు ఆశ్చర్యపడి జరిగిన యద్భుతము గురువులకు విన్నవించెను. ఆయన మఱల వేరొకపాత్ర తెప్పించి అందులో తానే స్వయముగా పాలను పిడత నుండిపోసెను. పోసినను మఱల పిడతయందు పాలుండెను. ఇట్లనేకమారులు జరిగెను. గురువు సంభ్రమాశ్చర్య చకితుఁడై బాలుని జూచి "ఈ పిడత పాలెక్కడివి?" అని ప్రశ్నించెను. బాలుఁడు "స్వామీ! మాయన్న గోపాలుఁడు తనవద్దనుండు గోవునుండి ఆపాలను పిండిచ్చె"నని నుడివెను. ఇదివిన్న ఉపాధ్యాయుడు "నీకు అన్నలులేరే, యెక్కడి అన్న? యెక్కడి గోపాలుడు?"అని యడిగెను. అందుల కాబాలుఁడు ఉన్నదున్నట్లు జరిగిన దంతయు చెప్పెను. అప్పుడు గురువు ఆ బాలునికి పరమాత్ముఁడు సాక్షాత్కరించి యున్నాఁడని తలంచి ఉత్సాహముతో "నాయనా! ఆ గోపాలుఁ డెక్కడ? నాకీ లోకి కాడంబరములతో బనిలేదు. నాకీజన్మ దినోత్సవ మనావశ్యకము. ఆ గోవిందుని తిలకించు నేత్రోత్సవమే ప్రధానము. తండ్రీ! నీకు పుణ్య ముండుగాక. ఆ గోపాలుని నాకును చూపెట్టుము" అని కుతూహలముతో పలికెను. ఆ బాలుఁడు "అట్లే చూపెద"నని చెప్పెను. పిదప వారిరువురును అరణ్యమునకు వచ్చిరి. బాలుఁడు "అన్నా గోపాలా! రావన్నా!"యనిపిలిచెను. ఎవ్వరును రాలేదు. ఉపాధ్యాయులు బాలుని "గోపాలుఁ డెక్కడ?"యని తొందఱ పెట్టుచుండెను. అందుల కాబాలుఁడు "అన్నా! గోపాలా! రావన్నా! ఉపాధ్యాయులు నామాట యసత్య మని తలంతురన్నా! రావన్నా!

అన్నా! గోపాలా! నాపలుకు ఆలకింపవన్నా! అమ్మమాటయబద్ధము చేయకన్నా! నేను నీతమ్ముడ నన్నా! తక్షణమె రావన్నా! అన్నా! గోపాలా! గురువులు నీకొఱకై కాచియున్నారన్నా! గోపాలా! నీవు రాక పోయిన నామాట యబద్ధ మగునన్నా! ఎందు కన్నా నీ కింత కోపము? అన్నా! గోపాలా! రావన్నా! అన్నా! గోపాలా!" యని రాళ్లుకూడ కఱఁగున ట్లతిదీనముగా ప్రలాపించెను. ఇదంతయు చూచు చుండిన గురువు "నాయనా! నీ వెన్ని మార్లు పిలచినను గోపాలుఁడు రాఁడు. నేను అవిశ్వాసిని. పొట్టకూటికై గురువు ననిపించుకొనుచున్నాను. నాకు నిజమైన భక్తి విశ్వాసములు లేవు. నీవు విశ్వాసివి. భాగ్యశాలివి. నాయనా! ఈపాపికి, అపవిత్రునికి, అవిశ్వాసికి ఆ భగవంతుని పవిత్ర మూర్తి దర్శన మబ్బుట కల్ల. నాయనా! నీకు నాయం దుండు భక్తిగౌరవములనైనను చాటించి, యాపరంధాముని దర్శనము నాకు కల్గునట్లు చేయుదువేని నాజన్మము తరించును." అని విచారముతో బల్కెను. అందులకా బాలుని లేతహృదయము సూర్య రశ్మికి మంచుగడ్డ కరుగునట్లు కరిగెను. "స్వామీ! నేను సత్యముగా తమకు నా గోపాలుని దర్శనము కల్గునట్లు చేసెద" నని పల్కెను. గురువు "నాయనా! నేను చాటున నుండెద" నని చెప్పి మఱుగుపడెను. మరల యా బాలుఁడు "అన్నా! గోపాలా!" యని పిలచినతోడనే గోపాలుఁడు గోవుతో ప్రత్యక్షమాయెను. బాలుఁడు "అన్నా! ఏమన్నా! ఇట్లు జేసితివి. ఇందాక యెన్ని మారులు పిలిచినను రాకపోతివి. అమ్మ మాట వమ్ము చేసితివి." యని మొఱ పెట్టెను. గోపాలుఁడు నవ్వుచు "సోదరా! అమ్మ నీతో నన్ను తోడ్కొని పొమ్మన్నది గాని ఉపాధ్యాయునికి చూప మనలేదే? నీవు విశ్వాసివి. పూర్ణమనస్సుతో తల్లి పలుకులను నమ్మితివి. నన్ను నిండారు ప్రేమ విశ్వాసములతో నోరార "అన్నా" యని పిలిచితివి. నీ కగుపడితిని. నీగురువు నీకన్న నెక్కుడుపండితు డగుట నిజము. కాని నీవలె నిష్కళంకహృదయుఁడు గాఁడు అవిశ్వాసి. దేవునియందు నమ్మకము లేనివాఁడు. అతనికి నేను దృగ్గోచర మగు టుచితము గాదు" అని పలికెను. తోడనే గోపాలుని మహాత్త్వమువలన బాలునికి జ్ఞానోదయ మయ్యెను. అతను ఆనందసాగరమున నోల లాడుచు "అన్నా! నే నెంత భాగ్యశాలిని! భవదీయదర్శనమే కాక నీతోడి ప్రతిదినము సంభాషణచేయునంత భాగ్యము కూడ నబ్బెను. కరుణానిధీ! నీనామము సార్థకము చేసికొంటివి. ఎంత కరుణామయుఁడవు. తల్లి పలుకులయం దుండు నానమ్మక మెక్కడ పోవునో యని నేను అన్నా యని పిలిచినపుడు నాయన్నగ నుండిన నెంతవయస్సువాఁడ వలయునో, అంతవాఁడవై వచ్చితివి. ఓదీన జన శరణ్యా! సత్యముగా నీవు దీనులమొఱాల కింతువు. ఇందు సందియము లేదు. మా గురువుగారు

సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సస్సుధీర్ భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్.

అను శ్లోకము నప్పుడప్పుడు పండితులు పఠించి దాని యర్థము చెప్పుచుందురు. అది

ఏనాడు జరిగినదో యని వింతపడుచుందును. కాని నేడు ప్రత్యక్షముగా చూపెట్టినావు ఆ వుపనిషత్తు యీగోవు. ఆ గోపాలుఁడవే నీవు. ఆ పార్థునికి బదులు యీ దీనుని దూడగా చేసితివి. పండితుల స్థానమందు మా గురువును ఉంచితివి. ఆ గీతామృతమును ఈ గోవునుండి పితికి నాచేత పంపి, యీ స్పర్శవలన నా గురువుగారి యవిశ్వాసము పటాపంచ లగునట్లు చేసితివి. నా పలుకులందు దృఢవిశ్వాసముంచి నీ దర్శనార్థము కుతూహలుఁడై వచ్చియున్న నా గురువుగారికి నీవు దర్శన మియ్యని యెడల నామాట యసత్యమగును. నేను సత్యవంతుఁడౌట నీకు సమ్మతమేనా? నీవె నన్ను విశ్వాసి యని యంటివి. నాఁడు ప్రహ్లాదుని వాక్యమున వానితండ్రికి నీవు దర్శన మియ్యలేదా? ఆప్రకారము నీవు నాగురువుగారికి దర్శనమిచ్చి నామాట కాపాడవలయు" నని ప్రార్థింపగా ఆ పరమాత్ముఁడు సంతోషచిత్తుడై ఆ బాలుని యుదారహృదయమునకు మెచ్చి యతని యిష్టప్రకారముగా గురువుగారిని ఒప్పించి దర్శన మొసంగెను. వారిరువురును గోపాలుని నోరార స్తుతించిరి. పిమ్మట గోపాలుఁడు, బాలుని చూచి "నాయనా! నాయందు పూర్ణ భక్తి విశ్వాసములతో నుండు వాఁడవు. ఏమైన వరము నడుగుము, నొసంగెద"ననెను. అంతట బాలకా దృఢవిశ్వాసి "హే నారాయణ! మాధవా! గోపాలా! హరి గోవిందా! భక్తులపాలిటికల్పతరువా! దీన జనశరణ్యా! ఆర్తజనరక్షకా! ముకుందా! సర్వేశ్వరా! కరుణాకరా! నీపాదారవిందముల జేరిన వెనుక అన్యవరములు కావలయునా? ఈ పాపశీలునియందు నీ కనుగ్రహ మున్నచో, నెప్పుడును నీయందు, పెద్దలయందు, భక్తులయందు భక్తిశ్రద్ధలు కల్గియుండునట్లు చేయుమని ప్రార్థించుచున్నాను. నేను, నాతల్లి నా గురువు నీ పాదారవిందములను చేరునట్లు యనుగ్రహింప వేడుచున్నాను." అని ప్రార్థేయపడెను. భగవంతుఁడు వరము లొసంగి యంతర్ధాన మయ్యెను. పిమ్మట గురు శిష్యులు తల్లిదగ్గఱకు వచ్చి జరిగిన దంతయును నివేదించిరి. బాలుఁడు తనతల్లికి ప్రదక్షిణముచేసి నమస్కరింప, ఆమె మహానందము బొంది భగవంతుని తాను దర్శించ నందులకు చాల చింతించి కుమారుని యాలింగన మొనర్చుకొనెను. పిమ్మట నందఱు ఆనంద సాగరమున మునిగిరి. వారు ధన్యజీవులు. విశ్వాసమునకు లోబడని వస్తువేమికలదు? నమ్మకమే మోక్షమునకు మూలకారి. విశ్వాసమే భగవంతుని దర్శనమునకు చూపుడువ్రేలు. ఆహా! విశ్వాస మహిమ. ఇట్టి అపూర్వవిశ్వాసమును మానవులకందఱకును దేవుఁ డనుగ్రహించును గాక!



# నీ మాట : నీ పాట

శ్రీ కాశిరాజు రామమోహనశర్మ

ఒకనాటిమాట కొండ లెల్ల పులకించె
ఒకనాటిపాట కొండ లెల్ల మరపించె
ఎంత చక్కనిమాట
ఎంత తీయనిపాట !

మాట తలపున రేగు నాశ లేవేళ
పాట తలపునపోదు ప్రాణమేవేళ
ఎంత చక్కనిమాట
ఎంత తీయనిపాట !!

పలుకాడ వద్దింక పాడగావద్దు
కలల తీయదనాలు కలపగావద్దు
అనుభవింపగ నిమ్ము
అంత చక్కనిమాట
అంత తీయనిపాట !!!

# వాసవీవిలాసము

శ్రీ తోగర్చేటి భాస్కరశాస్త్రి

సరసపాహితీపరు లగువారి కీయపూర్వవాసవీ గ్రంథపరిచయముఁ గల్గించు నుద్దేశముతో నే నీవ్యాస రచనమునకుఁ బ్రయత్నించుచున్నాను.

గ్రంథము:—ఇయ్యది తొమ్మిది యుల్లాసములు గల పద్యకావ్యము. సరసకవితాసంశోభితము. పాలపాటి సరసచిదంబరరాయకవివిరచితము. ఇందలి పౌరాణికకథ వైశ్యకులావతంసులకుఁ గులదేవతయగు కన్యకాపరమేశ్వరీచరిత్రమును దెలుపుచున్నది.

ఈకవి వతంసుఁడు సుమారు నలువది సంవత్సరములక్రిందటివాఁడు. ఇతని తండ్రి భీమన. తల్లి వరసమాంబ. బ్రాహ్మణులలో నియోగిశాఖకుఁ జెందిన నందవరీకవంశమున జన్మించినవాఁడు. కౌశికస గోత్రుఁడు. ఈ యంశమునే తనగ్రంథమునందుఁ బ్రథమోల్లాసమున నీక్రిందిపద్యమును వ్రాసియున్నాఁడు.

సీ. అట్టి నందవరీకామలాన్వవాయ

కౌశికసగోత్రమున మెప్పుఁ గనిన పాల
పాటి వంశాంబునిధిశీతభానుఁ డనఁగఁ
బరఁగి...................యొప్పె.

ఈ కవివాసస్థలము. "పొలికి" అను గ్రామము. ఇయ్యది అనంతపురమండలములో గుంతకల్లు జంక్షను నకుఁ బదిమైళ్ల దూరమున నున్నది. కుగ్రామము. ఈ పల్లెయం దుండక కవి యాప్రాంతమునందలి, రాయల చెరువు, క్రిష్టిపాడు, తరిమెల, శేబాల, మున్నగు గ్రామములందు విశేషకాల ముండినట్లు తెలియుచున్నది. ఆగ్రామవాసులగువారు కొందఱు ఈ గ్రంథాభివృద్ధికై పాటుపడినకారణమున వారివంశానుక్రమణికయు నిందుఁ గవి వర్ణించి యున్నాఁడు.

కవి తనవంశవృక్షము నీవిధముగ గ్రంథమున లిఖించియున్నాఁడు.

వంశవృక్షము




సరస చిదంబరరాయకవి
(గ్రంథకర్త.)

ఈకవి అనంతపురమండలమునఁ గాక కర్నూలు, కడప, బళ్లారి మండలము లందంతట సంచరించియున్నాఁడు. దత్తమండలమున (రాయలసీమ) నీకవిని నెఱుంగనివా రుండరు. కాని యితరమండలవాసుల కీకవినామ మశ్రుతపూర్వమైయుండును.

గడేహోతూరు గ్రామ నివాసులగు విస్తృత వేంకటరామశాస్త్రిులుగారును, వారి తమ్ములు లక్ష్మణశాస్త్రిులుగారును ఈ కవివర్యునివిద్యాగురువు లైనట్లు తెలియుచున్నది.

తే. గీ. తలఁతు సతతంబు సాదుహృన్నివమందు
ధరణి నిర్వ్యాప్తికుల సముద్భవులు నైన
ఘనుఁడు వేంకటరామశర్మ కవిని మఱియు
లలితసాహితీ గురుఁడగు లక్ష్మణార్య.

(వా. ప్ర. ౧౫ పద్యము.)

ఈకవికి గ్రంథలేఖనమందు ఘట్టి రామకృష్ణ రావుగారును, అమనగంటి రామరావుగారును సాహాయ్య మొనర్చినట్లు గ్రంథముఖపత్రమున ముద్రింపఁ బడినది.

ఈ గ్రంథము ౧౮౯౬ క్రీస్తు సంవత్సరమున బళ్లారి శారదాముద్రాక్షరశాలయందు ముద్రింపం బడినది. ఈ గ్రంథము ప్రతులు గావలయునన్నను లభించుట దుర్లభము. కవి సంచార మొనర్చిన గ్రామాదుల యం దేమైన లభించునేమో చెప్పఁజాల. నాకీ గ్రంథమును, నామిత్రులయిన శ్రీయుత గార్లదిన్నె సుబ్బరాయకవిగారు 'చూడు' మని యిచ్చిరి. ఈ గ్రంథపరిచయ మాంధ్రుల కెల్లరకుఁ గల్గించు నుద్దేశమే నన్నీ వ్యాసమును వ్రాయించినది.

ఈకవికి సంస్కృతమునందును గూడఁ గవితాశక్తి గల దనుటకు నచ్చటచ్చటఁ దన గ్రంథమునందలి తాను రచించిన శ్లోకములే సాక్షి. మఱియు నీకవి, అనేకములగు శతకములు, దండకములు, స్తోత్రములు, చాటువులును గూడ రచించి యున్నాఁడు. కాని వానిలోఁ గొన్ని ముద్రితములు. కొన్ని అముద్రితములు. ముద్రితము లయినవియుఁ గూడ నిపుడు లభింపవు. వీరి కృతులలో నీ వాసవీవిలాసమే ప్రధానమైనది.

వీరుమాత్రమే పండితులు కాదు. వీరి వంశీయులుఁ గూడఁ జక్కని పాండిత్యముఁ గల్గి, వాక్సిద్ధి, తపశ్శక్తి యుఁ గల్గి యున్నట్లు తన వంశాభివర్ణనమున వర్ణించియున్నాఁడు.

పై వంశవృక్షములోని వేంకటపతిరాయలు, పెద్దచింతామణప్ప వీరిద్దఱినిగూర్చి యీ క్రిందిపద్యములఁ జెప్పియున్నాఁడు.

సీ. తిట్టుపద్యముఁ జెప్పి తెరలించె రిపు గడే
హోసూరు ముట్టడై యున్నవేళ,
విత్తనచే లెండవిడపనకల్ప్వారిం
బద్ధవ్యశతకముఁ బఱఁగఁ జెప్పి
కురుపించెను సువృష్టి, సత్తిలోఁ జేరిన
యుఱగాద్రి పరగణ పుర్వీసేలు
ముద్దుమల్లపదొర ముఖ్యపట్టపు కవీ
శ్వరుఁ డన దీర ప్రశస్తిఁ గాంచెఁ

తే-గీ. బహుళ గోవకొండ్ల మొదలగు పత్తనముల
మాన్యములు పెక్కులితఁడు సామాన్యుఁడవునె
ధీవిశేషగీష్పతి నిశాంకధృతి శచీపతి
పాలపాటి వేంకటపతి ధళి వసుమతి.

సీ. తనమహోగ్ర ద్వ్యశాస్త్రప్రౌఢిమకు నబ్జ
స్థ్యంజకంబు గ మణిదలయు మెప్పఁ
దనయుష్టభాషాపద గ్రంథికవితకు
డాకాల గంపె పెంటార మెప్ప
తనసుకవిత్వమునకుఁ దగఁగఁబండెయుకోర
బంపిన పల్లికి ప్రథ దనర్ప
దనసువిద్యాతిథిత్వమునకు వావాటి
శిష్యప్రశిష్యులు చేరి యొప్ప

తే-గీ. ధరణి శ్రీగణేహోసూరుధామమందు
సకలపండితమండలి సన్నుతింప
యాచకాళి చింతామణి యనఁగఁ బఱఁగి
పెద్దచింతామణప్ప దాఁ బెంపుఁ జెందె.

"శ్రీ యలమేలుమంగ" అను గ్రంథాది పద్యమునుబట్టి యీకవి యిష్టదైవము శ్రీ తిరుపతి వేంకటేశ్వరు లని తెలియుచున్నది. మఱియు,

క. అసహాయసరసకవితా
రసికుఁడ వేంకటనగాధరప్రభుకరుణా
రసపరిపోషితమృగువా
కృతిసవమరందాప్తసకలకవిబంధురుఁడన్.

అను పద్యమువలనఁగూడఁ దెలియుచున్నది. అశ్వాసాంత్యగద్యమునందు "సప్తకవిమిత్ర" అను విశేషణమును దన కన్వయించుకున్నాఁడు. దాని యభిప్రాయ మేమో తెలియకున్నది.

గ్రంథమునం దచ్చటచ్చట, లేఖక దోషములును, ముద్రణస్ఖాలిత్యములును, విశేషముగఁ గాన్పించుచున్నవి.

కవిత, ఒక్కొక్కచోఁ బ్రౌఢశైలిఁ గలిగి, ఏకాక్షరనిఘంటువు, నానార్థ నిఘంటువుల మూలమున నర్థముఁ జేయఁదగినదిగ నుండుటంబట్టి, కవియే అట్టిపద్యములకు టీకయుఁ వ్రాసియున్నాఁడు. అపూర్వపద ప్రయోగములం గూర్చియు, ఛందోవ్యాకరణాదులం గూర్చియు, విమర్శనములఁ దన టీకయం దుదాహరించియున్నవాఁడు.

## ఇందలి కథాసంవిధానము.

### ప్రథమోల్లాసము

ఒకానొకనాఁడు నైమిశారణ్యంబున శౌనకాది మునులు సూతుం జూచి వైశ్యధర్మములఁ జెప్పుమని యడిగిరి. పూర్వమున గోదావరీతీరంబున శాలంకాయనమహర్షి యొద్దకు వైశ్యమునులు వచ్చి తమధర్మములఁ జెప్పుమని యడుగఁగ నతఁ డిట్లు చెప్పనారంభించె. పూర్వము నారదుఁడు ధర్మనందన సంవాదరూపంబగు నీకథ నాకుఁ జెప్పఁగ వింటిని.

ప్రతిష్ఠానపురమందు ధర్ముఁడను ఒక వణిజుఁడు సంతానము లేకయుండి, యమునానదీ తీరమందలి భూమింజయమహర్షి వ్రతోపదేశమహిమంబున నొక పుత్రునిం బడసె.

ఆ ధర్మనందనుఁడు భార్గవాశ్రమంబున విద్యాభ్యాసముఁ జేయుచు నొకనా డరణ్యమున నొక కిరాతునిచేతం బడి బాధింపఁబడుచుండ, మగధదేశాధిపతి యచటికి వేటకై రాఁగా నాధర్మనందను నొక భూబిలమున నునిచి, రాజు నెదురింప నారాజు కిరాతుం బరిమార్చి తనదేశమున కేగెను.

అంత నక్కడ దన శిష్యుండు రామికి భార్గవుండును, శిష్యుని తలిదండ్రులును దుఃఖించుచుండిరి.

అంత నొకనాఁడు కైలాసంబునందుండి, నాసుకి ఆ భూబిలమార్గమున నాగలోకమున కరుగుచు నీవైశ్యపుత్రుండగు ధర్మనందనుని గని, యాతని వృత్తాంతం బంతయు వారసి యాతనింగూడ నాదిశేషుని కడకు నాగలోకమునకుం దోడ్కొనిపోయెను. అంత నాధర్మనందనుండు ఆదిశేషుం గని ప్రపంచసృష్టియు వైశ్యుల ధర్మంబులును, జెప్పుమని యడుగ నాశేషుండు ప్రపంచసృష్టిప్రకారంబుఁ జెప్పి, విరాట్ స్వరూపుండగు భగవంతుని తొడలనుండి వైశ్యు లుద్భవిల్లిరని చెప్పె.

### ద్వితీయోల్లాసము

ఇట్లు భగవానుఁడు వైశ్యుల సృజించి వారికిఁ బురోహితుఁడుగ నపరార్కుని సృజియించి, సత్కర్మల బోధింపించుచుండె.

ఇట్టుండ నొకనాఁడు దాముఁడు దమపురోహితుఁడును, బ్రహ్మసభకుం బోయి, తమ ౭౧౪ గోత్రములఁ దెల్పి బ్రాహ్మణులకన్న మేమధికులమని చెప్పనపుడు విప్రు లాగ్రహమున "మీరు మాంసభక్షకులై భూమిని జన్మింతురుగాక" యని శాపంబీయ నపుడు బ్రహ్మకరుణతోఁ "గలియుగంబున నా మాయాశక్తి కన్యకాపరమేశ్వరిగా నవతరింపఁగలదు. ఆయమ మీశాపంబుఁ బోఁగొట్టు"నని చెప్పె. అంత వైశ్యులు హిమవంతంబు పొంత నీశ్వరునిగూర్చి తపం బొనరించుచుండ నపరార్కుండు ఏడువందలపదునాల్గు గోత్రముల వైశ్యులందఱును, 'ఏయే గోత్రములవా రేయేనియమముల ననుసరించి యేయేస్థలముల నెంతెంత జపముఁ జేసిన నీశ్వరుండు ప్రత్యక్షమగునో యావిధ మందఱకుం జెప్పెను. మరియు కన్యకాదేవివెంట నగ్నికుండంబునం బ్రవేశించిన మీశాపంబులు దొలఁగు ననియు, మీరందఱు పులస్త్య తీర్థముకడకుఁ జనుఁడనియు, అచట నొక మహాపట్టణము కాఁగలదనియు నుడివెను. పిమ్మట నట్లొనరించువారికీశ్వరుండు ప్రత్యక్షుండై కైలాసం బిచ్చె.

చిత్రకంఠుండను గంధర్వుండు ఒకవైశ్యకన్యం గోరి, తన యభీష్టము నెరవేరమికి "వైశ్యు లందఱు భూలోకంబున నగ్ని దగ్ధు లయ్యెదరుగాక" అనిశాపం బీయ నావైశ్యులును, "నీవు భూలోకంబున రాజవై జన్మించి, వైశ్యకన్యం గోరి, తల పగిలిచత్తువుగాక" యని ప్రతిశాపం బిచ్చిరి.

### తృతీయోల్లాసము

ఒకనాఁడు దూర్వాసుండు కైలాసంబునకు రాఁగా వైశ్యులడ్డగించుటయు, నంత నామహర్షి, "మీరు వేదబాహ్యులై భూమిని బుట్టుదురుగాక" అని శపించి చనియె. అంత నీశ్వరుండు, "మీరు నగర

గాను, పార్వతి వింధ్యవాసినిగాను, విష్ణువు జనార్దనుఁడుగాను, లక్ష్మీదేవి గోనకమలగాను, బ్రహ్మ భాస్కరాచార్యుఁడుగను, జన్మింతురు. నేను నగరేశ్వరుఁడుగా పుట్టి మీవెంటనే వత్తును" అని యోదార్చె.

అంత వైశ్యులు బ్రహ్మలోకమునకును, విష్ణులోకమునకు జని, బ్రహ్మవిష్ణువుల ననుజ్ఞంగొని, భూలోకంబున పౌలస్త్యతీర్థము చెంతకుం జేరిరి. అంత నచటికి విశ్వకర్మ వచ్చి ఆగోదావరీతటంబున పెనుగొండపురమును వైశ్యులకై నిర్మించె. దానిచుట్టును, ౧౮ పట్టణంబులును, సృజించెనియె. అంత నా ౭౧౪ గోత్రముల వైశ్యులును, నా పదునెనిమిది పట్టణంబుల నివసించిరి.

అందు కుసుమశ్రేష్ఠియను వైశ్యునకు సంతానము లేనికారణమునఁ బుత్రకామేష్టియాగముఁ జేయ నొక పుత్రుండును, నొకపుత్రికయు జన్మించిరి. పుత్రికకు వాసవియనియు, పుత్రునకు శ్రీ విరూపాక్షుఁడనియు, నామంబులం బెట్టిరి. ఆవాసవియే కన్యకాపరమేశ్వరి. వైశాఖశుద్ధ ౧౦ శుక్రవాసరంబున నావిర్భవించెను.

## చతుర్థోల్లాసము

రాజమహేంద్రంబునేలు విష్ణువర్ధన మహారాజు దండెత్తి వచ్చి, కల్యాణపట్టణప్రభువగు బిజ్జలనృపాలుని జయించి, యాతనిచేఁ గప్పంబుం గైకొని, మరలి వచ్చుచు, కృష్ణాతీరమందలి ఇంద్రకీల పర్వతమందు మల్లికార్జున స్వామిని దర్శించి, విజయవాడకుం జని, యచటినుండి మార్గము దప్పి పెనుగొండపురమార్గాభిముఖుఁడై చని, ఆపట్టణోద్యానవనంబున విడిసి, వనవిహారంబు సలిపి, యుద్యానమందిరం బెక్కి పెనుగొండపుర రామణీయకం గాంచుచుండ వనపాలురు వచ్చి "ఇయ్యది పెనుగొండాఖ్యపురం బనియు, నిందుఁ గుసుమశ్రేష్ఠి రాజై యుండుననియు, నీపురంబును వైశ్యులకై విశ్వకర్మ సృజించె ననియు, దీనికి క్షామచోరాదిభయంబు లేదనియుఁ బల్కిరి.

## పంచమోల్లాసము

ఆ పెనుగొండపురమందలి నగరస్వాములు రాజరాజనరేంద్రుని గని పట్టణమునకు రమ్మనియు, మానగరేశ్వరుని దర్శింపుమనియు వేడి తోడుకొనిపోయిరి. అంత వారా రాజునకు నగరేశ్వరాది దేవతాదర్శనంబులఁ జేయించి, కుసుమశ్రేష్ఠిమందిరంబునకుం దోడ్కొనిపోవ నచట నాతనిపుత్రికయగు వాసవిం గని, మోహించి, తన కిచ్చి వివాహముఁ జేయింపుఁడని వైశ్యులఁ బ్రార్థించెను. ఆవైశ్యులు 'కన్యమాట నటుండనిచ్చి, విందుఁ గుడువ రమ్మని ప్రార్థింప నట్లె కానిమ్మని సమ్మతించె. అంత బాలనగరాలు "అయ్యో! రాజు నేల విందునకుం బిల్చితిరి? మనవాసవిని మోహించెఁగదా! ఇచ్చిన నొకకష్టము, ఈయకున్న నొకకష్టము!' అని పల్కి, పూర్వము విశ్వామిత్రుఁడు వశిష్ఠునాశ్రమంబునకుఁ జని, విందుఁగుడువ, నాకామధేనువుపై కోరికగల్గి యెంతెంత యనర్థమాయె!" నని పల్కిరి. అప్పుడు బాలనగరాలు, రాజుకడకు వెళ్లి రాజా! మీకుఁ గన్యక గావలయునన్న మాయింట భోజనము గూడదుసుమా! అని యుక్తితోఁ జెప్ప రాజంగీకరించి విందునకు రానని చెప్పె. కన్యక నీయవలయుసుమా యని చెప్పి, యచటినుండి బయలుదేరి తనపట్టణంబగు రాజమహేంద్రనగరమునకు వెళ్లెను.

## షష్ఠోల్లాసము

అచట రాజమహేంద్రనగరంబున విష్ణువర్ధనుఁడు వాసవీవియోగంబున విరహార్తుండై యుండె. ఇచట బాలనగరాలును, బదునేడుపట్టణనగరస్వాములును నొకచోఁ జేరి యోజించి కన్య నిచ్చుటకు సమ్మతింపక రాజునకుఁ గొన్ని కానుకల నిచ్చి యెట్లయిన సమ్మతింపఁజేయవలయు నని యెంచి, కొందఱు శ్రేష్ఠులు రాజమహేంద్రపురంబునకు బయలుదేరి మార్గమధ్యంబున, మార్కండేయక్షేత్రంబును దర్శించి కొన్నిదినములలో రాజమహేంద్రంబుం జేరిరి.

## సప్తమోల్లాసము

నగరస్వాములందరు ఆనగరంబుం జేరి విష్ణువర్ధనుని గని, ప్రభూ! ఎందఱు కన్యలో యుండ మీరు మా వైశ్యకన్యం గోరననునే? యని యన రాజును, మంత్రులును వినక, యెన్నింటినో పూర్వరాజుల చరిత్రంబులం దెల్పి, ఈయుఁడని నిర్బంధింప వల్లెయని తాత్కాలికసమాధానంబుం జెప్పి పెనుగొండకుం జనిరి,

## అష్టమోల్లాసము

ఆ నగరస్వాములవెంట రాజభటులును జనిరి. చని యచట పెనుగొండపురంబున వైశ్యులెల్లరు సభ గావించి పరస్పరము వాదప్రతివాదములు సల్పి, కడకు వాసవిని నారాజున కొసంగకుండునట్లును, నేదైన నాపద సంభవించినచో నగ్నింబడి మరణింత మనియు నిర్ణయించుకొనిరి. అంత భాస్కరాచార్యుండు దేవరహస్య మిట్లు చెప్ప నారంభించె.

పూర్వము నారదుఁడు పార్వతీపరమేశ్వరు లేకాంతమందుండఁగాఁబోవ నీశ్వరుండు "నీకుఁ బార్వతి గనుపింపకుండుఁగాక" యని శాపంబిచ్చె. పిమ్మట నారదుఁడు దుఃఖింపఁగా నిట్లు శాపమోక్ష మనుగ్రహించె. "వైశ్యులు కైలాసమందుండ, మణిపుర వాస్తవ్యుఁడగు చిత్రకంఠుండను గంధర్వరాజు వచ్చి యొకవైశ్యకన్యం జూచి మోహించి తనకీయుమని యడుగుటయు నంత వారందఱు అంగీకరింప కుండుటచే "మీరు భూలోకంబున నగ్ని కుండంబునంబడి మరణింతురుగాక" యని శాపంబిచ్చె. అంత వైశ్యులును "నీవును భూలోకమున రాజవై జన్మించి మాకులదేవతను మోహించి చత్తువుగాక" యని ప్రతిశాపం బిచ్చిరి. ఆ గంధర్వుఁడే రాజమహేంద్రంబున విష్ణువర్ధనుఁడై జన్మించె. ఆ వైశ్యులును నగరస్వాములై జన్మించిరి. ఇంతలో వైశ్యులు అగ్నింబడి చత్తురు. అది నీవు గాంచినచో నారదా! నీశాపమోక్ష మగునని శివుండు వచించె" అని భాస్కరాచార్యుఁడు పల్కె. అంత నగరస్వాములు తామగ్ని ప్రవేశం బొనర్ప నిశ్చయించి రాజునకు లగ్నపత్రికం బంపి వాసవియొద్దకు బోయి, శోకాక్రాంతులు కాఁగా, నామె దనస్వస్వరూపంబుం జూపి, సంతోషపెట్టె. కొందఱు భయపడిరి. ౬౧౨ గోత్రములవారు పురంబు విడిచి వెళ్లిరి. వారు వేరువేరు నామంబులం బొందిరి. మిగత గోత్రములవారు భాస్కరాచార్యు నొద్దకు వచ్చి చేరిరి. అంతట గ్రామంబున జనులకు సంశయముఁ గలుగకుండ నుండఁగలందులకై వాసవీవివాహం బని పురంబున చాటఁబంచిరి.

## నవమోల్లాసము

అంత నగరస్వాము లందఱును నగరేశ్వరాలయంబునఁ జేరుటయు భాస్కరాచార్యుండు కుసుమశ్రేష్ఠిం జూచి, "నీ పుత్రికయభిప్రాయంబుం గనుఁగొంటివా" అని యడుగుటయు నంతనచటనే యుండిన వాసవి దననిజస్వరూపంబుం జూపి దేవరహస్యమీ విధముగ వెల్లడించె:

పూర్వము సురథుఁడను రాజర్షి నన్నుఁ గూర్చి తపంబుం జేసియుండె. అతఁడే కుసుమశ్రేష్ఠిగా జన్మించె. శబలకంఠుఁడను రాక్షసుండు పూర్వతపంబుచేత విష్ణువర్ధనుఁడై జన్మించె. మన మగ్నింబడినచో నా విష్ణువర్ధనుఁ డీల్గును. మీకు బ్రాహ్మణశాపంబుచే వేదోక్తకర్మంబు లేదు. బ్రాహ్మణులను బరిహసించుటచే మీకు శాపంబుఁగల్గె. మేనరికపు వివాహధర్మంబుఁ బరిపాలింపుఁడు. అని చెప్పి వాసవి అంతర్ధానంబుఁ జెందె. అంత నగరస్వాములు మాతులకన్యాపరిణయ విధుల బాలనగరాలకుం జెప్పిరి. అప్పుడు శాలంకాయన మహర్షి చనుదెంచి వారలకుఁ బురాణోక్తధర్మంబులం దెల్పి అంతర్ధానంబుఁ జెందె.

మల్లుఁడు దపశ్చండికిఁ దేవియాన తిచ్చిన విధంబున వైశ్యులతోఁడఁ దానును నగ్నికుండంబుం జొరఁగా నిశ్చయించి ౧౦౩ అగ్నికుండంబులును దనకొక యగ్నికుండంబును సిద్ధముచేయించె. అపుడందఱు అగ్నికుండంబులయొద్దకుం జని మంటలు గల్గునట్లు చేసిరి. కాని అగ్నిదేవుండు ప్రజ్వరిల్లకుండె. అంత వాసవి ప్రార్థింప నగ్ని ప్రత్యక్షంబై "నే నీ పుణ్యాత్ముల దహియింప" నని చెప్ప వాసవి వైశ్యుల పూర్వవృత్తాంతమును జెప్ప నంత వాసవియు నగరేశ్వరుండును ప్రత్యక్షంబగుటయు నందఱువైశ్యులు నగ్నికుండంబులం జొచ్చి దేహంబులం బరిత్యజించి కైలాసంబుం జేరిరి. అంత నచట రాజమహేంద్రంబున "వైశ్యులగ్నిం జొచ్చిర" ని విని విష్ణువర్ధనుఁడు మరణించె. అతనిపుత్రుండు మిగిలిన వైశ్యగణంబును, రాజ్యం బేలునట్లు వాసవి ప్రత్యక్షంబై చెప్పుటయు నంత వాసవీదేవికిఁ బట్టాభిషేకంబుఁ గావించుటయు మున్నగు విషయంబులు ప్రవర్తిల్లె.

ఇట్లు కథాసంవిధాన మంతయుఁ బౌరాణిక గాథాభూయిష్ఠంబై యున్నను, కథాసందర్భానుసారముఁగ నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనోద్యానసలిలక్రీడాది అష్టాదశవర్ణనల నందందు నిమిడ్చి తన

కృతిని మహాకావ్యముగ నొనర్పఁ గవి యెంతయో ప్రయత్నించియున్నాఁడు.

కవితాధోరణిని వండెందు వ్యాకరణ విరుద్ధపదములు సంకలితము లైనవి. "నిరంకుశాః కవయః" అను లోకోక్తి యిట్టికవివతంసులయెడనే వర్తించుఁగాఁ బోలు. సమయానుసారముగ రసములన్నియు నిందు వెలుఁగొందుచున్నవి. వీరసముపట్ల నారసమును విశేషముగఁ గురిపించియున్నాఁడు.

మఱియు నీ కవివర్యునకుఁ జిత్రకవిత్వము నందుఁ గూడ నుత్సాహ మున్నట్లు తోఁచుచున్నది. గోమూత్రికాబంధము, నాగబంధము, చక్రబంధము, హారబంధము, అష్టదళపద్మబంధము మున్నగు బంధముల వ్రాసి తన బంధకవితాచిత్రినిఁ గనఁబఱచియున్నాఁడు.

మఱియు నేకాక్షర ద్వ్యక్షర త్ర్యక్షరపద్యములును, గర్భకందద్వయ, గర్భచంపక, గర్భసీస, గర్భమత్తేభాది విచిత్రపద్యములఁ జూపియున్నాఁడు.

తనకుంగల వ్యాకరణశాస్త్ర, జ్యోతిశ్శాస్త్ర, వేదాంతశాస్త్ర, అలంకారశాస్త్రాదిక పాండిత్యమును విచ్చలవిడి విదిల్చియున్నాఁడు.

ఈ కవిశ్రేష్ఠుని కవితాశైలిఁ దెలియుటకై కొన్ని పద్యములిం దుదాహరించుచున్నాను.

సీ. శరదంబుధరశంబకరకుంభిక్షీరాంబు
పతిడంబుగల తనుప్రభలవాని,
పికభృంగనికరాంగసుకురంగమదసంగ
రమణీయకాంతివస్త్రంబువాని,
గాంగేయగిరితుంగశృంగారశృంగసం
తతిఁబోలు చేయుగ తలలవాని,
ఖరగాంగఝురభంగవరసంఘరవభంగి
మాగధుల్ వినుతింప మలయువాని,

తే.గీ. నున్నతాసనమునఁ గడు నొప్పువాని,
హారకేయూరకుండల హారివాని
నాదినారాయణుని పెజ్జ రైనవాని,
నెందుకొలు వుండెడుభుజంగనేతఁ గనిరి.

కం. కుందముల్గల కందముల్గల,
కందముల్లోపంగు దంతహస్తరుగశముల్,
కందముల్గల విరహులమది,
కుందముల్లు చేసె మరుఁడు కోమలి కహహా.

చ. అమరసరిత్తరంగకనకాంబుజదివ్యమరందలోలుప
భ్రమరములిప్పురింగలుగుభద్రగజంబులదానధారనిం
పమరఁగఁ గ్రోలుచున్నచోట నానెనొనాఁ గను
పట్టి మేఘముల్,
భ్రమయుచునుండు తచ్ఛ్రవణబంధుర ఘూరితరా
విలాహతిన్.

సీ. కలకంఠశుతిరవోత్కలికావిలాసమా
గమమహారమణీయగరిమగలదు,
అంభోజసత్కుల మభివృద్ధి నొందించు
రహిమించువరశాదమహిమగలదు,
ఘనసుచిత్వము సదాగతియు తత్వంబును
లలితమా కంకణ లక్ష్మిగలదు,
పరమహంసాంచిత భావంబు నమ్ముగదం
బములపద్మాకర ప్రాప్తిగలదు.

తే.గీ. తలప నిన్నది కష్టాభిధానమునకు,
సార్థకముఁ గాంచెనుగదయ్య సచివ దీన,
స్నాన మొనరింపుద మె యని సరసవచన
రచనఁ దెలుపుచు నారాజు రథము డిగ్గె.

సీ. ప్రాక్సతీసీమంతభాగాంతమునఁ జాల
దళుకొందు కేతకీదళ మనంగ
శక్రసీమంతినీశయన సంఘటితమై
చెలువొందురవల పాదిక యనంగ
వేలాధిపతి చెంత వేడుకతో నీచు
సొగసైన మల్లెల సురటి యనఁగ
వరపయోనిధికనత్తరళతుంగతరంగ
రంగాగ్రశుభ్రసారస మనంగ

తే.గీ. తెక యయి తోచి సగ మగుదీరుఁ గాంచి
యంచుఁ గట్టకయును గుంద్ర మనఁగ వెలసి
పూర్ణసద్వృత్తతను విల్చెఁ బొడుపుగిరిని
చారుశృంగారములసీను చందమామ.

ఇట్లే యీ కవివర్యుని కవిత్వమెల్ల లలితము లగు పదజాలములతో నింపగువర్ణనములతోఁ బాఠకుల యుల్లంబుల కుల్లాసంబుఁ గూర్చుచుండు.

కవి తన గ్రంథాంతమునందుఁ దన గ్రంథ మెన్నఁడు సమాప్తి నొందెనో యీ క్రింది పద్యమువలనఁ దెలిపి యున్నాఁడు.

క. ధరకలిశతాబ్దములు సా
గరనిధి నవజలధి సంఖ్యఁగలుగు విజయన
త్సర కార్తిక శుద్ధనవమి
సరసచిదంబరుఁడు దీని సరవి ముగించెన్.

ఇట్టి కవితల్లజాలెందఱో రాయలసీమ (దత్తమండలము) నణఁగి యున్నారో తెలియదు. ముద్రితము లయ్యు ప్రచారముఁ గొందని యుత్తమగ్రంథరాజము లెన్ని యడుగంటుచున్నవో యెవరు చెప్పఁగలరు?

ఈ వాసవీవిలాసమును పునర్ముద్రణముఁ గావించి ఆంధ్రదేశంబునంగల పండితమండలీకరకమలాలంకారముగ నొనర్చు భాగ్యం బే పుణ్యాత్ముఁడవకుఁ గలదో నే నెఱుఁగ. ఒక్క ప్రతిమాత్రము గ్రంథము నాయొద్ద నున్నదని పండితలోకమునకు విన్నవించుకొనుచున్నాఁడను.

ఈ గ్రంథమునుగూర్చిన విమర్శనము లెన్నియేని నింకను వ్రాయవచ్చును. కాని వ్యాసవిస్తరభీతిచే నింతటితో విరమించుచున్నాను.

---

# శ్రీమతి మాగంటి నాగాంబ

(శ్రీ) పురాణం సూర్యనారాయణ తీర్థులు

కొండిక యయ్యెఁ గాపురము గుట్టుగఁ జేసెడి సాధ్వి యంచు నేఁ
బండుగ దర్శనార్థముగ వచ్చితి నాగమగారు! మీ కుమా
రుండు సదా పఠించుచు నరోగత వర్ధిలుఁగాత మెప్డు నా
ధుండు గడించి తెచ్చి పరితోషముఁ గూర్చుచు నుండుఁగాత మె
న్నండును మీ దయారసము నాకపరూపము గాకయుండుతన్.

నాగమ్మవంటి చక్కని, ధీగల మెలనాగ భారతీస్థలిఁ గాదీ
భూగోళమ్మున లే దని, నే గట్టిగఁ జెప్పఁగలను నిజ మిది దేవీ!

ఎందఱో స్వాధీనపతిక, లుందురు సతులందుఁ బ్రాజ్ఞయోగ్యతలందుఱ్
ముం దెన్నఁ దగిన నాగమ, చందముసుందరులయునికి సందియ మంబా!

సందియము లేదు నాగమ, చందంబున మగఁ డొకండె సర్వ మనుచు సా
నందముగఁ గొలుచు చతనిఁ బ, సందుగ వశపఱుచుకొనుటె సౌభాగ్య మనఱ్.

ఇంటిపనులలోను వంటవార్పులలోను కొడుకును లాలించుకొనుటలోను,
పెనిమిటిచిత్తమ్ముఁ గనిపెట్టి యాతనిం గొలుచుచు వశపర్చుకొనుటలోను,
ఆయాయి బంధుల నాదరించుటలోను స్త్రీలకు ముఖ్య మౌ తెలివిలోను,
చెలులకు జీవ మౌ శీలరక్షణలోను తను మనమ్ముల శుచిత్వమ్ములోను.
ముందు మాగంటి నరసయ్య మున్ను వేసి, కొన్న పున్నెంపుఁ జెట్టునకుఱ్ ఫలమ్ము
నాఁగఁ జెప్పంగఁ దగినట్టి నాగమణిని, జెప్పి యప్పయి నొరులను జెప్ప నొప్ప.

నీ యక్కయు నీబావయు, నీ యనుజుఁడు నీ తనయుఁడు నీ పెనిమిటియుఱ్
నీ యిష్టసఖులు నీవును, హాయిగ మనుఁ డంచుఁ దీర్థు లాశాసించున్.
'కార్యేషు దాసి' యను మన, ఆర్యుల శ్లోకార్థమును యథార్థము గాఁగఱ్
కార్యములఁ జూపు నాగమ, భార్య యగుట నరసయ కది భాగ్యముగాదే?

బాగుగఁ జూడఁగాఁబడిరి భార్యలు భర్తలు నెందఱెందఱో
నాగమవంటి భాగ్యవతి నర్సయవంటి యదృష్టవంతు నా
నేఁ గన లేదు లే దని విసీతిగఁ జెప్పుదు బాహు వెత్తి నా
లాగు మఱొక్కఁ డీవిధివిలాసమునఱ్ మతి నుంచఁ డమ్మణీ!

# సంజయు డెవడు?

శ్రీ ఆదిపూడి సోదరకవులు

సంజయుని జన్మవృత్తాంతమును గుఱించి వైశాఖమాస భారతిలో శ్రీ రావూరి దొరసామిశర్మగారు ఒకవ్యాసమును వ్రాసి 'సంజయుఁ డంబాలికాచేటియందు వ్యాసునకుఁ బుట్టినవాఁడు' అని సారాంశము తేల్చిరి. కాని యందలి యాథార్థ్యమును గూర్చి వారే శంకించుకొని 'విజ్ఞులు తమయభిప్రాయంబుం బ్రకటింతురుగాక' యని వ్యాసాంతమున వ్రాసిరి. శ్రీ శర్మగారు కేవలాంధ్ర మహాభారతమును మాత్రమే పఠించుటం జేసియు వారికి వారిపితామహ పితృవాక్యములయం దాదరణము మెండవుటం జేసియు నట్లువేవో యూహించి తమవాదమును నిలువఁబెట్ట హేతువులను వ్రాసియుండిరి. సంజయ జననమరణాదిక వృత్తాంతము వారియెఱుకకు దూరమయ్యెఁ గావున వారేమేమియో వ్రాసియుందురు. వాని కన్నింటికి సమాధానము లీయఁబనిలేదు. సంజయచరిత్రమును మా శ్రీమదాంధ్ర మహాభారత నిఘంటు వెట్లు సంగ్రహించినది యీ దిగువఁ బొందుపఱచుచున్నారము.

సంజయుఁడు ధృతరాష్ట్రుని రథసారథియగు గవల్గణుని కొమరుఁడు.

"సంజయో మునికల్పస్తు
జజ్ఞే సూతో గవల్గణాత్"
(సం. భార. ఆది. ౬౪-౧౩౯)

ఏవం గావల్గణేశ్రుత్వా ధర్మార్థసహితంవచః,
ఉక్తవాన్నగృహీతం వై మయా
పుత్రహితైషిణా"
(సం. భార. సభా. ౧౦౩-౩౯)

గావల్గణిః సంజయస్సూతసూనుః
అజాతశత్రు మవద త్ప్రతీతః.
(సం. భార. ఉద్యో. ౨౩-౩)

గావల్గణేనాధిగచ్ఛామి శాంతిమ్.
(ఉద్యో. ౨౨-౩౦)

ఇట్టి ప్రమాణములచే సంజయుఁడు గావల్గణి యనుట విదితమేకదా!

సంజయుఁడు వయోవంతుఁ డయిన తరువాత ధృతరాష్ట్రునకు రథసారథియు మంత్రియు నయి వాసికెక్కెను. ఇతఁడు సూతకులమున జన్మించినవాఁ డు కాని కేవలవృత్తి సూతుఁడు కాఁడు. ఇతఁడు వినయవంతుఁడు. శీలవంతుఁడు యథార్థవాది. ప్రభుహితపరాయణుఁడు. పండితుఁడు. కౌరవ పాండవక్షేమాభిలాషి. అదియునుంగాక యితండు పాండవులలో ధనంజయునకు బాల్యమునఁ బ్రాణసమానస్నేహితుఁడు. కావుననే సంజయుఁడు దూతగా వచ్చినపుడు ధర్మజుఁడు.

త్వమేవ నః ప్రియతమోఽసి దూత
ఇహాగచ్ఛేద్విదురో వా ద్వితీయః,
అభీక్ష్ణదృష్టోఽసి పురాతన స్త్వం,
ధనంజయస్యాత్మసమః సఖాఽసి.
(సం. భార. ఉద్యో. ౩౦-౬)

ఆప్తో దూతః సంజయ సుప్రియోఽసి
కల్యాణవాక్ శీలవాం స్తృప్తిమాంశ్చ,
నముహ్యేత్త్వం సంజయ జాతు మత్యా
నచ క్రుధ్యే రుచ్యమానోఽపి తథ్యమ్.
నమర్మగాం జాతు వక్తాఽసి రూక్షాం
నోపశ్రుతిం కటుకాం నోత శుష్కామ్,

ధర్మారామా మర్థవతీ మహింస్రా
మేతాం వాచం తవ జానీమ సూత.

(సం. భార. ఉద్యో. ౩౯—౪-౫.)

అని వచియించియుండెను. కావుననే కృష్ణార్జును లేకాంతమున భార్యలతోనుండి యు సంజయునకు దర్శన మొసంగినారు. వ్యాసప్రసాదమున సీతఁడు భారత రణమును గూర్చి సర్వము ధృతరాష్ట్రునకు నివేదింపఁ గలిగెను. వ్యాస ప్రసాదముననే శ్రీకృష్ణుని మహావాక్యము లాలించి యాస్వామి విశ్వ రూపమును సందర్శింపఁ గలిగెను.

భారతయుద్ధానంతరమున ధర్మజుఁడు “వలయుపనులు వెనుకముం దరసి యెఱిం గించుటకును నాయవ్యయంబు లెఱ్ఱఁగించు టకును” సంజయుని మంత్రిగా నియమించు కొనియెను.

శాం. ౧.౩౨౮.

ధృతరాష్ట్రుఁడు విదురునితోడను గాం ధారి కుంతులతోడను దపోవనమునకుఁ బోవు నపు డితఁడుగూడ వారివెంట నడచెను. ధృత రాష్ట్రుఁడు శతయూపరాజర్షి తపోవనమునం దున్న వేళ నారదుం డటకేతెంచి ధృత రాష్ట్రునితో వారికిఁ గలుగుగతులు చెప్పుచు సంజయునిగుఱించి,

“ఆ. వె. ..............................సంజయుం
డతుల నాకలోకగతి వెలుంగు.”

ఆశ్ర. ౨-౫.

అని వచించియుంటచే దేహాంతమున నితఁడు నాకలోకమునకుఁ జనెను. తరువాతఁ గొన్నాళ్లకు ధృతరాష్ట్ర గాంధారీకుంతులు సంజయుఁడును భాగీరథీతీరమునుండి వచ్చుచు దావాగ్నియందుఁ జిక్కికొనిరి. ఉపవాస క్లేశ మునఁ గదలమెదలలేని స్థితిలోనున్న ధృత రాష్ట్ర గాంధారీ కుంతులు ముప్వురును మర ణించుటకు సిద్ధపడిరి. అపుడు ధృతరాష్ట్రుఁడు సంజయుని దొలఁగిపొమ్మని బ్రతిమాలెను. సంజయుఁడు వారిని రక్షింపలేకుండుటచేతను వారి కట్లు శరీర త్యాగం బవశ్యం బవుటను వారిని విడిచి తప్పించుకొని హిమవత్పర్వత మునకుఁ జని యటఁ గాలగతి నొందెను.

విదురునివలె సంజయుఁడు విద్యా వంతుఁడు, జ్ఞాని, భగవత్కృపకుఁ బాత్రుఁడు, ప్రభు భక్తిపరాయణుఁడు; ఎల్లప్పుడు ధృత రాష్ట్రునకు హితము చెప్పువాఁడు. రాజు తాను జెప్పు హితమును గ్రహింప కుండినను నాతనియందు గల ప్రభుభక్తిచే నాతని ద్యజింప క యామరణము సేవించి కృతార్థుఁ డైన వాఁడు. సుగుణరాశి యగుటచేతనే సంజ యుని వ్యాసుఁడు మునికల్పుఁడని వచించెను.

పండితులు సత్యమును గ్రహింతురు గాక.

# కన్యాశుల్కం సమీక్షణ

## [మొదటి భాగము]

శ్రీ సోమయాజుల వెంకటరామమూర్తి

కీర్తికాయులైన శ్రీ గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు తమ తుదివిన్నపంలో—

"వర్తమానాంధ్ర భాషా ప్రయోజనం గురించి పాటుబడుతూ ఉన్నాను. వ్యావహారిక భాషాగౌరవమును నిలబెట్టడానికి నేను ప్రయత్నిస్తూంటే ఆంధ్రసాహిత్య పరిషత్తువారు దానిని పడగొట్టడానికి పనిచేస్తూ వచ్చారు. మొదట నేనూ నామిత్రుడు గురజాడ అప్పారావూ, మాకుతోడుగా మరిద్దరుముగ్గురు మాత్రమే ఈ ఉద్యమము ప్రారంభించాము"

అంటూ సెలవిచ్చారు — దీన్నిబట్టి కీ. శే. శ్రీ గురజాడ అప్పారావుగారు గిడుగువారికి వ్యావహారిక భాషను పెంపొందించడంలో మొదట్నుంచీ చేదోడు వాదోడుగా ఉంటూండేవారని విశదంగా తెలుస్తూంది. ఆంధ్రభాషా ర్ణవమథనంలో రామమూర్తిగారికి అప్పారావుగారు సహాయభూతులై వ్యావహారిక భాషామృతాన్ని పైకి తీసుకొచ్చారనికూడా స్పష్టం. అప్పారావుగారు నవీన మార్గంలో నవీనమైన సజీవమైన వ్యావహారిక భాషలో ఆనాటి సాంఘికసమస్యలతో నిండియున్నట్టి 'కన్యాశుల్కం' అనే మిన్నకావ్యాన్ని సృష్టించి ఆంధ్రలోకానికి అందిచ్చారు. అందుచేత రసపుష్టిగల ఈనాటకరాజాన్ని పరిశీలించి బాగోగులు నిర్ణయించడం సముచిత మని నేను భావిస్తున్నాను.

అదిగాక శ్రీ తెలికిచెర్ల వెంకటరత్నంగారిచే ప్రకాశితమైన శ్రీ గిడుగు రామమూర్తిగారి సప్తతి తమ జన్మదినోత్సవప్రచురణములలో మొదటిదగు వ్యాస సంగ్రహమునందు వేదుల సత్యనారాయణశాస్త్రిగారు 'హాస్యం' అనే శీర్షికతో ఒకవ్యాసం వ్రాస్తూ, అందులో, "కన్యాశుల్కం నాటకం అంటారు కొందరు. కాని నాబుద్ధికి ప్రహసన మనడమే మంచిదని తోస్తుంది. కథాకల్పనలో, వస్తు విన్యాసములో, హాస్య ప్రతిపాదకములైన సంఘటనలుగాని, అంగ ప్రత్యంగముల ఐక్యముగాని కనబడలేదు. ఏ రంగమున కారంగము ఒక ప్రహసనముగా ఉంటుంది." అని వ్రాశారు. ఈ పైవిమర్శలోని మంచిచెడ్డలుకూడా నిరూపించడం నాయొక్క రెండవ ఆశయము.

నవీన ఆంధ్రములో ఉద్గ్రంథంగా ఎన్నికోదగిన కన్యాశుల్కంమీద సమీక్షణం వ్రాయడం నాపట్ల సాహస కృత్యమే అయినప్పటికీ, నాకు ఆనాటకరాజము సందుగల పరిచయ విశేషమున్న, విశేషించి అభిరుచియున్న నన్నీ కృత్యానికి పురిగొల్పినవి:

ప్రస్తుతం ఈ మొదటివ్యాసంలో కన్యాశుల్క నాటకకాల నిర్ణయము, కథా సంగ్రహమూ, కథకట్టూ వీనిగూర్చి విశదీకరింప దలచుకున్నాను.

### ౧ కాలనిర్ణయం

కన్యాశుల్క కథాకాలం నిర్ణయించడానికి మనకు నాటకంలోనే ముఖ్యమైన ఆధారాలు ఉన్నవి:

౫-వ అంకంలో ౪-వ రంగమున, హావల్దారు అచ్చన్న "మొన్నగాక మొన్న యింగిరీజ్ రుషియా దేశానికి దండెత్తిపోయి రుషియాను తన్ని తగలలేదా?" అన్నాడు.

ఇది ౧౮౫౪-౫౬ లో జరిగిన క్రిమియా యుద్ధానికి వర్తిస్తుంది, స్పష్టంగా. క్రిమియా యుద్ధంలోనే ఇంగ్లీషువారు రష్యావారిని సెబాస్టపోల్‌నుండి తరిమివేయడం మొదలైన సందర్భాలన్నీ. అందుచేత నాటక కాలం క్రిమియాయుద్ధం తరవాత అనగా ౧౮౫౬ కు తరువాతే నని స్పష్టమౌతూంది.

ఇదికాక ఇంతకంటె ఖండితంగా నాటక వస్తు వునుబట్టే మనం కాలనిర్ణయం చెయ్యడానికి చక్కని అవకాశం ఉన్నది.

చూడండి: ౭-వ అంకం, ౨-వ రంగంలో—

అనగా విశాఖపట్నం డిస్ట్రిక్టకలెక్టరుగారి కోర్టు లో — అగ్నిహోత్రావధాన్లు గిరీశంమీద — బుచ్చ మ్మను లేవదీసుకు పోయినందుకు — ఏబ్డక్షన్ కేసు విచారణకు వచ్చినప్పుడు ఏబ్డక్షన్‌చార్జి ఋజువుచేసే నిమిత్తం రామప్పపంతులు సహాయంతో ఒక దొంగ జాతకం బనాయిస్తాడు. అందులో బుచ్చమ్మ జననం 'భావ' సంవత్సరంలోనని ఉంటుంది. 'భావ' అంటే ౧౮౭౪-౭౫ అవుతుంది. క్రీస్తుశకం లెక్క ప్రకారం-

ఈ జాతకంలో అవధాన్లు బుచ్చమ్మవయస్సు ౧౬ సంవత్సరాలకులోపు అని ఋజువు చెయ్యడానికి ప్రయత్నం.

అనగా బుచ్చమ్మకు ౧౫ సంవత్సరాలు అను కుంటే నాటకకాలం ౧౮౭౫+౧౫=౧౮౯౦ కావాలి

అందుచేత మనం, ఈ కథావస్తువు ౧౮౯౦ సం వత్సరానికి చెందినదని ధీమాగా చెప్పకోవచ్చు.

దీనితో మనం ౧-వ అంకము ౧-వ రంగము నాస్తికథ వెంకటేశం చదివిన స్కూలుకి క్రిస్మస్ సెలవలిచ్చిన సాయంత్రం ప్రారంభ మౌతూంది. అనగా డిసెంబరుమాసం.

ఇప్పుడు మనం నిక్కచ్చిగా ఒక్క సంగతి చెప్పొచ్చు. కన్యాశుల్క నాటకకథ ౧౮౯౦-వ సంవత్స రంలో డిశంబరుమాసంలో ప్రారంభ మౌతూందని—

## ౨ కథకట్టు (Plot)

కన్యాశుల్కకథ మొట్టమొదట విజయనగరంలో కాకా సాయంసమయాన్ని ప్రారంభ మౌతుంది. అక్కణ్ణుంచి స్థలం కృష్ణారాయపురానికి మారుతుంది.

ఈ కృష్ణరాయపురంలోనే గిరీశం, బుచ్చ మ్మల ప్రేమలతకు బీజం నాటుతాడు నాటకకర్త. ఆ మొలకెత్తి క్రమంగా పెరిగి, తుదకు, అగ్ని హోత్రావధాన్లు కుటుంబంతో పెళ్లికని రామచంద్ర పురానికి ప్రయాణ మౌతూంటే బుచ్చమ్మ గిరీశంతో లేచిపోవడమనే పరిణతిని చెందుతుంది. ఇది ఒక ప్రధా నమైన కథకట్టు.

దీని వెనువెంటనే రామచంద్రపురంలో లుబ్ధావ ధాన్లు మాయసుబ్బిని (అనగా ఆడవేషంలోవున్న మహేశాన్ని వివాహం చేసుకోడపుపట్టు ' (Plct) నడుస్తూంటుంది. ఈ ప్లాటుకు కీలకంగా మధురవాణి వుంటుంది. మధురవాణీ, కరటకశాస్త్రీ కథకు సూత్ర ధారులై వుంటారు.

పైనిచెప్పిన రెండుకథపట్టులూ విశాఖపట్నంలో కేసుల రూపేణా కలుస్తాన్నవి.

పెనవెట్టుకపోయిన ఈ రెండుకథా సూత్రాలు తుదకు మధురవాణి ప్రయత్నంచేతనే మళ్లా విడిపోతవి. రెండు ప్లాటులలోనూ Denoument — అనగా గూఢంగా వుండినకథను స్పష్టీకరించడము — మధుర వాణివల్లనే జరుగుతుంది.

## ౩ కథావస్తువు (సంగ్రహంగా)

గిరీశానికి విజయనగరంలో ఎక్కడా వెల పుట్టదు. ఎటు చూచినా అందరికీ బాకీలే. అందుచేత వెంకటేశానికి సెలవుల్లో చదువు చెప్పేమిషతో, వెంక టేశం గ్రామమైన కృష్ణారాయపురానికి పుడాయిం చేస్తాడు. అల్లా వెళ్లిపోయేముందు మధురవాణికి పార్టింగ్ విజిట్ ఇస్తాడు — ఆ సందర్భంలో రామ ప్పంతులు మధురవాణియింట వుంటాడు. చిత్రమైన సంఘటనము.

కృష్ణారాయపురంలో వెంకటేశం అక్క బుచ్చమ్మ అనే బాలవితంతువు ౧౭ ఏళ్లవయస్సులో ఉంటుంది. ఆమెయొక్క సౌందర్యం గిరీశం హృదయాన్ని ఆకర్షించి ఉద్రూత లూగించేస్తుంది. అగ్నిహోత్రావ ధాన్లు తన రెండోకూతురైన సుబ్బిని, షష్టిపూర్తి అయి నట్టేన్ని, రామచంద్రపురం కాపురస్తుడూ అయిన లుబ్ధావధాన్లుకి ముడెట్టడానికి నిశ్చయించేస్తాడు. అతని భార్య వెంకమ్మ పట్టుపట్టి చస్తా నంటుంది. అవధాన్లు చలించడు. వెంకమ్మ అన్నగారు కరటకశాస్త్రీ ఏదో ఒకఉపాయం పన్ని అసంగతమైన ఆ పెళ్లి తప్పిస్తానని

ఆమెకు ధైర్యంఇచ్చి శిష్యుడు మహేశంతో కూడరామ చంద్రపురం వెళ్లి, నాటకాల్లో వేషాలు వేసేఅలవాటు వుంది కాబట్టి, తానొక గుంటూరు శాస్త్రిలై, మహేశాని కొక ఆడవేషం వేయించి, రామప్పంతులున్ని వశం చేసుకుని, మధురవాణికి నిజం చెప్పి, చౌకగా రూ. ౧౨౦౦ లకు బేరం తెగగొట్టి మాయసుబ్బిని (మహేశాన్ని) లుబ్ధుని కిచ్చి వివాహకాండ నడిపించేసి పరారీ అయిపోతాడు.

మహేశంకూడా కొన్నాళ్లు అక్కడే వుండి, ఒకనాడురాత్రి రాద్ధాంతంచేసి, మధురవాణి యింటికి పారిపోయి, మధురవాణిసహాయంతో దాసరివేషం వేసుకుని క్రొత్తగ్రహారం పోయి గురువుగార్ని చేరుకుంటాడు.

రామచంద్రపురంలో ఈకథ ఈతీరున నడుస్తుంటే, కృష్ణారాయపురంలో, గిరీశం ముక్కోపి రైన అగ్నిహోత్రావధాన్లను చమత్కారంగా జేబులో వేసుకుని, బుచ్చమ్మతో రహస్యంగా సరససల్లాపాలు ఆరంభించుతాడు.

ఆమెకు గిరీశంమొదల నమ్మకం కుదురుతుంది. ఇద్దరిమధ్యను వ్యాపారం కొంతవరకూ చనువుగానే జరిగి పోతూంటుంది. ఇంతలో గిరీశం లుబ్ధావధాన్లకు పినతల్లి కొడుకని వెంకమ్మకు తెలిసి, పెళ్లి తప్పించమని గిరీశంకాళ్లా వేళ్లా పడుతుంది.

గిరీశం లుబ్ధావధాన్లకు ఒక పెద్దఉత్తరంకూడా వ్రాస్తాడు ; కాని లాభం లేకపోతుంది. అప్పుడు గిరీశం — ఒకనాడు - రహస్య సంభాషణలో బుచ్చమ్మతో, "మీ చెల్లెలికి పెళ్లి తప్పించేసాధనం నీ చేతు లోనే వుంది" అంటాడు.

చూడండి: ౪-వ అంకం, ౫-వ రంగములో గిరీశం, బుచ్చమ్మతో, "పెళ్లికి తర్లి వెళుతూన్నప్పుడు, రెండోనాడు రాత్రి బండీవాడిచేతులో నాలుగు రూపాయలు పెట్టి, నీబండీ తోవతప్పించి, అనకాపిల్లి రోడ్డులో పెట్టిస్తాను...మనం పుడాయించిన మర్నాడు తెల్లవారగట్ల, నీబండీ కనబడక కలవిలపడి, మీవాళ్లు నెత్తీనోరూ కొట్టుకొంటారు. నీ చెల్లెలు పెళ్లి ఆగి పోతుంది.:.."

అని బుచ్చమ్మని బుట్టలో వేసుకుంటాడు.

అనుకున్నట్టుగా ప్రయాణంలో రెండోనాటి రాత్రి గిరీశం గుర్రందిగి, బుచ్చమ్మ బండీవాడికి లంచ మిచ్చి, బండీ ఎక్కి, బండీని అనకాపిల్లిరోడ్డుకి మళ్లించేసి, రామవరం వెళ్లిపోతాడు బుచ్చమ్మను తీసుకుని. ఆటుతరువాత పెళ్లివారు తెల్లవారగట్ల రామచంద్ర పురం చెరువుగట్టున దిగుతారు. అగ్నిహోత్రావధాన్లకూ రామప్పంతులుకూ ప్రథమ సమావేశమౌతుంది.

అగ్నిహోత్రుడు లుబ్ధావధాన్లకు పెళ్లిఅయి పోయిన సంగతి తెలుసుకుంటాడు. ఇదంతా వృధా ఖర్చు అయిపోయిందికదా అని చింతిస్తూ వున్న సమయానికి, గోరుచుట్టుమీద రోకలిపోటు అన్నట్టుగా— తన కూతురు బుచ్చమ్మ గిరీశం మేష్టరుతో లేచిపోయిం దన్నవార్త తెలుస్తుంది. చిందులు తొక్కుతాడు. రామప్పంతులు సలహాతో రెండుకేసులు బనాయిస్తాడు

౧. డామేజీస్‌కి కేసు, లుబ్ధావధాన్లమీద.

౨. 'Abduction' కేసు — గిరీశంమీద.

ఈకేసు లిలా వుండగా లుబ్ధావధాన్లమీద పోలీసువాళ్లు 'భార్యని (పారిపోయిన మహేశాన్ని) చంపినట్టుగా, దొంగ ఖూనీకేసు బనాయిస్తారు. కేసు లన్నీ విశాఖపట్నంలో విచారణకొస్తాయి. ఖూనీకేసు విషయంలో సౌజన్యరావుపంతులు లుబ్ధావధాన్ల పక్షాన్ని చాలాశ్రద్ధగా పని చేస్తూంటాడు. ముసలాణ్ణి తప్పించ డానికి ఎక్కడా ఆస్కారం దొరకదు. తుదకు మధుర వాణి అర్ధరాత్రిని పురుషవేషంతో వెళ్లి సౌజన్యరావు గారితో పెళ్లికూతురు మగవాడనీ, గుంటూరు శాస్త్రిలు కరటకశాస్త్రి లనీ చెప్పేస్తుంది.

దాంతో ఖూనీకేసు మంచులాగు మాయమై పోతుంది.

అప్పుడు గిరీశంకూడ సౌజన్యరావుగారి ఇంటే వుంటాడు — అతన్నికూడ టోపీకొట్టి. మధురవాణి వల్లనే సౌజన్యరావుకి గిరీశం వట్టిపోకిరీఅని తెలుస్తుంది. గిరీశాన్ని ఇంట్లోంచి వెడలగొట్టేస్తాడు పాపం! గిరీశం తిరిగీ, ప్రపంచమనే ప్రచండమైన పెనుగాలిలో ఒక చిన్న ఆకుగా అటూ ఇటూ ఎగిరిపోయేస్థితికి వస్తాడు.

ఇది అసలు కథాకాండము. దీనికి కొమ్మలూ, శాఖలూ చాలా ఉన్నవి. వీనిలో నాటకకర్త సంఘ దోషాలన్నీ ఎత్తిపెట్టాడు. ఇవన్నీ చదివి ఆనందించ డానికి ఉపచరిస్తవి. కన్యాశుల్కాన్ని రంగస్థలంమీద ప్రదర్శించే ఉద్దేశముంటే ఒక 3 గంటల ప్రదర్శనంగా మార్చవచ్చును. కొమ్మలు కొట్టేసి, అసలు మూలానికి భంగం రాకుండా — రసభంగం వుండదూ, కథా చెడదు.

ఈ విషయంలో నేనూ, నామిత్రులూ కొందరూ కలిసి అల్లాంటి Stage Edition సిద్ధంచేశాము. ఆ ప్రకారం కన్యాశుల్కాన్ని అనేకమారులు ప్రదర్శించాము కూడాను.

పైని నేను ఉదాహరించిన విధంగా కన్యాశుల్కం కథ పటుత్వమైన సూత్రాలమీద బింకముతో నడిచిం దని స్పష్టమౌతూన్నప్పుడు అంగప్రత్యంగముల ఐక్యము కనబడదు అని వేదుల సత్యనారాయణశాస్త్రిగారు వ్రాయడం సమంజసంగా లేదని చెప్పాలి.

అయితే ఒకసంగతి — ఏదో ఉబుసుపోక - నాటకంలో అక్కడా అక్కడా నాలుగురంగాలు నవ్వడానికని చదివేసి, తాత్కాలికంగా నవ్వి పోయేవాళ్లకి అంగప్రత్యంగముల ఐక్యత ఎప్పటికీ కనుపించదు. సావకాశంగా, రసాన్ని గ్రహింద్దామనే వుద్దేశం కలిగియుండి, దీక్షగా కూర్చుని, చదువుతే కథావస్తువు యొక్క సంపూర్ణత్వం, తెగి,విరి స్పష్టమౌతాయి.

అంతే కాకుండా కన్యాశుల్క నాటకాన్ని కేవలం హాస్యానికి ఉదాహరణంగా చెప్పడంకూడా అంత సరిగా వుండదని నా యూహ.

హాస్యరసప్రధానమై యుండొచ్చు. అసలు నాటకం పేరుపట్టి చూస్తేనే సంఘంలో పెచ్చు పెరిగిపోయిన ఒకానొక దురాచారాన్ని ఎత్తి నిరూపించ డానికి ఏర్పడిం దీ నాటకం.

ఆ సందర్భంలో లుబ్ధావధాన్లవంటి ముసలి పెళ్లికొడుకునూ, ధనలోభంచేత కన్న కూతురిని కాటికి కాళ్లుచాచుకున్న వాడికి కట్టడానికి తయారైన అగ్నిహోత్రావధాన్లనూ చూచి, వాళ్లు కేసుల్లో నలిగిపోవడం గమనిస్తే, చివరికి మనకు విషాదం, జాలి, సంఘం యొక్క హైన్యత తెలిసి కోపం, ఇన్ని చిత్తవృత్తు లుత్పన్న మౌతవి.

ఈ విషయాన్ని ఇమిడ్చి, ప్రత్యేక పాత్రపోషణ కూర్చి నేను మరోభాగంలో వ్రాస్తాను.

---

# ముక్తులకు కర్తవ్యము కలదా?

శ్రీ ఓగేటి వెంకటసుబ్బయ్యశాస్త్రి

ముక్తులకు కర్తవ్యము కలదా లేదా యను మీమాంసయందు భాగవతపురాణము నందలి యొకవచనమును, ఆవచనమునకు వ్యాఖ్యాతలు చేసిన వ్యాఖ్యానమును ప్రమాణముగా గైకొనుట సమంజసము కానేరదని ప్రథమమున చెప్పదగియున్నది. ముక్తులకు గూడ కర్తవ్యము కలదని భాగవతములో నున్న యెడల నది భాగవతమతమగును కాని వేదమత మెన్నటికిని కాజాలదు. "శ్రుతిస్మృత్యోర్విరోధే శ్రుతిర్బలీయసీ' కదా. భాగవతము పురాణము.

జ్ఞాతృజ్ఞానజ్ఞేయ విహీనమును, పుణ్యపాపాదిద్వంద్వ విరహితము నగు పదము ముక్తి. ఇట్టిపదము నొందినవారు ముక్తులు. తదితరులు ముముక్షువులు, సాధకులు.

'నిరస్తవిషయాసంగం సంనిరుద్ధం మనో హృది
యదా యాత్యాత్మనో భావం తదా తత్ పరమంపదం'
— అమృతబిందూపనిషత్తు.

ఈ మంత్రమున చెప్పబడిన 'ఆత్మనో భావం' కలిగినవాడు ముక్తుడు. ఇట్టి అద్వైత సిద్ధికలిగిన వానికి భగవన్నామసంకీర్తనలు, విధినిషేధము లున్నట్లు ఒక్క ప్రమాణమైన చూపగలరా?

మోక్షమనగా అజ్ఞాననివృత్తియే- 'యదాపశ్యః పశ్యతేరుక్మవర్ణం కర్తారమీశం బ్రహ్మయోనిం తదా విద్వాన్నామరూపే విహాయ పరాత్పరం పురుష ముపైతి'. మరియు హృదయగ్రంథులు వీడినప్పుడు పురుషుడు అమృతుడగునని గూడ కలదు. (ముండక 3)

దేహపాతమైనగాని సాయుజ్యము కలుగదను నియమము వేదాంతములయందు లేదు. 'ఇహచేదవేదీదథ సత్యమస్తి' ఇత్యాది వాక్యములు ఈ జన్మమునందే పరమాత్మ సాక్షాత్కారము పొందవలెనని ప్రబోధించుచున్నవి. జీవునావరించుకొన్న అజ్ఞానమును నివారించి, స్వకీయ అఖండ సచ్చిదానంద స్వరూపమును బోధించుటయే శ్రుతుల ఉద్దేశ్యము. సాయుజ్యమనగా అన్యముగాదు. రెండువస్తువులున్నగదా సాయుజ్యము. కాని ఉన్నది ఒకేవస్తువు. జీవాత్మ రెండవవస్తువు లేదా యని యడుగవచ్చును. కాని జీవునికి జననమరణములు చెప్పబడి యుండలేదు. 'అజోనిత్యశ్శాశ్వతోఽయం పురాణః' అనిభగవద్గీత. వేదాంతములయందు బ్రహ్మ, ఆత్మ పర్యాయపదములుగా నుపయోగింపబడినవి. 'న సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనః కామాయ సర్వం ప్రియంభవతి 'అని చెప్పుచు 'ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యః' అని అభేదముగా చెప్పినాడు. 'యత్రసర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్' అని గూడ చెప్పియున్నాడు.

కావున స్వస్వరూపసంధానమే మోక్షము. స్వస్వరూపసంధానము కలిగిన ముక్తుడు బ్రహ్మమే యగుచున్నాడు. బ్రహ్మ

మైనందువలన స ర్వ ము నగుచున్నాడు. "అహం మనురభవం, అహం సూర్యశ్చ" అని చెప్పగలవానికి కర్తవ్యాకర్తవ్యములు, విధి నిషేధములు నుండునా? ము క్తుడైనతరువాత గూడ దేవతామూర్తియొక్క అనంతకల్యాణ గుణవిశేషములను కీర్తించవలె ననుట కేవలము ద్వైతబుద్ధివలననైయున్నది. ముక్తుడు 'ఆత్మరతిః ఆత్మక్రీడః'ఆత్మయే అతనిలోకము.

'ఉత్తమశ్లోకపదం సాక్షాత్ పరతత్వ బోధకమే అనుకోరాదా'అని ప్రశ్న వేయబడినది. 'నివృత్తతర్ష' శ్లోకమున నుపయోగింపబడిన విశేషణములవలన నిట్లు తలప వీలు లేకున్నది. అనంతకల్యాణగుణములు గల వాడు మాయావియగు ఈశ్వరుడుగాని పరబ్రహ్మము కాజాలడు. ఈ ప్రకరణమునందు మాయామానుషవిగ్రహుడగు కృష్ణునిక్రీడ లభివర్ణింపబడుచున్నవి.

ఆత్మ సత్యంజగన్మిథ్య వాదములోనికి దిగితే సిద్ధాంతము చేయువారు, పూర్వపక్షము చేయువారు, భాగవతము, ఉపనిషత్తులుగూడ మిథ్యకావలసి వస్తుందేమో యని శ్రీ వెంకటశాస్త్రిగారిభయము అస్మదాదులకు అన్నీ సత్యమే, కాని ముక్తులవిషయముగదా మనము విచారించుచున్నది. ముక్తులగువారికి మీభాగవతమువలన, మీ ఉపనిషత్తులవలన కించిత్తైన ప్ర యో జ న ముండునా? "గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః...త్యజేద్గ్రంథమశేషతః" అని గదా చెప్పఁబడియున్నది. ఒక్క గ్రంథమును మాత్రమేకాదు త్యజింపవలసినది; ఏమనస్సుతో ఆత్మసాక్షాత్కారము పొందుచున్నాడో ఆ మనస్సునుగూడ త్యజింపవలెను.

ఇట్టివాడు ఒక ఉపనిషత్తు. అతడే సృష్టికర్త. అతడే బ్రహ్మ విష్ణు మహేశ్వరుల మూలపువేల్పు. అతడే సూర్యుడు,చంద్రుడు, వేదములు. అట్టియెడ నీద్వైతముతో నతని కేమి ప్రయోజనము ?

ఇంక పోతరాజుగారి అనువాదము విషయమై కొంచెము చెప్పదగియున్నది. శ్రీ ధ ర స్వా ము ల వా రి వ్యాఖ్య పోతన్న కాలమునకే ప్రచారములోనికి వచ్చియుండెను. పోతన్నమాత్రమేకాక యితర భాగవతానువాదకు లందరును శ్రీధరస్వామి వ్యాఖ్యానమును అనుసరించియే తమగ్రంథమును రచించిరి. ఈ విషయము విపులముగా ఆనందాశ్రమగ్రంథరత్నమాలవారు ప్రచురించిన భాగవతపీఠికలో తేవప్పెరుమాళ్లయ్యగారు చర్చించియున్నారు. వ్యాఖ్యానమునందలి భావమునుమాత్రమేకాక, పదములను గూడ పోతరాజు గ్రహించియున్నాడు. ఇట్టి సందర్భమున ఈ శ్లోకమునకు శ్రీధరుని వ్యాఖ్యానము పోతన్న చూచియుండకపోడు. చూచి, చర్చించి, వేదాంతసారసర్వస్వమగు నద్వైతమునకు హానికలుగునని భ య పడి ముక్తు లని వ్రాయక ముముక్షువులని వ్రాసియుండనోపు. పోతన్న ఈ శ్లోక వ్యాఖ్యానమునందలి ఈ ఒక్కపదముమాత్రమే కాక మఱియొక పదమువిషయమై శ్రీధరుడు చేసిన వ్యాఖ్యానమునునిరాకరించెను.'పశుఘ్నుడు' అని మూలములోనుండ దానిని యితరవురు వ్యాఖ్యాతలును బహూకల్పించి'అపశుఘ్నుడు' గా పదవిభాగముచేసిరి. సంధిలో పశుఘ్నుడు కావచ్చును; అపశుఘ్నుడు కావచ్చును. అపశుఘ్ను డన్నచో స్వారస్యముగూడ కలదు. ఆత్మఘాతకులను నిందించు వచనములు

వేదాంతముల యందెన్నేని కలవనుట ప్రసిద్ధము; కానిసర్కసుఫీటుచేసి సాధించినట్లు స్థాపించిన ఈ పదమునుగూడ పోతన్న నిరాకరించినట్లు గానవచ్చెడిని.

వ్యాఖ్యాతల వ్యాఖ్యానము శ్రుతిస్థానాపన్నమనీ, పోతరాజు అనువాదం స్మృతిస్థానాపన్నమనీ శాస్త్రిలుగారు వ్రాసినారు. కాని కొన్ని పట్టుల మూలము కంటెగూడ బాగుగా పోతన్న గ్రంథము వ్రాసియున్నాడు. 'మరియు కేవలకావ్యసరణికి సరసములుగా దోపని తత్త్వవిషయములనుగూడ నతిపేశలకవనంబున హావణించి, మనోహరములుగా దోపించుటయం దీకవిశిఖామణి మిక్కిలి నిపుణుడు' అని పెరుమాళ్లయ్యగారు వ్రాసియున్నారు. కావున వ్యాఖ్యాతల వ్యాఖ్యానముకంటె అనువాదమును తక్కువగా నెంచుట సమంజసము గాదు. సాక్షాత్తు రామభద్రునిచే పలికింపబడిన గ్రంథము, పరమభాగవతుడును, మహాజ్ఞానియునైన పోతరాజుగారిచే వ్రాయబడినగ్రంథము శ్రుతిస్థానాపన్న మనుట నిస్సంశయము. మహర్షియగు పోతరాజు రచించిన గ్రంథమంతయు మనకు లభించి యుండినచో మూలము కంటె నది యెంత బాగుగా నుండెడిదో!

కాలక్షేపార్థము ముక్తులకు భగవద్గుణానువాద మవసర మని శ్రీ వేంకటశాస్త్రిగారు తలచుచున్నారు. కాలాతీతునికి కాలకారునికి, దేశ, కాల, వస్తుపరిచ్ఛేదశూన్యునికి గూడ కాలక్షేపమునకై యొక వ్యాసంగము, వ్యసన మవసరమనుట హాస్యప్రసంగమగును. 'ఉపాధి యున్నదిగదా! ఉపాధి పోవువరకు నేదోపని అతడు చేయుచుండవలదా?' యని ప్రశ్నింపవచ్చును. ముక్తుడగువాడు తా నేమియు చేయుట లేదని స్పష్టముగా నెరుంగును. ఈ పనులన్నియు ప్రకృతిచే జేయబడుచున్నవి కాని తా నేమియు చేయుటలేదను సత్యము నతడు గ్రహించెను. ఈ అహంకారము నశించిన వెనుకనే అతడు ముక్తుడయ్యెను. ప్రారబ్ధము అనుభవింపబడి క్షయమైనప్పుడు దేహపాతమై యతడు బ్రహ్మమే యగుచున్నాడు. ఉపాధియుండుటవలన ఆత్మస్వాతంత్ర్యము యించుకంతయు కొరవడదు. సిద్ధులగు దత్తాత్రేయాదులు 'నతే దేహం కదాచన' అని ఎలుగెత్తి చాటుచుండుట వినమా?

ముముక్షువునకు భక్తియోగము, నామకీర్తనము అవసరమే. కాని వేమన్న యన్నట్లు 'మాట లుడుగకున్న మంత్రంబు దొరకదు' జ్ఞానముకలిగినగాని ముక్తి చేకూరదు. కర్మలు, ఉపాసనలు, దేవతాస్తోత్రములు చిత్తశుద్ధికేర్పడినవి. జ్ఞానమున కవి మార్గములు. జ్ఞానము లభించిన వెనుక ముక్తి కరతలామలకమగును.

ఈ కారణములచేత 'ముక్తులచేత గూడ శ్రీహరి గానము చేయబడుచున్నాడు' అను వచనమును ఉత్కర్షా వాచకముగా గ్రహించి యూరకుండుట మంచిది. భాగవత శ్లోకము నాధారము చేసుకొని వేదాంతార్థమును నిర్ణయింపబూనుట కుందేటికొమ్ము సాధించిన ట్లగును.

'ఇంక వగవ నేల ఏకాంత బుద్ధిని,
హరిహరాదులందు నాశలుడిగి,
శాంతబుద్ధి నుండ సమకూరును సుఖంబు
విశ్వదాభిరామ వినరవేమ !'

# ఇండియా పరిపాలన: ఆర్థిక పరిస్థితులు

శ్రీ పొన్నపల్లి కృష్ణమూర్తి

ప్రపంచ పంచఖండము లన్నియును నొకదాని కొకటి భూసంధులవలన కలిసియుండకపోయినను, వాణిజ్యవ్యాపారముల ననివార్యభావసంబంధపూరితమై యున్నవి. పంచఖండముల మొత్తమున నీనాడు నూట డెబ్బదికోట్ల మానవులు వివిధదేశభాగముల పాలుపొందుచున్నారు. వారివారి యుత్పత్తి విధానములు, ఆర్థిక వ్యవహారములు, భేదములతో కూడియున్నను, వాని యందలి లోపములను ఎవరికి వారు, ప్రథమస్థానములో నున్నామని సవరింప ప్రయత్నింపరు. అట్టి ఆర్థికవ్యవహారములగురించి ఇట కొలదిగ చర్చింతును.

మన హిందూదేశమందలి నలువదికోట్ల జన సంఖ్యయందును, విద్యావిహీనులు మెండు. రత్నగర్భ యని పిలువంబడు భారతవర్షమున, భాగ్యమనుభ వించుట కను విద్యకొరవడిన మిగుల శోచనీయము.

మత వైషమ్యములకు మూలకారణమైన హిందూదేశభాగ్యమును, నిప్పటికప్పుడే మూడువందల వత్సరములనుండి బ్రిటిషువారు అనుభవించుచున్నారు. పన్ను లధికముగా వేయుచు, ప్రజలను వత్తిడిచేసి వసూలుచేయుచున్నారు. కాని దాని వినియోగము మాత్రము వాంఛనీయేతరము. మన మిచ్చుపన్నును మనకొరకేవిధముగా నుపయోగించుచున్నారో పాఠకులు తెలిసికొనగల్గుటకు, యిందు కొన్ని లెక్కలను (Statistics) పొందుపరచుచున్నాను. ౧౯౨౫-౨౬ సంవత్సరము లందలి లెక్కప్రకారము మీక్రింది వ్యయము విదిత మగుచున్నది.

౧. సివిలుపరిపాలన ... ... ... ౩౯.౨%
(పోలీసు, రివిన్యూఉద్యోగస్థులకు, కోర్టులకు)

పైన చెప్పబడిన సివిలుపరిపాలనఖర్చులో చేరియున్న దేననగా, విద్యకు ౭.౨%, ఆరోగ్యమునకు ౨.౨౮%, ప్రజారక్షణకు ౧.౨౫% మాత్రమే. అనగా యొక్క సివిలుపరిపాలనా ఖర్చు ౨౯%.

౨. సైనికదళములకు ............ ౩౯.౫%
౩. ఋణములను తీర్చుటకు ౧౫.౨%
(Debt Services)
౪. ఇతర ప్రయోజనములకు ౬.౧%

మొత్తము ౧౦౦

ఇట్లు మన మిచ్చుపన్నులో యిచ్చినవారి సౌకర్యేతరములకు వ్యర్థప్రయోజనములకు, ఎక్కువ ఖర్చగుచున్నది. ఇందు ప్రథమస్థానము నాక్రమించు మిలిటరీని గురించియు, దాని వ్యయమును గురించియు కొంత విచారింతును. ముందుగా యిటు కొంచెము చూడుడు ! ఆదాయములో ౯౩.౯%, అనగా యితర ప్రయోజనము లనబడు పేర్లక్రిందగాక మిగిలినది, (ఇదియే మనకు ముఖ్యము) అప్పులకును, సేనలకును, సామాన్యపాలనాకృత్యములకును వినియుక్తము కాగా ఇంక రాష్ట్రాభివృద్ధికై ౬.౧% మాత్రమే మిగిలియున్నదన్నమాట. ఇంక మనకగు ఖర్చును అమెరికా సంయుక్తరాష్ట్రములతో పోల్చిచూచిన అత్యాశ్చర్యము కల్గును. అమెరికాలో,

౧ సివిలుపరిపాలనకు ౭.౮%
(విద్యాప్రయోజనములకు చివరిస్థానమున నున్నది.)
౨. మిలిటరీ ౧౮.౭%

| | |
|---|---|
| 3. ఋణములకు (Debt services) | ౨౨.౩% |
| ౪. ఇతర ప్రయోజనములకు | ౫౧.౨% |
| మొత్తము. | ౧౦౦% |

మన కనుఖర్చును అమెరికావారి ఖర్చుతో పోల్చిచూచిన ౪౮.౮%, అమెరికావారు ఋణ, సేనా, పరిపాలనా వ్యయములకును మనము ౯౩.౯% ఖర్చుపెట్టుచున్నాము. ప్రజాపుష్టికరములగు పనులను ఈక్రింద వారు ౫౧.౨% ఖర్చు పెట్టుచున్నారు. అందు వారు విద్యకైయే ౧౯.౫% ఖర్చు పెట్టుచుండ మనము ౭.౬% మాత్రమే. ఋణములను తీర్చుటకు వారు ౨౨.౩% మనము ౧౫.౨½ మాత్రమే. ఇతర సౌకర్యములకు వారు ౩౧.౭% ఖర్చు పెట్టుచుండగా మనము ౬.౧% మాత్రమే.

ఆదాయవ్యయపట్టిక (Budget)నందు హైందవులకు సరియైన ప్రాతినిధ్యము లేదు సరికదా, యన్యాయము చాలకలదు. ఏదేశమునందైనను, మతజాతి విభేదము లేక మెలగవలసిన సమయమున వారు హైందవుల బిడ్డలచదువులకై ఒక్కొక్కనికి ౪ అణాలు, ఇండియాలోనున్న ఇంగ్లీషువారి చదువులకు ఒక్కొక్కనికి రు ౨౫-౦-౦ చొప్పునను ఖర్చుచేయుచున్నారు. అనగా స్వదేశపు శిశువుకంటె, విదేశపు శిశువు ౧౦౦ రెట్లు విలువగలదన్న మాట.

౧౯౧౩-వ సంవత్సరమున నెల ౧-కి ౧౦౦ రూపాయలు అంతకంటె యెక్కువవేతనములను బడయు ఉద్యోగస్థులలో, ఇంగ్లీషువారు ౯౬% అయినను భారతీయులు ౪% మాత్రమే. అప్పటినుంచియు భారతీయ ప్రాతినిధ్య మెక్కువైనను నాటికి పదిమంది భారతీయులకంటె నిప్పుడెక్కువ వుండరు. సరాసరి లెఖ్ఖలనుబట్టి చూచినచో ఇండియాలో యూరోపియను (European) ఉద్యోగస్థులకు సగటుజీతము సంవత్సరము ౧ కి ౯౩౩ రూపాయలు. మనవారికి ౩౭౧ రూపాయలుమాత్రమే. మనదేశమున పన్ను చెల్లించు భారతీయుని సగటాదాయము రు ౪-౨-౮ మాత్రమే. కావున యూరోపియన్ల సగటాదాయము, మనలో పన్ను చెల్లించువారి సగటాదాయముకంటె ౨౨౪ రెట్లెక్కువ. హైందవోద్యోగస్థుల సగటాదాయము ౮౪ రెట్లుమాత్రమే యెక్కువ.

పోల్జర్లయందు తెల్లవారును, ఇండియనులును కలరు. కాని వారివారి సామర్థ్యము ఒకటై, ఒకే స్థానమున (Rank) నున్నను జీతములలో మాత్రము చాల తేడా కలదు.

బ్రిటిష పోల్జర్ల అలవెన్సు నెలయొకటికి

| | రు. అ. పై |
|---|---|
| సామానులకు | ౩-౪-౦ |
| పెండ్లియైనందులకు | ౩౦-౦-౦ |
| పిల్లలు ౧ కి వలుసరిదాక | ౪౦-౦-౦ |
| జుట్టుకత్తిరించుకొనుటకు | ౩-౦-౦ |
| తిండితినుటకు | ౬-౧౩-౬ |
| మొత్తము రు. | ౮౩-౧-౬ |

ఈ ౮౩-౧-౬ లును జీతము కాక మట్టును. తిండితినుటకు రు. ౬-౧౩-౬ లును అసలు దినబత్తెము కాక మట్టును. ఇక యిండియను పోల్జర్ల అలవెన్సులు చూడుడు.

| | రు. అ. పై |
|---|---|
| నెల ౧ కి తిండితినుటకు | ౦-౧౦-౦ |
| జుట్టుకత్తిరించుకొనుటకు | ౦-౫-౦ |
| బట్టలు మొదలగువానికి | ౨-౧౫-౦ |
| ఇతరఖర్చులు | ౬-౦-౦ |
| మొత్తము రు. | ౯-౧౪-౦ |

ఇవి యన్నియు నిట్లుండ, బ్రిటిషుపోల్జర్లకు, కొన్నిచేతిపనులు నేర్పుటకై, మొత్తముగా సంవత్సరమునకు, ౭ లక్షల రూప్యముల నిచ్చెదరు. బ్రిటిషుపోల్జర్లను దీసివైచి, యిండియనుల నియమించినచో పై హెడ్డింగులక్రింద సంవత్సరము ౧ కి. ౩౨ కోట్లు ఆదాయము చేయవచ్చును.

హిందూదేశపు రెవిన్యూ రాబడి ౧౨౮ కోట్ల రూపాయలు. అందు ఖర్చు యీ క్రిందివిధముగా మున్నది.

| | కోట్లరూపాయలలో ఖర్చు. |
|---|---|
| నిలువయున్న మిలిటరీకి | ౫౬ |
| పరిపాలనాపోలీసుకు | ౧౩ |
| రైల్వేపోలీసుకు | ౧౨ |
| మొత్తము | ౮౨ |

పై ఖర్చునందు పోలీసు, మిలిటరీలను నడిపించుటకగు అవసర బ్రిడ్జీలుకూడ యిమిడియున్నవి.

మరి ప్రపంచములోని యితర దేశ రక్షణ వ్యయము లిట్లున్నవి. కెనడా ౪.౩%; న్యూజిలండు ౩.౯%; ఆస్ట్రేలియా ౫.౨%; దక్షిణఆఫ్రికా ౩.౮% మరి హిందూదేశమునకో ౬౬%. ఇందువలన హిందూదేశము ఆర్థికముగా కూలిపోవుచున్నది.

అమెరికా ప్రసిడెంటుగారికి సంవత్సరమునకు జీతము పదివేలడాలర్లు. అనగా ౨౬,౬౬౬ రూపాయలు. ఇది అమెరికన్ల సగటాదాయమునకు ౧౪ రెట్లు మాత్రమే యెక్కువ. ఇక మనదేశమునకో, బొంబాయి గవర్నరుగారికి సంవత్సరజీతము నూటయిరువదివేలు. పన్ను చెల్లించు బొంబాయిరాష్ట్రీ మనుజుని యాదాయమునకిది ౨౪౦౦ రెట్లెక్కువ. ఇదియేకాక మరియు ఇండియాలో ఉన్నతోద్యోగములు చేసి పెన్షనులు పుచ్చుకొని సంతోషించు, ఆంగ్లేయులు లెక్కువగానున్నారు.

హిందూదేశ సైనికవ్యయము మరేదేశమునకును లేదు. జర్మనీలో సైనికుని కర్తవ్యఖర్చు సంవత్సరము ౧-కి ౧౪౫ రూపాయలు. ఫ్రెంచిదేశమున ౧౮౫ రూపాయలు. ఇంగ్లాండునందు ౨౮౫ రూపాయలు. ఇండియాలో నున్న ఆంగ్లసైనికునికో ౬౬౫ రూపాయలు. ఇట్లు పెద్దవేతనములతో ఆంగ్లేయులు ఇండియాయందు పెంచబడుతున్నారు. ఇది హైందవుల సంరక్షించుటకు గాదు. సామ్రాజ్యవాదమును వృద్ధిచేయుటకును, సామ్రాజ్యమును సుస్థిరము చేయుటకు మాత్రమే. స్వపరిపాలనమును గగనకుసుమము చేయుటకై యీ సైన్యమది నెలకొల్పబడి పోషింపబడుచున్నది. సైన్యపు ఖర్చు ౧౯౨౨ లో ౬౮.౮% మరియే దేశమునను యింత లేదు.

వెనుక జరిగిన ప్రపంచయుద్ధములో (Great War of ౧౯౧౪-౧౮) యిండియాకు ౧౮౦ కోట్లు మాత్రమే నష్టము గల్గినది. ఇదిగాక ఇండియా, ఇంగ్లండుకు ౧౦ కోట్లపౌండ్లు దానము చేసినదట! ఇది 'ఇం కారపుచుట్టరికము' కాబోలు!! అందుచేతనే ఆల్ యిండియా కాంగ్రెసువారు (All India Congress)

* "స్వతంత్రమైన హిందూ ట్రిబ్యూనలు హిందూ దేశపు అప్పులను గురించి బాగా విచారించాలి. వారు ఒప్పుకోని అప్పులను ఇండియా భరించజాల" అన్నారు.

సైనికవ్యయము విషయములో మాన్టాగాడ్లు గారే యిట్లనిరి. "ఈవిషయమున మనమిండియా యెడల, అన్యాయముగా ప్రవర్తించుచున్నాము. ఇండియాలో నెలకొల్పబడిన సైన్యమున విశేషభాగము—అర్ధభాగమని చెప్పవచ్చును – హిందూదేశప్రయోజనములకు గాక స్వార్థప్రయోజనముల కుపయోగింపబడుచున్నది. అనగా బ్రిటిషుసామ్రాజ్య ప్రయోజనములకు ఖర్చు పెట్టుచున్నాము. కావున దాని వ్యయమును ఇంగ్లాండుకూడ పెట్టుకొనవలయును."

భాషాపండితుడుగూడ యిట్లుచెప్పెను.

"వసూలుచేయు ౪౦౦ కోట్ల రూపాయల పన్నులోను, ౨౦౦ కోట్లు హిందూదేశమున కేమాత్రముపయోగింపని స్వార్థప్రయోజనముల కుపయోగించుచున్నారు."

హిందూదేశమున బ్రిటిషువారు యిచ్చు వేతనములను ఇతరదేశములలోని వేతనములతో పోల్చిచూచిన స్వార్థప్రయోజనము తేటతెల్లమగును.

| | |
|---|---|
| ఇండియను వైస్రాయికి | రు. ౨౦ వేలు |
| ,, గవర్నరుకి | ,, ౧౦ ,, |

* "Indian debts should be well looked over, by an independent tribunal and those which it refuses, independent India cannot bear."

| | | |
|---|---|---|
| ఎగ్జిక్యూటివు కౌన్సిలర్స్కి | ,, | ౮ ,, |
| రాష్ట్రి మంత్రులకు | ,, | ౫ ,, |

కాని రాష్ట్రిమంత్రుల వేతనములను కాంగ్రెసువారు ౫ వందల రూపాయలకు తగ్గించుకొనిరి. దానికి వారి నభినందింపవలెను. ఇక నీవేతనములను ఇతర దేశము లలో నిచ్చువేతనములతో పోల్చిచూచిన ఆశ్చర్యము కల్గును.

| | | |
|---|---|---|
| ఇంగ్లాండు ప్రధానమంత్రికి | రు. | ౫౮౨౫ |
| కెనడా ,, | ,, | ౪౩౫౪ |
| దక్షిణాఫ్రికా ,, | ,, | ౩౭౫౬ |
| ఐకిమత్యరాష్ట్రీయ ,, | ,, | ౩౮౦౦ |
| ,, ప్రసిడెంటుకి | ,, | ౨౭౧౨ |
| న్యూజిలాండు ప్రధానమంత్రికి | ,, | ౨౦౨౫ |
| జపాను ,, | ,, | ౧౩౫౦ |
| ఆస్ట్రేలియా ,, | ,, | ౯౦౦ |

కావున హిందూదేశమున పరిపాలన ఖర్చు చాల మిక్కుటము. ఇందు ఇంకొక విషయ మేమన ఎక్కువ వేతనములను బడయువారు పైని వ్రాసినట్లు నూటికి తొంబదియారు మంది పరదేశీయులే. నల్గురు మాత్రమే స్వదేశీయులు.

మనము ప్రభుత్వమునకు పన్ను రూపముగా నిచ్చు ప్రతిరూపాయలోను ఖర్చునందు, మిలిటరీ మొదటి స్థానమును, రైల్వేడిపార్టుమెంటు రెండవ స్థానమును, ఆక్రమించుకొనుచున్నవి. పరిపాలన, సివిలుపనులు, విద్య, నీటిసప్లయి, ఆరోగ్యము మొద లగు వానికి, ఇతరఖర్చులకు ప్రత్యేకింపబడినది చాల తక్కువ.

| | రు. అ. పై. |
|---|---|
| ఒకరూపాయలోన, మిలిటరీకి | ౦-౪- ౪ |
| రైల్వేలకు | ౦-౨- ౨ |
| ఋణములపై వడ్డి | ౦-౧- ౬ |
| పరిపాలన | ౦-౧- ౦ |
| సివిలుపనులు | ౦-౦-౧౦ |
| విద్య | ౦-౦-౧౦ |
| పింఛనులు | ౦-౦- ౮ |
| రెవిన్యూ | ౦-౦- ౪ |
| నీటిసప్లయి | ౦-౦- ౮ |
| అటవీశాఖ | ౦-౦- ౪ |
| ఆరోగ్యము | ౦-౦- ౨ |
| ఇతరఖర్చులు | ౦-౧-౧౦ |
| మొత్తము రు. | ౧-౦-౦ |

ఇందు విద్యకైయును, ఆరోగ్యవిషయములకును ఖర్చు పెట్టునది చాల స్వల్పము. ఇతర ఖర్చులలో అనవసర మైనవి చాల గలవు. విద్యావిషయములలో నితర దేశ ములు ముందంజవేసి యున్నవి. వారు వ్యక్తిగతముగ నే చాల ఖర్చుపెట్టుచున్నారు. ప్రారంభవిద్యకై ప్రతి విద్యార్థికి,

| | | |
|---|---|---|
| అమెరికాలో | రు. | ౨౪-౦-౦ |
| ఇంగ్లండులో | ,, | ౧౫-౦-౦ |
| డెన్మార్కులో | ,, | ౧౬-౦-౦ |
| జపానులో | ,, | ౬-౦-౦ |

ఖర్చుపెట్టుచుండగా ఇండియాలో ౨ అణాలు మాత్రమే. అందువలననే స్త్రీ పురుషులు కలసి చదువను వ్రాయను నేర్చినవారు యీక్రిందివిధముగ నున్నారు.

డెన్మార్కు & జర్మనీ ౧౦౦% జపాను ౯౬%; అమెరికా ౯౪%; ఇంగ్లండు ౯౩%; ఇండియా ౧౨%.

ఇక ఆరోగ్యవిషయములలో — బ్రిటిషువారు ఇండియాలో పెట్టు ఖర్చునుబట్టి విచారించిన ఆది ప్రతిరూపాయలోను రెండుపైసాలు మాత్రమే. అందు వలననే హిందూదేశంబున నంటువ్యాధులు ప్రబలి యున్నవి. ఈనాడు భరతఖండ మంటువ్యాధులకు పుట్టినిల్లు. అనారోగ్యమున కాటపట్టు. మృత్యుదేవతా స్వేచ్ఛావిహారభూమి. మానవుని యాయుఃపరిమితి హిందూదేశంబున నత్యల్పము. పిల్లలకేమి, పెద్దలకేమి ఇండియాలో మృత్యుదేవతను సందర్శించు భాగ్యము త్వరలో లభించును.

౧. మానవుని జీవితము సగటుసంవత్సరములలో అమెరికాలో ౫౫; బ్రిటనులో ౫౨; జర్మనీలో ౪౬; జపానులో ౪౪; ఇండియాలో ౨౨.

౨. శిశుమరణములు నూటికి, బ్రిటనులో ౭; ఫ్రాన్సులో ౮; జర్మనీలో ౧౦; జపానులో ౧౬; ఇండియాలో ౧౯.

౩. చావులు సగటు నూటికి, అమెరికా ౧౧; ఇంగ్లాండు ౧౨; జర్మనీ ౧౩; ఇండియా ౨౭.

ఇట్లు ఇండియా ఆరోగ్యవిషయంబుల వెనుక బడిపోయినది.

ఇక దేశీయవ్యాపారము ఎట్లు క్షీణించుచున్నదో కొంచెము తెలిసికొందము.

"౧౯౨౫-౨౬ సంవత్సరమునందు గవర్నమెంటువారు ౯౬ కోట్లరూపాయలను వ్యవసాయాభివృద్ధికై వినియోగించిరి. ఆసంవత్సరమునందే వారు ౬౨౬ కోట్ల రూపాయలను రైల్వేలకు వినియోగించిరి. ఆసియాఖండమందంతటను హిందూదేశమునందున్నంతటి పొడుగైన యినుపదారు లెచ్చటను లేవు."*

గవర్నమెంటువారికి రైల్వేల పెట్టుబడిమీద లాభము ౩%, భూములపెట్టుబడిమీద లాభము ౭%, అయినప్పటికిని రైల్వేల యభివృద్ధికై పాటుపడుటయేలనో ఈ క్రింద వివరించెదను. ఇంగ్లీషువారిరైల్వే పెట్టుబడి విధానమునుగురించి మాక్డనల్డు ప్రధానమంత్రి గూడ నవి యుద్ధాలోచన కార్యస్థానమునకు పోవు నిమిత్తము, సైనికుల కదలికనిమిత్తము వేసినవిగాని, హిందూదేశాభివృద్ధినిమిత్తము కాదని వ్రాసినారు. రైల్వే లీవిధముగా స్వదేశపరిశ్రమలను నాశనము చేయుటకును పరదేశవస్తువుల వర్తకశాఖాభివృద్ధికి గూడ కల్పింపబడిన వని యీ క్రింది దృష్టాంతములబట్టి తెలుసుకొనదగును.

బొంబాయిలో దినుసుతీరైన యగ్గిపుల్లలపెట్టెలను అటనుంచి ఢిల్లీకి గొనిపోవుటకును, మనదేశమున తయారైన యగ్గిపుల్లల పెట్టెలను అహమ్మదాబాదునుంచి ఢిల్లీకి గొనిపోవుటకును, రైలుబాడుగ సమముగా నుండెడిదట అహమ్మదాబాదుకు, ఢిల్లీకిని దూరము, బొంబాయినుండి ఢిల్లీకి కలదూరముకంటె మూడువందలమైళ్లుతక్కువ. కాని ప్రస్తుతమంత పక్షపాతమును తగ్గించి, అహమ్మదాబాదునుంచి ఢిల్లీకి గొనిపోవుసరకులపై, మణుగు ౧ కి రు. ౨-౨-౧౧ లును, బొంబాయినుండి ఢిల్లీకి గొనిపోవు సరకులపైన మణుగు ౧ కి రు ౩-౭-౨ లును తక్కువ బాడుగ విధించిరి.

ఇక బెల్లము, పంచదార విషయములలో వారు చేయు పక్షపాతమును విచారింతము.

బొంబాయినుండి కాన్పూరుకు ౮౪౦ మైళ్లు. కాన్పూరునుండి అకోలాకు ౬౪౯ మైళ్లు. ఎక్కువ ఖరీదుకల్గిన విదేశపు తెల్లపంచదారను బొంబాయినుండి కాన్పూరుకు గొనిపోవుటకు బాడుగ మణుగు ౧ కి రు ౦-౧౩-౬. చౌక స్వదేశపు పంచదారను కాన్పూరునుండి అకోలాకు గొనిపోవుటకు బాడుగ మణుగు ౧ కి రు ౧-౨-౪. ఇట్లే పరదేశపు పంచదారను బొంబాయినుండి వార్ధాకి గొనిపోవుటకు మణుగు ౧ కి రు ౦-౬-౦. ఇక బీదలకుపయోగించు బెల్లమును వార్ధానుంచి బొంబాయికి గొనిపోవుటకు బాడుగ మణుగు ౧ కి రు ౦-౯-౯.

ఢిల్లీలో స్వదేశీయుల యంత్రశాలలును, కాన్పూరులో విదేశీయుల యంత్రశాలలును గలవు. చాందనినుంచి ౨౩౬ మైళ్లదూరముననున్న కాన్పూరుకు ముడిప్రత్తికి బాడుగ మణుగు ౧-కి. రు ౦-౫-౦. అచ్చటినుంచి ౧౨౭ మైళ్లదూరమున మాత్రమేయున్న ఢిల్లీకి బాడుగ మణుగు ౧ కి రు ౦-౯-౭.

ఈ క్రింది లెక్కయందు ఆయాదేశముల ఆదాయమును జూచినచో, హిందూదేశము వ్యవసాయ పరిశ్రమలందు ఏస్థానము నాక్రమించు చున్నదో సులభముగ తెలియవగును.

*"In 1925-26 the Government spent 96 Crores of rupees on agricultural improvements and on railways, they spent 626 Crores of rupees. In the whole of the Asian continent no other railways are so long as they are in India."

| దేశము | వ్యవసాయమునుండి ఆదాయము కోట్లరూపాయలు | పరిశ్రమలనుండి ఆదాయము కోట్లరూపాయలు |
|---|---|---|
| యునైటెడ్ స్టేట్సు | ౨౯౬ | ౧౩౦౦ |
| కెనడా | ౪౬౪ | ౧౦౪౮ |
| స్వీడెను | ౧౨౯ | ౩౭౪ |
| జపాను | ౯౫ | ౧౨౦ |
| ఇంగ్లాండు | ౯౦ | ౯౦౯ |
| ఇండియా | ౬౮ | ౧౩ |

రైల్వేలను గవర్నమెంటువారు తమచేతిలో నుంచుకొనుటవల్ల స్వదేశవస్తునిర్మాతలకు నష్టము కలుగుచున్నది. ఇక్లే పచ్చితోళ్లు, గోధుమలు మున్నగు ముడిసరకులను రేవుస్థలములకు గొనిపోవుటకు రేట్లు తక్కువ. ఎందు కనగా నవి యూరపున కనుమతి యగును. అదియే దేశమధ్యమందున్న హైందవకర్మాగారములకు గొంపోవుటకు రేట్లు హెచ్చు.

రైతుదురవస్థ దుర్భరము. పంటయొక్క విలువ తగ్గుచుండగా, ద్రవ్యరూపమున చెల్లించవలసిన భూమిశిస్తు (To be paid in coin and not in kind) పరిమితిలేకుండ పెరిగిపోవుచున్నది. నేడు భారతదేశములో సుమారు నాలుగుకోట్ల జనులు ఒంటిపూట భోజనముతో జీవించుచున్నారు. "రైతు జనములో సగముమందికి పైగా, సంవత్సరము చివరిభాగములో కడుపునిండా భుజించుటయనగా నేమిటో తెలియదు." అని ఛార్లస్ ఇలియట్ చెప్పియుండెను.

ఇది యంతయును పరిపాలనాలోపమే కాని దేశమందలి యార్థికపీడ గాదు. అట్లని హైందవేతరులే యొప్పుకొనుచున్నారు.*

స్వదేశీయోద్యమములకును, బీదల రక్షణార్థమును తగినంత శ్రద్ధ సత్వరముగ దీసికొనుటకు ప్రభుత్వము పూనుకొనుగాక! ప్రపంచనాగరకజాతులలో భారతీయుల స్థానమును గుర్తించుగాక!! ప్రతిభారతీయుని భావియభివృద్ధికై భారతీయులు పాటుపడెదరుగాక!!!



*Sir George Schuster's detailed su rvey on the Indian Budgetary position, reveals the full 'text of the truth of our financial position. The full text of the survey is this. "No other country in the world has a sounder intrinsic financial position or a brighter ultimate prospect of economic advance in the future."

వేదాంతుల

# సమస్యా సరససల్లాపాలు

శ్రీ పి. సత్యనారాయణ

వేదాంతి యొకడు కుగ్రామ మొకదానికి ఒక రోజున వచ్చాడు. ఆ యూరిలో నెవరైన వేదాంతు లుండిరా యని ఒకనిని ప్రశ్నించాడు. ఆ మనుజు డేమి చెప్పెనో తెలియదు. ఈ వేదాంతిగారు కాషాయవస్త్రాన్ని వల్లెవాటుగా వేసుకొన్నాడు. తన పిలకమాత్రము గాలికి నాట్యమాడుతూంది. ఆయూరిలో తూర్పు వీథినే పోవుచున్నాడు. అంతలో మఱొక వేదాంతి ఎదురుపడ్డాడు. ముఖములలో చిరునగవు తాండవమాడ యిద్దఱు—ఒహో, ఒహో అనితలలు త్రిప్పారు, చేతులు చరిచారు, కొంతసేపు ఏదో మాట్లాడారు కాని అది నాకేమియు బోధపడలేదు. చివరకు వారు మాట్లాడిం దిది:—

౧

౧ చుట్టకు చుట్టిం దెలుగుదువా?

౨ చుట్టకు చుట్టిం దెలుగనుగానీ
చుట్టుపైకొచ్చిం దెలుగుదును.

౨

౧ మెయ్యక్రొవ్విం దెలుగుదువా?

౨ మెయ్యక్రొవ్విం దెలుగనుగానీ
పొయ్యక నిండిందెలుగుదను.

౩

౧ పొట్టపగిలిం దెలుగుదువా?

౨ పొట్ట పగిలిం దెలుగను, కానీ-
పొట్టకు గట్టిందెలుగుదను.

అని చిత్రంగా మాట్లాడారు. తరువాత నేను మెల్లగా పోయి అడిగాను.

ఆయన నా చెవిలో ఇట్లూదాడు:

౧. అరటి, ౨. వంకాయ, ౩. ప్రత్తికాయ.



# నేపథ్య రచన

శ్రీ వి. వి. యల్. ప్రభాకర్

అన్ని దేశాల నటకులలోకీ మన దేశం వారు, అందులోనూ మన ఆంధ్రులు, నాటకాలకు జీవకళనిచ్చే నేపథ్యరచన (Make-up) విషయంలో ఏమీ కృషిచేయ లేదనుకుంటాను; ఒకవేళ కృషిచేసినా, వారికది పట్టుబడలేదేమో! ఎంత గొప్ప నటకుడైనా, పాటకుడైనా తన వేషమునకు తగినరచన లేకపోతే, రక్తి కట్టించలేడన్న సంగతి బాగా తెలుసునంటూన్న వాళ్లకే అది తెలియదు. "మనం ఏలా పార్టుచదవాం? ఏలా కళ్లు తిప్పుదాం? ఏలా పాడదాం?"–అనేమాటే కాని, "మనం ఏంవేషం వేస్తున్నాం? వేషం ఏలాగుండాలి? సత్యభామవేషం వేస్తే మధురవాణిలాగూ, రాజనరేంద్రుడివేషం వేస్తే రామప్పంతులులాగూ లేముకదా?" అని ఎవడూ చూడడం లేదు. అందుచేత ఏవేషంవేసినా, మరాటీ సంగీతంలాగు ఒకలాగే కనుపిస్తూన్నారు. ప్రతివేషంలోనుంచీ 'అసలు మనిషిగారు' పైకి తన్నుతున్నారు. నేను ఏలాగైతే షోకుగా కనిపిస్తాననేకాని; నేను వేసేవేషం పురాణాలను బట్టికాని, చరిత్రలను బట్టికాని, ప్రసిద్ధ చిత్రములను బట్టికాని ఏలాఉండాలి? అన్నవిషయం చాలామంది ఆలోచించరు. హరిశ్చంద్రుడికీ, హైదరాలీకీ ఆషుర్వాయే తొడుగుతారు, ఆమీనమే, ఒక్కొక్కప్పుడు ఆవిగ్గేకూడా పెట్టుతారు. మీసాలున్నవాళ్లు ఏవేషంవేసినా, దాన్ని సమర్థిస్తారు. లేనివాళ్లు రంజిత్ సింగు మొదలు రాఘుసాహేబువఱకూ పేడివాళ్లే అంటారు. లేక అంటించుకోవడం సరదాగా ఉంటే అన్నింటికీ మీసాలే తగిలిస్తారు. వారికి మీసాన్నిపట్టి వేషంగాని, వేషాన్నిబట్టి మీసం గాదు. ఇక రంగుల విషయంలో మరీని. అబ్బాయికీ, అమ్మాయికీ, అమ్మగారికీ, అయ్యగారికీ, అవ్వగారికీ, తాతగారికీ — అందరికీ ఆ No. ౩ గ్రీజుస్టిక్కే, ఆమొత్తబుగ్గలే, ఆమొత్తపెదవులే అంతా అంతే. మనం ధర్మరాజువేషం వేస్తూన్నా మనేగర్వంతప్ప, దద్దమ్మలాగ తయారయ్యాం అన్నసంగతి తెలియక, ధర్మరాజుకాలంలో షుర్వాలు, అంగీలుతొడగడం మేము స్వయంగా చూసినా మన్నట్లు, చంకీషుర్వా, అంగర్ ఖా వీటిపైని జరీహుడ్డు— ఇవి వేసుకుని వచ్చేస్తాం. "అబ్బా! మనం ఇంత తెలివిలేని వాళ్లమా" అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు.

ఈవిధంగా మననటకులు నేపథ్యరచన విషయంలో వెనకపడుతున్నారు. కాని పాశ్చాత్యదేశాలలో ఈ విషయం చాలా కృషిచేసి, అంతు కనుగొన్నారు. మనవారు కూడా ఈ విషయం గ్రహించవలసివుంది. ఈ విషయంలో మనలో కొందఱు ఇంకా కొన్ని అక్షరాలే మొలుగుదురు. కొందఱికి అక్షరాభ్యాసమే కాలేదు. కారణం, మనది వట్టి బద్ధకపుజాతి; తొందరేకాని శ్రద్ధలేదు. పాత్రను బాగా 'స్టడీ' చేస్తాడు, పాశ్చాత్యు

డైతే. ఔరంగజేబు వేషం వెయ్యాలనుకోండి. దాని కెంతో పనివుంది. ఆకథాకాలంనాటికి ఔరంగజేబు వయస్సెంతో, అతనిది యేరంగో యేలాంటిముఖమో, యేవిధమైన దుస్తులు ధరించేవాడో యేలాంటి గుణాలు కలవాడో— ఇవన్నీ గ్రహిస్తేనేకాని వేషం వెయ్యడం కష్టం. అందుకోసం ఆకాలంలో వేసిన ఔరంగజేబుబొమ్మలు చూచి అతని జీవచరిత్రను చదివి, అతనిని ఆపాదమస్తకం అర్థంచేసుకొని, 'నేను అతనుగానే అయిపోతేకాని ఆవేషం వెయ్యలేను' అనుకోవాలి. అప్పుడు కాని ఆవేషం ధరించడానికి అర్హుడు కాడు.

ఈ రచనవిషయం ఏభాగానికి ఆభాగం గ్రహించేముందు, ఒకసారి నాటకరంగాన్ని మనకళ్లకు కట్టుకోవాలి. "నేపథ్యరచన" అనేమాటలో విశాలదృష్టితో చూస్తే, వేషధారణమే కాకుండా నాటకరంగం తయారుచెయ్యడంకూడా ఇమిడివుంది. సీనరీలు, సైడ్ కర్టెనులు ఏలాంటివి వుండాలి? ఏరంగులలో ఏప్రతిమలతో ఉండాలి? లేక, పట్టియేక రంగు తెరలే కావాలా? అనేవిషయాల్లోకి వస్తే పేజీలు చాలవు. కాని తప్పనిసరి కనుక "స్టేజ్ లైటింగు"ను గురించి కొంతచెప్పి, అసలు విషయానికి దిగుతా. నవ్యనాటకరంగానికి "ఫుట్ లైట్సు" మనిషికి గుండెజబ్బువంటివి. పూర్వపురోజుల్లో ఎంత అసందర్భంగా ముదరరంగులు పాముకొన్నా, ఆదీపాల ఛాయలు (Shadows) సరిపోయేవి. చిల్లర తప్పు లెన్నివున్నా ఆదీపాల వెలుతురులో వున్న పెద్దతప్పులో కలిసిపోయేవి. ఇప్పుడు ఆరోజులూ, ఆదీపాలూ మారిపోయాయి. ఇప్పు డన్నీ "టాప్ లైట్సు", "సైడ్ లైట్సు" నిజస్వరూపం బయటపెడతాయి. "ఎనక జన్మములోన ఎవరమో నంటె సిగ్గొచ్చి నవ్వింది చిలకనామెంకి" అన్నట్టు తాతల నాటి ముదర ముతక నేపథ్యరచన చూస్తే నవ్వుతాం ఇప్పుడు సిగ్గుతో! ఇప్పటిదీపాల మహాకాంతిలో ఒక్కరంగుతోనే చపటా చేసినముఖం, సానరాయిలాగ సారంలేకుండా ఉంటుంది. దానినే Flat face అంటారు. అందుచేత ఇప్పటిముఖం సహజమైన నీడ వెలుతురుల (High-lights and shadows) తో నిండియుండాలి.

ఇంక అసలు సంగతి చూద్దాం. ఈ నేపథ్యరచన అనేది యెందుకు అవసరం? ఎం వఱకు? ఇప్పటి "స్టేజ్ లైటింగు" నటుని సహజకాంతిని మ్రింగివేస్తుంది. ఏరంభనో, ఊర్వశినో పిలిచి నేపథ్యరచన లేకుండా 'మోడర్న్ స్టేజ్' దీపాలముందర నిలబెట్టితే "What a fall, my country mer!" అన్నట్లు పాలిపోయి, మాడిపోయిన రంగుతో కాంతిలేనికళ్లతో 'రంభ గాదు' "ఫ్రాంకన్ స్టీను" చెల్లెలులాగు కనిపిస్తుంది. అందుచేత సహజమైనరంగూ, తళుకూ నిలబడడానికీ, మొటిమలు మచ్చలు మొదలైనవి కప్పడానికీ, నటునికి తృప్తికలిగించి ఒకవిధమైన కొత్త దర్జాతో నటించడంలో అవకాశం కలిగించడానికీ ఈ నేపథ్యరచన ఉండితీరాలి.

నేపథ్యరచన:—(౧) రంగులు. (౨) విగ్గులు, గడ్డాలు, మీసాలు. (3) దుస్తులు— అని మూడుభాగాలుగా విడదీసి ఏభాగాని కాభాగం తెలుసుకుందాం:—

రంగులు:—రంగు లనగానే దేశవాళీ నటకుని నిఘంటులో నెం ౨త్తిరు 'గ్రీజ్ స్టిక్కు' తెల్ల, నల్ల, పచ్చస్టిక్కులు, జింకుఫౌడరు, పింకుఫౌడరు 'బ్లాక్, గ్రే, వైట్' రంగుల

'క్రేప్ హేర్', వీటిలో కొన్నిటితో, మనకు సంబంధం కలిపించడానికి 'స్పిరిట్ గమ్'— ఇవీ మన నటకవిప్రవినోదుల సంచిలోని సరకులు. ఇప్పుడవి పనికిరావు. ఆకాలం మారింది. ఈకాలంవేరు. నేపథ్యరచన సామాన్లు ఎన్నో ఉన్నాయి. ౩౦ రంగుల గ్రీజ్‌స్టిక్కులు, ౨౦ రంగుల పౌడర్లు, ౧౮ రంగుల రౌజస్, ౨౧ రంగుల ముడతలు దిద్దేపెన్సిళ్లు, ౬ రంగుల కనుబొమ్మలు దిద్దే పెన్సిళ్లు, ౪ రంగుల కాటుకలు, ౨౦ రంగుల క్రేప్ హేర్లు ఇంకా ఎన్నో లెక్కలేనన్ని కృత్రిమదంతాలు, దంతాలుకప్పేవి, ముక్కు మొదలైన ముఖభాగాల్లో హెచ్చుతగ్గులు పెట్టడానికి 'నోస్‌పట్టీ'— ఈ మొదలయిన సరకులు ప్రస్తుతం నాటకపు మార్కెట్టులో ఉన్నాయి. కాని యేంలాభం? వాటిని వాడేవారెవరు? ఎన్నిరకాల ఫలాహారాలో ముందర వడ్డిస్తే, ఆకలి లేదని కొందరు, అజీర్ణమని కొందరు, తినడం చేతగాదని కొందరూ అంటేఅది వాళ్లకర్మమేగాని పాపం ఆవస్తువు లేం జేశాయి? విదేశీయులు తిని అరిగించుకున్నారు, స్వదేశీయులు తినడానికే బెదురుతున్నారు. ఒకడికి ఆరోగ్యమైన ఆకలి, మరొకడికి అగ్నిమాంద్యం!

ఈరంగుల ఉపయోగం తెలుసుకోవడం బాధ్యత మనది. హాడావడిగా, ఎగుడుదిగుడులైన ముతక యగు నేపథ్య రచనపు రోజులు కావివి. ఎంతో నేర్పు, కళాశక్తి, సునిశితమైన పనివానితనం అవసరం ఇప్పుడు. వయస్సునుబట్టి మనిషి ముఖం వెలుగునీడల (Lights and shades) తో కలిసివుంటేనే మనిషి ఆకారం వస్తుంది. అందుచేత ఒకరంగే ముఖమంతా ఉంటే ఫ్లాట్ (Flat) గా ఉంటుంది. కనక ముఖంలో జీవకళ రావడానికి అధికమైన వెలుగునీడలు (High-lights and shadows) వెయ్యాలి. పాత్రనుబట్టి వేషం మార్చాలి. అంతే కాని అన్నిముఖాలకూ ఒకే వెల్ల వేయగూడదు. ఒకవేషం వేయదలచుకొన్నామంటే, మనం విష్ణుమూర్తిలాగు అవతారం ఎత్తేయాలన్న మాట. ముసలివాడికి పడుచురంగులు, పడుచువాడికి ముసలిరంగులూ వేసేకాలం పోయింది. గుణాన్నిబట్టికూడా రంగు మారుతుంది. ప్రేమతో నిండిన కథానాయికకు లేతగులాబీస్టిక్కు, బంతిపువ్వురంగు, చీక్ రంగు, ముదర ఆకుపచ్చ కనుబొమ్మల రంగు మొదలైనవి రసాన్నిబట్టి ఉపయోగించాలి. బాగా ముసలివేషానికి లేతపసుపుస్టిక్కు, గ్రేస్టిక్కూ కలిపినరంగు, ఆకుపచ్చబుగ్గరంగు లోతుగా ఉండడానికి, కావలసినచోట ముడతలకు ఊదాలైనర్సు, ముఖం వాలిపోయినట్టులుండడానికి 'నోస్‌పేస్టు' మొదలైన వన్నీ జాగ్రత్తగా వాడితీరాలి. ఆలాగే 'విలన్' వేషాలకి గుణాన్నిబట్టి, మట్టిరంగుస్టిక్కు, నీలంముడతలు, కళ్లచుట్టూ ఆకుపచ్చరంగు, ఎఱ్ఱకనురెప్పలు మొదలైనవి అవసరం.

ఈ విధంగా మనం అన్నిరకాలు, ధనవ్యయమని ఆలోచించక, సృష్టికర్తదృష్టితో వాడిచూస్తే నెగ్గితీరతాం. శ్రేష్ఠమైనరంగులు అమ్ముతున్నాయి. పూర్వంలాగు రంగు దళసరిగా వెయ్యగూడదు. మనం మనంలాగే వుండి కొంచెం వేషంలా వుండేలాగు "ట్రాన్స్‌పేరంటు" రంగులు లేతపూత (కోటింగు)గా వేసుకోవాలి. అలాంటి రంగుల్లోకి చాలా గొప్పవి "మాక్సుఫాక్టరు" రంగులు. అవి ప్రియం అనుకుంటారు కాని, అవే నిజంగా

లాభం; బహు కొంచెం రంగు చాలు; వేసుకోవడం ఎంతో సులభం. ఈ 'పెరల్ క్రీమ్' లాంటి వెట్టివేషా లుండవు. మర్దనాలు, కుస్తీపట్లూ బహుతక్కువ. ఒకటేవిషయం జ్ఞాపకం ఉంచుకోండి. అద్భుతమైన దుస్తులు ధరించి, రకరకాల గొంతులు, 'పోజు'లు, మార్చినంతమాత్రాన రక్తికడుతుం దనుకోకండి. మనం ఏ వేషం ధరిస్తున్నామో ఆ వేషం అక్కడికి దిగివచ్చి, "కళ్లల్లో సత్తెముగ కట్టిన ట్టుండాలి."

(౨) విగ్గులు, గడ్డాలు, మీసాలు:— చార్లెస్‌లాఫ్టన్ అనే గొప్పనటుడు మొగవాళ్లకంటె ఆడవాళ్లు ఎక్కువ "హేర్ కాన్షస్" (Hair-conscious) అన్నాడు. అది యెవరియిళ్లల్లో వాళ్లే చూస్తున్నారు. మామూలు మూడురంగుల "క్రేప్ హేరే" నటకుడికి తెలుసును. కావాలంటే ౨౦ రకాల "క్రేప్ హేర్" ఉంది. న్యాయం ఆలోచిస్తే, యీ రంగులన్నీకూడా ఎప్పుడో ఒకప్పుడు అవసరం వస్తాయి. దానికి ఉన్న మెదడు ఉపయోగించుకోవడం అవసరం. మీసాలకూ, గడ్డాలకూ, విగ్గులకూ ఎంతో బంధుత్వం. ముఖవర్చస్సును బట్టి, ఆకారాన్నిబట్టి వీటి వర్చస్సులూ ఆకారాలూ మారతాయి. మామూలుగా మనంవాడే వెంట్రుకలజడను "క్రేప్ ఫైబర్" (Creep-fibre) అంటారు. "క్రేప్ హేర్" అనేది నిక్కబొడుచుకొన్న బిరుసువెంట్రుకలకట్ట. ఇది 'క్రేప్ ఫైబర్'కన్నా అవసరమైనది, అనుకూలమైనది. అది ఆర్డరిస్తేనేకాని మనకు దొరకదు. మనలో ఆలోచనలేనివా రేంచేస్తా రంటే, మహమ్మదీయుల కందరికీ ఒకలాటిమీసం, గడ్డం, విగ్గు; రాజులందరికీ ఒకలాంటిది; సుల్తానుల కొకటి, ఫారావాళ్ల కొకటి — ఈవిధంగా టోకున అంటించేస్తారు. ఆలాంటి మీసాలు చూస్తే నాకు మూతిమీద గొంగళిపురుగు ప్రాకినట్టు తోచి ఒళ్లు జలదరిస్తుంది.

'క్రేప్ హేర్' పని తేలి కనుకొంటున్నారు కొందరు. అ దెంతమాత్రమూ కాదు. అది మిల్లుబియ్యంలో వడ్లు, రాళ్లు ఏరడంలాంటిది. చాలా ప్రత్తిపని. గాడిదకున్నంత ఓర్పు అవసరం. ఆ "క్రేప్ హేర్" మనకులొంగకపోతే సత్యాగ్రహం చెయ్యాలి. "మాత్ సన్‌లాంగ్" అనేవాడు "సర్ ఫ్రాన్సిస్ డ్రేక్" వేషం వేసినప్పుడు తనమీసం, గడ్డం, ఏ వెంట్రుక కావెంట్రుక విడివిడిగా అంటించి, కావలసిన ఆకారంలో కత్తిరించి, అత్యద్భుతంగా డ్రేక్కన్నరగా తయారయాడు. "సెడ్రిక్ హార్డ్విక్" తాను వేసే ఒక వేషానికీ, మరొక వేషానికీ తనభార్యే ఆనవాలు కట్టలేక, పరపురుషుడేమో అని చాలా కంగారుపడుతూంటుం దని చెప్పి, దానికి కారణం తన రకరకాల మీసాలు గడ్డాలే అన్నాడు. ఆలాగే హాలీవుడ్డుకంతటికీ "క్రేప్ హేర్ స్పెషలిస్ట్" అని పేరు గాంచిన మహానటుడు "ఛార్లెస్‌లాఫ్టన్" కనుబొమ్మలు, మీసాలు, గడ్డాలు, విగ్గులు, ఒకదాని కొకటి "మాచ్" అయేటట్లు, పాత్రనిబట్టి ధరిస్తాడు. మనంకూడా ఆలాగే తలకొలతకి, వేషానికి సరిగా సరిపోయేవిగ్గులు, మీసాలు, గడ్డాలు జాగ్రత్తగా కత్తిరించి ఉపయోగించడం నేర్చుకోవాలి. ఏ దేశపుపాత్రో, ఏజాతి పాత్రో చూచి "క్రేప్ హేర్" రంగులు మార్చడం కూడా నేర్చుకోవాలి. ఈ విషయంలో మన పగటివేషగాళ్లు మనకన్న కొన్నిశతాబ్దాలు ముందున్నారు.

3. దుస్తులు—సాధారణంగా, నాటకం ప్రారంభించే ముందు మనం "గ్రీన్‌రూమ్" లోనికి వెడితే, నటకులు కొందరు తమ డ్రెస్‌ని పదేపదే చూచుకుంటూ, "ఏమండీ! వేషం ఏలా ఉందండీ?" అని అడిగి తీర తారు. తెలియకపోవడంవల్ల మనంకూడా "చాలా ఠీక్‌గా ఉందండీ, మీవేషం!" అంటాం. మనదృష్టిలో వేషం అంటే ముఖ్యంగా దుస్తులనే. ఆరంగురంగులబట్టలు, ఆచమ్కీ తళతళలు చూచి వారిలో వారే మురిసిపోతారు — ఆవేషానికవి తగినా తగకపోయినా సరే! అలాంటి నటకులను ఏమంటారు? అదొక మెదడుజబ్బు. పేరి గాడికి రాజదుస్తు లంటే వేస్తారుగాని రాచ ఠీవేది? వేషానికి తగినదుస్తు లెంచుకోవాలి.

పౌరాణిక, చారిత్రక, సాంఘికపాత్రలకు వేరువేరుపద్ధతుల దుస్తు లుండాలి. రాముడు, హరిశ్చంద్రుడు, దుష్యంతుడు మొదలయిన పాత్రలకు జంకుగొంకులు లేకుండా చమ్కీ చొక్కాలు తొడుగుతున్నాం మనం. సీత, శకుంతల, అనసూయ మొదలైన స్త్రీలకు "ఫామక్ జాకెట్సు" వేస్తున్నాం. కారణం ఏమీ లేదు. వట్టి ఒళ్లు కనిపిస్తే వెఱ్ఱిసిగ్గు. అలాంటివారు వేషం వేయడానికి తగరు. ఆ పురాణకాలంలో చొక్కాలు, రవికలు లేనట్లు వేదకాలపురచనలవల్ల, చిత్రాదుల వల్ల తెలుస్తూంది. ఇంకా అన్యాయం ఏమి టంటే, రాజనరేంద్రుడు లేఖ చదవడానికి 'సులోచనములు' తెమ్మన్నాడు. ఇంకో చోట 'గడియారమా' అని సంబోధించాడు. నక్షత్రాలు, నీడలు చూచి తప్పులేకుండా 'టైమ్' చెప్పేరోజుల్లో గడియారమా? ఎంతదుర్గతి! అంతకళ్లజోళ్లూ, వాచీలూ వాడే రాజనరేంద్రు డైతే, సారంగధరుణ్ణి కాళ్లూ చేతులూ కొట్టించి యెందుకు చంపుతాడు? 'ఫేషనబుల్'గా 'ఎలక్ట్రోక్యూషన్'చేయించి అమెరికాలోలాగ చంపించి ఉండును.

ఆలాగే చరిత్రాత్మకమైన శివాజీ, రాణాప్రతాప్, జహాంగీర్, రోషనారా, నూర్జహాన్, ఝాన్సీలక్ష్మిబాయి మొదలైన పాత్రలకు ఒకవిధమైన వ్యక్తిత్వం ఉంది. వారి ఆకారాలు చరిత్రకారుల రచనలవల్ల, చిత్రకారుల చిత్రాలవల్ల మనలో నాటుకొని ఉన్నాయి. ఈ పైవేషాలు పేరుగల మన నటకులు వేయడం నేను చూచాను. ఎవరో ఒకరిద్దఱున్నారేమో జాగ్రత్తగా దుస్తులు ధరించినవారు! నాకు తెలిసినవారు ఒక్కరే కూడాను—నెల్లూరు నాగరాజరావుగారు. ఆయన ఆర్టిస్టు గనుక పాత్రలో ప్రవేశించి హిస్టరీలోని బొమ్మలాగ తయారయారు.

సాంఘికనాటకాలదుస్తులమాట సరేసరి. చదువుకున్న మొగవాడనగానే, ఫుల్‌సూట్, హాట్, బూట్—ఇవి వేసి సీటుగా, ఠీక్‌గా తయారుచేస్తారు. చదువుకున్న ఆడది అన గానే — జార్జెట్‌చీర, ఫామక్‌జాకెట్, హైహీల్‌షూక్, స్నో, పౌడర్, లిప్‌స్టిక్ మొదలయినవి వేస్తారు. మొగాడికి ఫాన్సీ స్టిక్, స్త్రీకి హాండ్‌బాగ్ — ఇవి యిస్తారు. తప్పకుండా ఇద్దరికీ కళ్లజోడు పెట్టి తీరతారు. ఇంకా అవకాశం ఉంటే రహస్యంగా సిగరెట్లుకూడా కాలిపిస్తారేమో నాకు తెలియదు. వెఱ్ఱినటకులు! చదువు కోవడం అనగానే ప్రతిస్త్రీయు, ప్రతిపురు షుడూ ఇలాగే ఉండాలని వాళ్ల ఊహ. సరిగా చదువుకున్నవాళ్లయితే ఎంతో నిరాడంబరంగా ఉండి, మామూలుగానే

ఉంటారు. మిడిమిడిజ్ఞానం కలవాళ్లకే ఈ ఆడంబరాలు. అందుచేత సాంఘికనాటకాల దుస్తులవిషయంలోకూడా బాగా ఆలోచించి, ఏపాత్రకి ఎలాంటి దుస్తులు వెయ్యాలో తెలుసుకోవాలి!

ఇంకొక్క చిన్నవిషయం చెప్పడం మరచిపోయాను. హైందవవేషం వేసినా, మహమ్మదీయవేషం వేసినా, యూరోపియన్ వేషం వేసినా స్త్రీపాత్రలకు చీరలే కట్టుతారు. అది తెలియకో, పిరికితనమో నాకు తెలియకుండా ఉంది. ఎలాగా ఆ వేషాలు వేస్తున్నప్పుడు ఆ దుస్తులుమాత్రం ఎందుకు వాడకపోవాలి? వివిధ రాష్ట్రాల స్త్రీలకూ ఆయా రకాల చీరకట్లూ, మహమ్మదీయ స్త్రీ వేషానికి షుర్వా అంగరఖాలు, దొరసానివేషానికి గౌను, స్టాకిన్సు, బూట్సు, ఎందుకు వాడ కూడదూ? ఆలోచిస్తేనేకాని వెక్కిరించినట్లుంటుంది. దొరసానిగారికి చీరేమిటి? రామ రామ!

నే జెప్పేది ఇంతటితో ముగిస్తా. ఈ నేపథ్యరచన (మేకప్) అనేది శాస్త్రం (సైన్సు) కళా (ఆర్టు) కూడాను. దీక్షతో కృషి చేస్తేనేకాని తెలియదు. చాలా పుస్తకాలు చదవాలి. చాలా రంగులు ఉపయోగించి, వేషాలు రకరకాలు, రకరకాలజాతులవి వేసుకొని, ఫోటోలు తీయించుకొని మనం ఎంతవరకు ప్రకృతికి సమీపంగా వచ్చామో చూచుకుంటూవుండాలి. అప్పుడే మనకు జయం. ఆ జయమే మన మంతా పొందాలి. అప్పుడే ఆంధ్రనాటకరంగానికి ముక్తి. ఆంధ్రనటకులందరూ అందుకే పాటుపడండి! ఓమ్ తత్ సత్.

---

# "వసంతలక్ష్మి" గ్రంథచౌర్యము



విశాఖపట్టణం జిల్లాలో భీముని పట్టణమందలి సెకండరీ సీనియర్ గవర్నమెంట్ ట్రెయినింగు స్కూలులో ఉపాధ్యాయులుగా ఉన్న శ్రీ పాకల వేంకట సూర్యనారాయణగారు భారతి పత్రికలో ప్రకటనార్థము "వసంతలక్ష్మి" "వసంతాగమనము" "సమాధి" మొదలయిన గేయములు, తాము రచించిన గేయములుగా తమ పేరను పంపించియుండిరి. వాటిలో "వసంతలక్ష్మి" అనే గేయమును ఏప్రెల్ సంచికలో ప్రకటించినాము.

అది వాస్తవంగా రచించినవారు రాజమహేంద్రవరమందలి వీరేశలింగం హైస్కూలులో ఉపాధ్యాయులుగా ఉన్న శ్రీ కందుకూరి రామభద్రరావుగారు. వీరు తమ వకీలు టి. వి. యస్. రామకృష్ణరావుగారిద్వారా ఈ విషయం మాకు తెలియజేస్తూ మా సమాధానమును తెలుపగోరిరి.

"వసంతలక్ష్మి" మేము ప్రకటించినప్పుడు అది మాకు వచ్చిన వ్రాతప్రతిలో ఉన్నట్లు పాకల వేంకట సూర్యనారాయణగారు రచించినదన్న నమ్మకముతోనే అట్లు ప్రకటించినామనిన్నీ, ఈ విషయము గురించి సదరు వేంకటసూర్యనారాయణగారి పేర వ్రాసి వారి సమాధానము తెలుసుకొని అందుపై మా సమాధానము తెలియజేసెదమనిన్నీ శ్రీ రామకృష్ణారావుగారికి ప్రత్యుత్తర మిచ్చినాము.

ఈ జిగువను ప్రకటించినలేఖలవల్ల జరిగినదంతా చదువరులకు విశదముకాగలదు:—

శ్రీ పాకల వేంకటసూర్యనారాయణగారికి
సెకండరీసీనియర్ గవర్నమెంటు ట్రెయినింగ్ స్కూలు టీచరు భీమునిపట్టణం విశాఖపట్నంజిల్లా.

అయ్యా!

రెండు మూడు మాసముల క్రిందట భారతిలో ప్రకటనార్థము "వసంతలక్ష్మి" మొదలయిన గేయములు కొన్ని మాకు మీరు పంపించినారు. "వసంతలక్ష్మి" అనే గేయమును భారతి ఏప్రెల్ సంచికలో ప్రకటించినాము.

రాజమహేంద్రవరం, వీరేశలింగం హైస్కూలులో ఉపాధ్యాయులుగా ఉన్న శ్రీ కందుకూరి రామభద్రరావుగారు మాకొక రిజిష్టర్డ్ ప్లీడరునోటీసు పంపించారు. అందులో ఆగేయము వారు రచించి గాతేగ సం.లో ఒక పత్రికయందు ప్రకటించినట్లున్నది. వారిగేయములకుగల "కాపీరైట్" నియమమును అతిక్రమించినామన్న నేరము ఆరోపించి నష్టపరిహారమునకు మాపై కోర్టులో వ్యాజ్యము వేసెదమని వారు తెలియజేసినారు.

ఈ విషయంలో మేము చేయవలసినపని ఆలోచించుకోవలసియున్నది; గనుక, సదరుగేయము మీరు రచించినది అవునో కాదో మాకు వెంటనే మీరు తెలియజేయవలసినదని కోరుచున్నాము.

మీ ప్రత్యుత్తరమునకు నిరీక్షిస్తున్నాము.

సంపాదకుడు.

తే 6-5-40 దీని పాకల వేంకట సూర్యనారాయణగారు సంపాదకునకు వ్రాసిన ప్రత్యుత్తరము:—

విశాఖపట్టణం. ౬-౫-౪౦

అయ్యా!

తే ౩౦-౪-౪౦ దీని మీరు వ్రాసినలేఖ నాకు నేడే చేరినది. మీ భారతిపత్రికలో ప్రకటనార్థము నేను పంపిన "వసంతలక్ష్మి" అనే గేయము ఒకకాలేజి మాగజిన్‌లో ప్రకటితమైన ఒక గేయమునకు ప్రతియేను గనుక దానిని రచించినవాడను నేను కాను. నా పేరను దానిని ప్రకటనార్థము పంపినందుకు నేను విచారిస్తున్నాను. అనుభవములేని చిన్నవాడను గనుక

దురభిమానంతో తప్పుదారి తొక్కి, ఆగేయమును చూచివ్రాసి, నా పేరను తప్పుగా పంపించినాను. అది కేవలము నాయపరాధమే కాని మరియొకటి కాదు. నేడే ఒకలేఖ శ్రీ కందుకూరి రామభద్రరావుగారికి వ్రాసినాను. దాని ప్రతి మీకు పంపుతున్నాను. అందులో వారు రచించినది నేను రచించినట్లుగా నా పేరను పంపించినందుకు నా అపరాధమును క్షమింపుడని వేడుకొన్నాను. ఇది మీకు సమాధానము కాగలదని ఆశిస్తున్నాను. నా అవివేకప్రతిష్ఠను క్షమించండి. నాలేఖ వారికి సైతము సమాధానము కాగలదని నమ్ముతాను. ఈ విషయంలో మరి ఎక్కువగా చర్చ తీసికోము అని వారు మీ పేర నొకలేఖ వారందినములలో వ్రాస్తారనుకొంటాను. మీకు శ్రమకలుగజేసినందుకు దుఃఖిస్తున్నాను. ఇకముందు ఇట్టిఅపరాధము ఎన్నడును చేయనని మాటఇస్తున్నాను. దీనిని అనుసరించి మీరు శ్రీ కందుకూరి రామభద్రరావుపంతులుగారికి ఒకలేఖ వ్రాస్తారనిన్నీ శ్రమ ఇచ్చినందుకు నన్ను క్షమిస్తారనిన్నీ ఆశిస్తున్నాను. తమరీవిషయంనూర్చి ఏమి అభిప్రాయంపడినదిన్నీ నాయెడల దయఉంచి నాకు తెలియజేయుదురుగాక.

పి. వి. సూర్యనారాయణ.

(ఇంగ్లీషున ఉన్నదానికి తర్జుమా)

పాకల వేంకటసూర్యనారాయణగారు వ్రాసిన లేఖను చూచిన తర్వాత శ్రీ కందుకూరి రామభద్రరావుగారు వ్రాసినది:—

నేను ౧౯౩౮-౯ సంవత్సరం గవర్నమెంటు ట్రెయినింగు కాలేజిమేగజైను (రాజమండ్రి) సంపాదకవర్గములో ఒకడను. ఆసంవత్సరం మార్చినెలలో ఆపత్రిక తొలిసంచిక వెలువడింది. అందలి తెలుగు భాగానికి ప్ర వే శ కం గా సం పా ద కీ య ము క్రింద నే నిందులో పంపినగేయము ప్రకటించాను. అప్పుడు ప్రవేశించిన వసంతశోభలో ఆపత్రికా ప్రవేశము ధ్వనించేటట్లు ఆగేయము ఉద్దేశించాను. ఆగేయము మొన్న ఏప్రెల్ నెల 'భారతి'లో "వసంతలక్ష్మి" అనే శీర్షికతో శ్రీ పాకల వేంకటసూర్యనారాయణగారు రచించినటుల ప్రకటింపబడింది. వారి కృషి ఏమంటే నాగేయానికి "వసంతలక్ష్మి" అని నామకరణంచేశారు. ౧౯-వ పంక్తిలోమాత్రము 'గాన' అనేమాటను 'పాట' క్రింద మార్చారు. చిత్రము! అంతటితో వారే ఆగేయానికి రచయిత అయినారు. ఈవిధమైన గ్రంథచౌర్యం చాలా సంతాపకరం. తెలుగు సారస్వతానికి జాతీయ నైతికప్రవర్తనానికి ఇట్టి చర్యలు ఎంతైనా హాని కలుగచేస్తాయి.

రాజమండ్రి<br>18-5-1940 } కందుకూరి రామభద్రరావు.

ఈ ఉత్తరంతోపాటు రామభద్రరావుగారి వకీలుగారు సైతము ఒక లేఖ వ్రాస్తూ పైని ప్రదర్శించినలేఖ, వేంకటసూర్యనారాయణగారు తమ తప్పు క్షమించుమని వేడుకొంటూ వ్రాసినలేఖ మా అభిప్రాయముగా ప్రకటించినయెడల రామభద్రరావుగారు తృప్తిపొంది యీవిషయంలో మరి చర్యతీసుకోరని తెలియజేసినారు.

పాకల వేంకటసూర్యనారాయణగారు చేసిన పని గ్రంథచౌర్య మనక తప్పదు. ఈ పని లోకములో ఎవరైనను చేయగూడనిపని. అందులో ఉపాధ్యాయులుగా ఉన్నవారు స్వప్నమందైనా తలపెట్టరానిపని. మా భారతి రచయితలలో ఇట్టిపని జరిగినందుకు మేము అమితంగా చింతిస్తున్నాము.

శ్రీ కందుకూరి రామభద్రరావుగారు రచించి లోగడ రాజమహేంద్రవరం ట్రెయినింగ్ కాలేజీ మాగజీన్లో ప్రకటించినది:—

"నవ్యవాసంతికా
నవయౌవనశ్రీలు
కైసేసి రావమ్మ!
కళ్యాణ మస్తు!
ఈ శుభోదయవేళ
ఎలమావిపందిళ్ల
కోకిలాంగన నిలిచి
గొంతెత్తి పాడినది.
చివురాకు వసనాల
చిన్నారి విరిచేడె
మందమందాక్షయై
మధుపాత్ర తెచ్చినది:

పలుకబారిన పండ్ల
పల్లెరమ్ముల పట్టి
వేడ్కతో వనలక్ష్మి
పేరటాలై వచ్చె.
ఎచటగన్నను శోభ
ఎచటవిన్నను గాన
మెంత మంగళకరము!
ఈ మధూదయవేళ!
ప్రకృతి యాశీఃప్రసవ
భాగ్యకీర్ణవు నీవు,
ధర్మదీక్షాబద్ధ
ధర్మకంకణ వీవు."

సంపాదకుడు.




## మెరుపు తీగెలు

వచ్చిందీ
వచ్చిందీ
మెరుపుతీగ
వచ్చింది;
చెల్లాయ్!
మెరుపుతీగ
వచ్చిందేయ్.
అవునా?
అవునా?

అన్నాయ్!
మెరుపుతీగ
వచ్చిందా?
మెరుపుతీగ
చూశావా?
నువు
చూశావా?

ఇప్పుడే
అటు
పరుగెత్తిందే
గిలిగింతలతో
పరుగెత్తిందే
అదుగో!
అటు
చూశావా?

అన్నాయ్!
మబ్బుల్లోపల
దాక్కొని
వుంటాయా
మన
మెరుపుతీగలూ?

అవునే.
అవునే.
చెల్లాయ్!
మబ్బుల్లోపల
వుంటాయీ
నీవూ నేనూ
బయటికివస్తే
వస్తాయే అవి
ఆడుకుందుకూ.

కాదుర
అన్నాయ్!
అలాకాదురా
నేచెప్పేదా:
మబ్బులు
అన్నీ
నలుపుకు
తిరిగీ;
చుక్కలు
అన్నీ
నిదరలుపోయీ;
ఏటిఒడ్డులో
అలలపిల్లలూ
ఆటలుఆడీ;
గాలులు
అన్నీ
పాటలుపాడీ;
పిలవంగా
పిలవంగా
వస్తాయీ,
అప్పుడు
వస్తాయీ,
నవ్వుతు
కేరుతూ
వస్తాయీ,
ఆడుకుందుకూ
పాడుకుందుకూ.

చూశావా?
చెల్లాయ్!
చూశావా?
తళుక్కు
తళుక్కుమంటూ
మెరిశాయే,
అటు
ఆదిక్కున.

చూశానూ;
అన్నీ
చూశానూ;
పడిపడిగా
పోతున్నాయీ,
జరజరమంటూ
పోతున్నాయీ,
అవి పారి
పోతున్నాయీ,
ఉయ్యెలగుండా,
కిటికీగుండా,
చూడూ, చూడూ
అంటూ పాపాయికి
చూపిద్దామా?
ఏంరా అన్నాయ్!
చూపిద్దామా?
అన్నాయ్!
ఎందుకురా
అవి,
చేతులుచరిచీ,
పాటలుపాడీ,
కోపంచూపిస్తాయీ

మబ్బులు
అన్నీ
మాయంఐతే,
కోపంపోయీ,
రాగంపోయీ,

లోపల్లోపల
నక్కీనక్కీ,
దాక్కొంటాయే,
ఏమౌతుందో
అపుడాకోపం!

ఆటల్లో
అలసటలేకా,
పాటల్లో
పొందికలేకా,
ఎందుకో?
ఆ పాటలు
అన్నీ
చెల్లాయ్!
విన్నావా
ఎందుకు?
ఆపాటలు
అన్నీ.

అరరే!
అన్నీ
రకాలురకాలుగా
అక్కాయ్
పాడుకొనే
తీగల్లాగా,
అన్నాయ్
రాసుకొనే
పాళీలాగా,
ఎగురుతు,
ఎగురుతు
పోతున్నాయీ,
పాడుతు
పాడుతు
పరుగెత్తాయీ,
అన్నాయ్!
ఒరే అన్నాయ్!
ఏదీ? నీ

గుర్రంబొమ్మా,
జవానుబొమ్మా,
పెళ్లిబొమ్మలూ
తీసుకురారా;
ఆడుకుందాం;
పాడుకుందాం;
నవ్వుతునవ్వుతు
నాట్యంచేద్దాం,

ఏమే చెల్లాయ్!
ఆటలుఆడీ
పాటలుపాడీ,
మబ్బులు
అన్నీ
మాయంచేసీ,
పంపిద్దామా?
మెరుపుతీగలూ

వచ్చాయీ,
మెరుపుతీగలూ
తీసుకవచ్చీ
మనపాపాయికి
మురుగులుగానూ,
గొలుసులుగానూ,
చేయిద్దామా?

మెరుపుతీగలూ
వచ్చాయీ;
మన
మెరుపుతీగలూ
మెరిసీ, మెరిసీ
మోసంచేసీ
మాయంబోతాయీ;
మెరుపుతీగలూ
మాయంబోతాయీ.

శ్రీ అనిసెట్టి వేంకటసుబ్బారావు.

# ముత్యాల పుట్టుపూర్వోత్తరాలు

తాతగారివరహాలమ్మ పుట్టినప్పట్నుంచీ ఒకయేడయినా తాతగారియింటికి పుట్టినదినం పండుగకు రాలేదు. ఈయేడు మాత్రం వచ్చింది. ప్రతియేడూ చేస్తూవున్నట్టే యీయేడుకూడా దానిపుట్టినదినంపండుగ వాళ్ల అమ్మమ్మ వేడుకగా జరిపించింది. నాటి పొద్దున్నే వరహాలమ్మకు తలకు పోసి, కొత్త పరికిణీ కట్టించి, కొత్తచొక్కాయి తొడిగి తల్లినగలూ, తననగలూ ముస్తాబుచేసి, వాళ్ల అమ్మా, అమ్మమ్మా కుర్చీలో కూచోబెట్టి యేవో రెండుపాటలు పాడి, పళ్లెంలో వున్న యెర్రనీళ్లలో కర్పూరం వెలిగించి, మంగళహారతి పాడి మొగంముందర మూడుచుట్లు చుట్టినారు. వాళ్ల అమ్మ, 'తాతయ్యగారికీ, అమ్మమ్మకూ దండం పెట్టే అమ్మాయీ' అన్నాది. వెంటనే కుర్చీలోనుంచి లేచి తల్లి చెప్పినట్టు చేసింది. అంతట, దానితాతయ్య అంచే అమ్మనాన్న మంచిముత్యాలుకూర్చిన కంకణాలు పిల్లచేతులకి తొడిగాడు. అవి చూసి, దానితల్లీ, అమ్మమ్మా, అదీకూడా తెల్లబోయి ఆశ్చర్య మభినయించారు. ఏమా? ఆయన యిట్టిగాజులజత తెస్తా డని కాని, తెచ్చినట్టుగాని యింటియజమానురాలుకూడా అనుకోలేదు. తాను చెపితేనే గాని యేవస్తువూ తేవడ మాయన కలవాటు లేదు. మళ్లా తాతయ్యకూ, అమమ్మకూ దండం పెట్టమని తల్లి చెపితే వెంటనే దండంపెట్టింది. అమ్మమ్మ చెపితే తల్లికికూడా దండంపెట్టింది.

అమ్మమ్మ తా నడివరకే తెప్పించివుంచిన సీమ కమలాల ముక్కుపుడకా, యేడురాళ్ల బేసరీ దానిముక్కుకు అలంకరించింది. ఆపైనిమల్లా దండాలూ, ఆశీర్వాదాలు జరిగాయి ఎవరి పనుల్లో వా రున్నారు. పండుగ కనక పిలిచేదాకా కుర్చీలో కూచోమని చెప్పితే, పిల్ల వెళ్లి కుర్చీలో కూచున్నది. మూడు రకాల వెండిగొలుసులతో అలంకరింపబడిన ముద్దులపాదాలు వేలవేసుకుని, అవి కనబడే లాగు సరికిణీ సర్దుకుని యెవ్వరూ లేరు కనక అదేపనిగా చేతు లటూ యిటూ తిప్పుతూ ఆ ముత్యాలగాజులనే తదేక ధ్యానంగా చూసుకుంటూ, తనలో తానే నవ్వుకుంటూ వుండగా ఆమె మనస్సులో ఒక ఆలోచన కలిగింది. ఏమి టంటే? "అందరూ వీటిని మంచి ముత్యాలు, మంచిముత్యా లని అంటారు గదా, అసలు వీటికి యీగుండ్రతనమూ, యీతళుకూ యెలా వచ్చినవో? ఇంత చక్కనిముత్యా లెక్కడ పండుతాయో?" అని ఆలోచిస్తూవుండగానే 'అమ్మాయీ! అన్నానికి రావే' అని వాళ్లమ్మ పిలిచింది. అందరూ కలిసి భోజనం చేశారు. తరవాత తాతగారు ఆఫీసుకు వెళ్లిపోయినారు. సాయంకాల మాఫీసునుంచి రాగానే వాళ్లు నలుగురూ సినిమా చూడ్డానికి వెళ్లారు. సినిమా చూసివచ్చాక రాత్రిభోజనం చేస్తూవుండగా, 'తాతయ్యా! యీముత్యా లెక్కడ పండుతాయి? గనిలోనా లేక ధాన్యం అవీ పండినట్టు పొలంలోనా?' అని అడిగింది. 'లేదమ్మా, యీముత్యాలు సముద్రంలో పండుతాయి' అని ఆయన బదులుచెప్పేటప్పటికి 'అయితే తాతయ్యా! సముద్రంలో ముత్యాలచెట్లుంటాయా, అవి పండితే వీట్లని కోసుకొస్తారా? అని యింకా యేమేమో అడుగుదా మనుకుంటూంటే యెవరో వచ్చి పిలిస్తే ఆయన బయటికి పోయినాడు. ఆ ప్రశ్న మధ్యనే వుండిపోయింది. ఆమె 'యింతచక్కనిముత్యాలు సముద్రంలో యెలాపండుతాయి చెప్మా?' అని ఆలోచించుకుంటూనే పండుకున్నది కాని నిద్ర పట్టలేదు. నాలుగుగంటలప్పుడు నిద్రావేశం కలిగింది. ఇంతలో చేతికంకణంలోని ఒకముత్యం బయటికి వచ్చి "వరహాలమ్మా! వరహాలమ్మా! లేలే" అని లేపింది. వర—"ఎవరు వాడు?"

ముత్యం — "అక్కా నన్ను పోల్చనేలేక పోయినావా? నావిషయం ఆలోచిస్తూనేకదా నిద్రపోయావు? పద, నిన్ను మాయింటికి తీసుకుపోతాను" — అన్నది. వరహాలు అతి సంతోషంతో ముత్యంవెంట బయల్దేరింది. చాలాదూరం వెళ్లినతరవాత భూమిచివర కనపడింది. ఎదట చప్పుడు చేస్తూ సముద్రం తరంగాలతో నిండి కనపడ్డాది. వరహాలమ్మ భయంపడింది. అప్పుడు ముత్యం యిలా అన్నది.

"అక్కా! భయపడకు. ఇంక కొంచెం సేపులో మాయి ల్లవుపడుతుంది. నా వెనకా లేరా. నిన్ను ములిగిపోనివ్వను" అని ముత్యం సముద్రంలోకి గెంతింది దాన్ని తీసుకుని. పెద్ద పెద్దచేపలూ, మొసళ్లూ మొదలయిన జలజంతువులు వాళ్లవేపు నోళ్లు తెరుచుకుని చూసేటప్పటికి వరహాలమ్మ భయంపడ్డాది, యేడవడం మొదలెట్టింది. ముత్యం మంచి మాటలాడుతూ యిలా అన్నాది- "అక్కా! యేడుస్తున్నా వెందుకూ? వీళ్లంతా మాపిన తల్లిబిడ్డలూ, పెత్తల్లిబిడ్డలూ, మేనత్తబిడ్డలూను. నిన్నేమీ అనరు, చెయ్యరు. భయ

"పడక రో నావెనకాల" అని ధైర్యం చెప్పి వెంటగొనిపోగాపోగా సముద్రంలోపల రాతిబండల మీద రాతిబండలు కనపడ్డాయి. తరవాత వరహాలమ్మకు ముత్యపుచిప్పల గుట్టలు కనపడ్డాయి. వాటిని చూపిస్తూ —

ముత్యం—"అక్కా! ఇదే మాయిల్లు. దీన్ని మాఅమ్మ చాలారోజులు కష్టపడికట్టింది. నువ్వు శరత్కాలంలో పున్నమనాడు చందమామను చూసేవుంటావు తెల్లగా తోమిన కంచు పళ్లెంలాగకనపడదూ? ఆరోజున చందమామ తనవద్ద వున్న అమృతకలశం దిమ్మరిస్తాడు. దాన్ని మాఅమ్మ పరుగెత్తి పట్టుకుంటుంది. అందువల్ల మేము పుడతాము. మా చక్కని యింట్లో మా అమ్మ మమ్మల్ని పెంచి పెద్దవాళ్లని చేస్తూవుంటుంది. మాయిల్లు యెంత పెద్దవాన కురిసినా ఒక్క నీటిచుక్కయినా లోపల ప్రవేశించడానికి వీలుకానంత దిట్టంగా వుంటుంది. శత్రువు లెవ్వరూ మాయింటి తలుపు తెరుచుకుని లోపలికి ప్రవేశించలేరు."

వర — "ముత్యాలుతమ్ముడూ! అయితే మీ యిల్లేమో చాలా చక్కగానే వున్నాదిగదా, నీ విలాటి చక్కనియిల్లు విడిచిపెట్టి భూమి మీది కెందుకు వచ్చావూ? నీకిలాటి చక్కటి" యింట్లో వుండడం యిష్టం లేదా యేమిటి?

ముత్యం—కన్నులనుండి కన్నీటిబిందువులు పడుతూవుండగా- "వరహాలక్కయ్యా! ఈ యిల్లేమో నామట్టుకు చాలా యిష్టమయినదే. కాని మీజాతిసోదరులు అమ్ముకోవడానికి మమ్మల్ని పట్టుకుంటారు. మా అమ్మల్ని చంపేస్తారు."

వర-(తుల్లిపడి)"మాజాతిసోదరు లిక్కడి కెందుకు వస్తారు ?"

ముత్యం- (ఎదట చూపిస్తూ) "అక్కా! చూడు. ఆయెదట నల్లటి తలకాయలు గల రాక్షసులు కనపడుతున్నారే, వాళ్లే మీజాతిసోదరులు. వాళ్లు తాళ్లు పట్టుకొని నీటిలోపలికి దిగుతారు, మాయిళ్లు పాడు చేస్తారు. వీళ్లు తమపెద్ద పెద్దచేతుల్తో మా అమ్మల్ని పట్టుకుని మరుగుతూవున్న వేడినీట్లో పడేస్తారు. అందులో అవి కాలి చచ్చిపోతాయి. మా యింటితలుపులు విడిపోతాయి. తరవాత, ఆదుర్మార్గులు మమ్మల్ని బయటికి తీస్తారు. ఆమీద మారూపాన్నిబట్టి ఖరీదు వేస్తారు. మే మెంత పెద్దలమూ, యెంత చక్కని వాళ్లమూ అయితే అంత యెక్కువగా వెల వేస్తారు. వాళ్లదగ్గిర మీ తాతయ్యలాంటి వాళ్లు కొనుక్కుని నీలాటిపిల్లలకూ, పెద్ద వాళ్లకూ హారాలుగా కూరుస్తారు, నగల్లోనూ వేయిస్తూ వుంటారు మరిన్ని నీలాటి పిల్లలు మమ్మల్ని తమగాజుల్లో కూర్పించుకుని చేతులకు పెట్టుకుంటారు."

వర - (ఏడుపుమొగంతో) "తమ్ముడూ! మీ అమ్మల్ని చంపేసి మిమ్మల్ని అమ్మేసి సొమ్ము పోగుచేసుకుంటారూ? అయ్యో! మాజాతి సోదరులు అంత రాతిగుండెవాళ్లా?"

ముత్యం — "అక్కా! అంతే అనుకున్నావా యేమిటి? అయితే యింకా విను. మేము వుండే యిల్లు విరిచేసి వాటివల్ల కత్తులూ, చాకులూ మొదలయినవాటికి పిళ్లూ, బొత్తాయిలూ మొదలయిన వెన్నో వస్తువులు చేసికూడా అమ్ముకుంటారు."

ఈ మాటలు వినేటప్పటికి వరహాలమ్మ కన్నులనుండికూడా నీరు వచ్చింది. అప్పుడిలా అంది—

"ముత్యంతమ్ముడూ! నీ దుఃఖం నేను చూడలేకుండా వున్నాను. ఇంక యిలాంటి మాటలు నాకు చెప్పకు. నేను వినలేను. నేనయితే నిన్ను మీ ప్రియమయిన యింటిలోనే వుండనిస్తాను. నే నింక యెప్పుడూ మీ రక్తంతో తడిసిన ముత్యాలగాజులు పెట్టుకోను. నా తోడివాళ్లనుకూడా పెట్టుకోనియ్యను. నా ప్రియమయిన తమ్ముడూ! పదయిదే నా ప్రతిజ్ఞ - విన్నావా?"

ముత్యం — "నా ప్రియమయిన వరహాలక్ష్మక్కా! నీలాంటిపిల్లలు యింటింటా వుంటే బాగుండును. చేసినా మానినా మంచిమాటన్నావు నా కంతే చాలును. నీకడుపున పదిమందిబిడ్డలు పుట్టుదురుగాక, నీవూ నీమొగుడూ ఒకర్నొకరు ప్రేమించుకుని యెంతో సంతోషంగా వుందురుగాక. అయితే యిదిగో మీయిల్లు. ఇంక నేను యెక్కడికేనా వెళ్లిపోతాను. నన్ను! మరిచిపోకుమా అక్కా."

చట్టున వరహాలమ్మకు తెలివివచ్చింది. చూస్తేయెదట యెవరూ లేరు సరిగదా చేతులనున్న ముత్యాలగాజులుకూడా లేవు. ఏమయినా యని ఆమె యెవర్నీ అడగలేదుకూడాను. అంతా ఆమె కరయోమయం అయిపోయింది. లేచి నిత్యకృత్యాలు తీర్చుకుంది.

శ్రీమతి కుమారి మా. రాజేశ్వరి

---

# చేయూత*

శ్రీ శంకరంబాడి సుందరాచారి

మంత్రతంత్రా లేల మణు లెంచు టేలరా?
పాటలెన్నైనాను పనికిరాబోవురా.

* * *

తలుపు లన్నింటినీ తన్ని మూసిన గుడిని
మూగచీకటిలోన మునిగిపోయిన మూల
కూలబడి ఎవ్వరిని కొలుచుచున్నావురా?
నీస్వామి చూడరా నీముందు లేడురా.

* * *

కటికనేలను దున్ను, కాపులోనున్నాడు;
రాళ్లురప్పలుగొట్టి రాశిపోయుచునున్న
బాటతీర్చెడువాని ప్రక్కలో నున్నాడు;
వానలో ఎండలో వారితోనున్నాడు—
దుమ్ము కప్పెను వాని దుస్తులన్నీ చూడు!

పూతోత్తరీయములు పోనాడి వానివలె
దుమ్ము నేలలపైకి రమ్మురా నీవింక.

* * *

ముక్తి ముక్తి యంటు ముక్తియెందున్నాది?
మనపాల స్వామియే మనసార తనుదాన
సృష్టిబంధాలన్ని చేకొనుచు మనతోడ
కలకాలమును తాను కట్టుపడియున్నాడు.

* * *

ఈధ్యాన మేలరా? ఈవలకు రారా
పూలనూ పొగలనూ పోనాడి రారా
కలిసికోరా వాని, కష్టించు పోరా
చెమట పట్టెడునట్లు చేయూత ఈరా.

---

* రవీంద్రుని గీతాంజలిలోని ఒకగీతమును అనుసరించి.

# పుస్తక సమీక్ష

## భారతీశతకము

గ్రంథకర్త: శ్రీ గిడుగు వేంకట సీతాపతి గారు; ప్రకాశకులు: నవ్యసాహిత్యపరిషత్తు, గుంటూరు; వెల రు ౦-౮-౦

"నలువకు రాణివై వెలసి
 నల్వురి నోటను నాట్యమాడుచుఁ
బలుకువెలందివై సకల
 భాషలు విద్యలు శాస్త్రముల్ కళల్
వెలయఁగఁజేసి యీయఖిల
 విశ్వమునందును జ్ఞానతేజము
జ్వలముగ భాసిలన్ బఱపి
 పాపుదు మోహతమంబు భారతీ॥
—శ్రీ సీతాపతి.

హృదయాంతరాళంలో నుంచి ఉప్పొంగి వచ్చే భక్తిభావాన్నీ, స్వీయ పరివేదననూ, కవులు తమ శతకములలో వెల్లడించారు. హృదయ పరితాపాన్నే కాకుండా మత, వేదాంత విషయాలను వివరించే శతకాలుకూడా ఆంధ్రభాషలో క్వాచిత్కంగా వున్నాయి. కాని, చవిగల పలుకులతీరు, వాటి పరిణామము, ప్రయోగములు మొదలైన విషయాలను నిరూపిస్తూ శతకరూపంగా శారదా సమారాధన చేసినవారిలో మొదటివారు శ్రీ గిడుగు సీతాపతిగారు శిష్టులు లోక వ్యవహారంలో నిత్యమూ వాడే భాషయొక్క సౌష్ఠవాన్ని, ఆ భాషను మహాకవులు తమ గ్రంథములలో ప్రయోగించిన విధానాన్నికూడా వీరు యీ శతకంలో నిరూపించారు. అంత క్లిష్టమైన భాషాశాస్త్రనియమాలను ఎంతో శ్రావ్యమైన పద్యాలలో హృద్యంగా వివరించడంచేత శ్రీ సీతాపతిగారికి పద్యరచనలో గల అసాధారణప్రజ్ఞ వ్యక్తమవుతున్నది

భాషాభివృద్ధి నిరూపిస్తూ, భాష తనంతట తాను వృద్ధిపొందే రీతిని తెలియజేయడానికి ఒక పద్యమున్నూ, పై భాషల సాంకర్యంవల్ల వృద్ధిపొందే రీతిని తెలియజేయడానికి ఒక పద్యమున్నూ ఎంత చక్కగా చెప్పారో చూడండి:

అణుమాత్రంబగు మఱ్ఱివిత్తనము మొ
 లైక్కలేచు; చేపారు; చి
క్కని చెట్టై నవలెత్తి కాచు; నురుశా
 ఖల్ సాచు; నందుండి నే
లను డాఁకన్ బడు నూడలం బిడుచు వే
 ళ్లఁ బర్వు; నట్లే కదా
తనరుఁ భాషయుఁ, బ్రాణమున్న వఱకుఁ
 దప్పేమి ? యోభారతీ !
జలమై పుట్టి, స్రవించి, వర్షములచేఁ
 జెన్నొంది, శాఖానదుల్
గలియఁ బెంపును బొంది, పుష్కలతరం
 గశ్రేణి నృత్యంబుతో
నలరం బాఱెడు నమ్మహానదుల సా
 మ్యంబొంది, భాషానదుల్
విలసిల్లుఁ భువిసెల్ల కాలముల ని
 ర్విఘ్నంబుగా భారతీ.

వరద వచ్చేటప్పుడుండే నదీ జలంలాగే లోకుల భాష గ్రామ్యశబ్దాలతో కలుషితమై వుంటుందనిన్నీ, తేరిన నీరులాగే శిష్టుల భాష మెరసులు లేకుండా వుంటుందనిన్నీ, కవిగారు శతకారంభంలోనే వెల్లడించారు. పూర్వ కవులంతా వ్యావహారిక భాషలోనే గ్రంథాలను వ్రాసేవారనిన్నీ, శిష్ట వ్యావహారిక భాషను విసర్జించి, కేవలం ప్రాచీనశబ్దాలతో గ్రంథాలను వ్రాయడం, కొత్త చిగుళ్లను పూడదీసి, రాలిపోయిన పండుటాకులను తిరిగీ అంటించడం వంటిదనిన్నీ వీరి అభిప్రాయం. కొందరు వైయాకరణులు గ్రామ్యమని గర్హించినప్పటికీ, శిష్ట వ్యవహారంలో వున్న చక్కని తెలుగు పలుకులను మహాకవులు తమకావ్యాలలో ఏ విధంగా ప్రయోగించినదీ చూపిస్తూ, ఆ పద్యంలోనే ఆపలుకుబడిని ఉపయోగించే విధానాన్ని కూడా తెలియజేయడం చేత, శ్రీ సీతాపతిగారు కొన్ని చోట్ల లక్ష్య లక్షణ సమన్వయం కూడా చేశారని చెప్పాలి. మచ్చుకు ఒకటి చూడండి—

"కోసించేటికి, కోతలేటికి మహా
కోగద్ధుఁ" డంచుంగదా,
వ్రాసెన్ ధూర్జటి అత్యయుక్తపురిత
గ్రంబందు న శ్లోపముల్,
జేసెన్ మూఁడు పదంబులందు నికనేఁ
జెప్పింది యిప్పైన నే,
వ్రాసిందెందుకు నొప్పుగా పరిగణిం
పంజాలవో భారతీ.

మహాకవి ధూర్జటి ప్రయోగించిన విధానాన్ని పై పాదాలలో వివరించి, "చెప్పింది" "వ్రాసిందెందుకు" అని కవిగారు ఆపద ప్రయోగవిధానాన్ని కూడా చూపించారు.

తెలుగుదేశమంతటా ప్రచారంలోవున్న "కోసము" అన్న పదాన్ని ప్రయోగిస్తే పండితులు పెద్దపున్న పెట్టి "కొఱకు" అని దిద్దుతారు. కాని, యీ క్రింది పద్యం చదివితే "కోసము" అని పూర్వం యెంతమంది మహాకవులు ప్రయోగించారో తెలుస్తుంది.

ఒప్పుగ "కోస" మంటకు ప్ర
యోగములున్నవి "ముక్తికోసమై",
అప్పకవీయ మందు గన
నర్యోడు, తిమ్మయ పాపరాజులుం|
జెప్పిరి; హంసవింశతిని
జేరెను; తిర్పతి వెంకటేశ్వరుల్,
"కొప్పరపుంగవీశ్వరుల
కోసము" చెప్పిరి గాదె భారతీ.

అందరికీ తెలిసే చక్కని తెలుగు మాటలను "గ్రాంథికం" గా మర్చితే, ఆపదం తాలూకు అర్థం చెడిపోవడమేకాకుండా విపరీతార్థము కూడా స్ఫురిస్తుందని వీరు వ్రాశారు.

"ఎందుకుఁ తప్పుగా"దలచి
'యెందున' 'కెందుల'కన్న రూపముల్,
కొందఱు వాడుచుందురది
కూడునె? నన్నయ భారతంబునం,
దెందును గానరాదుగద
యెందున కన్న పదంబు దానిలో,
నెందులకన్న నర్థమును
నెచ్చటి కంచరయంగ భారతీ.

భాషకు మార్పు సహజం; కాలం జరుగుతున్న కొద్దీ యీ మార్పు ఆ భాష పదములలోనూ, అర్థములలోనూ కూడా వ్యక్తమవుతుంది. పూర్వం "తలపాగా" ను "తలచీర" అనేవారు కాని, యిప్పుడు "తలచీర" అంటే నవ్వుతారు. ఇలాంటి చిత్రమైన మాటలు పాత నాణెముల లాగే కోశములలో వుండడానికి మాత్రమే పనికివస్తాయి. ఈక్రింది పద్యంలోని మాటలనుపూర్వం యెలాంటి అర్థాలలో వాడేవారో చూడండి.

అరయఁగఁ గొన్ని శబ్దముల
యర్థము మారుచునుండు; 'చీర'లుక్,
శిరమునఁ జుట్టఁ జూచెదరె?
స్త్రీలు ధరింతురుగాక; "తేఁపునే,
నరిగితి" నందురే? 'పాడుతు
నాయమతో' నన నిప్పుడొప్పునే?
తిరుఁగకు నీర'మొలక్కుకుమె?'
దండము 'చిక్కని' దౌనె? భారతీ.

ఈ విధంగానే కాలంతోపాటు శబ్దాలుకూడా యెలాంటి చిత్రమైన పరిణామాన్ని పొందుతాయో యీ క్రిందిపద్యం చదివితే తెలుస్తుంది.

తొలుతక "రెండుగు" మారె "రెండవు" గద,
క్రూపంబు మారొప్పందగాఁ
గలిగెక "రెండవ" యన్న రూప మది ప
ల్కన్ బల్క "రెండ్లో"యనుచ్
బలుకుల్ మారుచునుండు భాగవతులే,
భాగోతు లైనారు.లో
కులమాటల్ కృతులందు దొడ్డకవులున్
గూర్తుర్ గదా భారతీ.

ఈ విధంగానే వ్రణము, వ్రాయు, మొదలైన పదముల తాలూకు పరిణామాన్ని కూడా కవిగారు యీ శతకంలో విపులంగా వెల్లడించారు.

తెలుగు, సంస్కృతం కలిపి చేసే-సమాసాలను వైరిసమాసాలని పండితులు నిరసిస్తారు. కాని, 'కలశకంఠుఁడు', 'ప్రాణగొడ్డము' వంటి, సమాసాలను వారు

కూడా ఒప్పుకోక తప్పిందిగాదు. కాని, అంతకంటె చక్కని వైరిసమాసాలు, అనువిత్యమూ లోకంలోనూ గ్రంథాలలోనూ కూడా శిష్టులువాడేవి, శ్రీసీతాపతి గారు ఈ పద్యంలో చేర్పుగా పేర్కొన్నారు.

"జనరే 'యంగదరాయబారము' వినన్?
సాగింపరే 'స్వంత పా'?
గనరే 'నిర్బ్యగమాట' నెప్పునని? 'నే
రారోపణం' బుండదే?
'దినవచ్చాని' 'కచేరమంది' పడునా
ర్తిన్ 'శ్రీమహా రాణి' మా
న్పును; వానిన్ "బతికోజు" చూతు నన నొ
ప్పున్ జూడవే భారతీ."

సాధారణంగా భాషలో ఏదైనా ఒక పదం ప్రబలమైన పరిణామాన్ని పొందినట్లయితే ఆ మాదిరి పదాలన్నీ కూడా అదేవిధమైన మార్పును పొందుతూ వుంటాయి. దీనినే ఆంగ్లభాషలో Analogy అంటారు. "బ్రహ్మ" అన్నమాట "బొమ్మ" అని మారినట్లే "పగడాలు" అన్నమాట "పొగడాలు" గాను, "మగడు" అన్న మాట "మొగుడు" గాను మారతాయి "బొమ్మ" అన్నమాటను పండితులు పరిగ్రహిస్తే, "పొగడాలు," "మొగుడు" అనే పదాలనుగూడా, గ్రామ్య మని విసర్జించకుండా, పరిగ్రహించవలసి వుంటుంది. ఈ విషయాన్నే సీతాపతిగారు ఈ పద్యంలో వివరించారు.

"న్యాయము బ్రహ్మ బొమ్మయయి
నన్, మగడే మొగుడౌట, దీని నె,
ట్లా యపశబ్ద మందు? పగ
డాల్ పొగడాలగు గాదె; యిట్లు రా
మాయణచంపువందు గను
మా "మొగడా" యను మాట; దిద్దిబో
తే యతిభంగమౌ గనుక
దీని గ్రహించుటయొప్పు భారతీ.

భాషలో అన్యదేశ్యాలు ఎంత యెక్కువగా వుంటే, భాష అంత అభివృద్ధి పొందుతుంది. ఇంగ్లీషుభాషలో వున్నన్ని అన్య దేశ్యాలు మరే యితర భాషలోనూ లేవని నా నమ్మకం. నిజంగా ఆంగ్ల భాషకు యింత ప్రాచుర్యం కలగడానికి ఈ అన్య దేశ్యాలే కారణమేమో అనిపిస్తుంది. శ్రీ సీతాపతి గారు తెలుగుభాషలో వున్న "అల్కా" "జేబు", "మజా" "ఫీజు" మొదలైన విదేశీయపదాలన్నిటినీ రెండువృత్తాల్లో మజాగా యేర్చి కూర్చారు. అందులో ఒకటి యీ దిగువ నుదాహరిస్తున్నాను. దీ లో అన్నీ యింగ్లీషు మాటలే వున్నాయి.

"వినవే యాంధ్రులు పల్కు నాంగ్లపదముల్
ఫీజార్డ రాస్పత్రిస్టే
షను బారిష్టరు బోర్డు రోడ్డు కమిషన్
చార్జీ కలెక్టర్లు జ
డ్జి నవంబర్ మొదలైన శబ్దములు కం
ఠే శబ్దరత్నాకరం
బున గావ్యంబుల నిట్టి శబ్దములు పెం
పొందున్ గదా భారతీ.

కొన్ని శబ్దాలు లోకంలో ఎక్కువగా ప్రచారంలో వున్నా, కోశములలో అవి కనపడకపోవచ్చు. అంతమాత్రంచేత కవులు వాటిని విసర్జించ నక్కర లేదంటారు కవిగారు.

"మంగళహారతిమట్టుల సు
మంగళి కొప్పిన కత్తిగంటు ప
ల్కం గూడు కేటికో? హారవి
లాసమునన్ గలమాట కోశమం
దుం గనుపట్టకున్న నిది
దుష్టపదం బనరాదు గాదె? పం
చాంగము చెప్పుకున్న గ్రహ
చారము తప్పునటమ్మ భారతీ.

ఆఖరుచరణంలో వున్న అర్థాంతరన్యాసాలంకారము కావ్యశోభను కూడా పెంపొందిస్తున్నది. భాషాశాస్త్రనియమాలను చర్చిస్తూకూడా చక్కని కావ్యచమత్కృతులను ప్రదర్శించడంలో శ్రీ సీతాపతిగారిది అందె వేసిన చెయ్యి యని యీ పద్యాలు చదివినవారికి తెలుస్తుంది.

సంధీ, విసంధీ, మాండలిక శబ్దాలు, శకటరేఫ, మొదలైనవాటిని గురించి కూడా యీయన యీ శతకంలో ఎన్నో విషయాలను చెప్పారు. భాషశాలూకు స్వరూప స్వభావాలను ఇంత సుబోధకంగా వెలువ

రించే శతకం యింతవరకు ఎవరూ రచించ లేదు. గ్రాంథికవాదులందరూ శతసాహసించే వృత్తాలలో నే సీతాపతిగారు, వాడుకభాషలో వుండే మాధుర్యాన్నీ, మార్దవాన్నీ వ్యక్తీకరించారు. కాబట్టి, గ్రాంథికవాదులకూ, వ్యావహారిక భాషావాదులకూ కూడా యీ శతకం పరిగ్రాహ్యమే అవుతుంది. ఈ శతకాన్ని విశ్వ విద్యాలయాలవారు పాఠ్య గ్రంథంగా నియమించినట్లయితే ఆంధ్రభాషను అభ్యసించే విద్యార్థులకు భాషతాలూకు నిజస్వరూపం సమగ్రంగా వెల్లడవుతుంది.

—శ్రీ కొవ్విడి రామం

## గీతగోవిందము — ఆంధ్రాష్టపది

శ్రీజయదేవమహాకవి విరచిత గీతగోవిందమున్ను, శ్రీరాజావేంకటాద్రి అప్పారావుగారు ఆంధ్రీకరించిన ఆంధ్రాష్టపదియున్ను గల గ్రంథమును మా కార్యాలయమునకు విమర్శార్థము శ్రీ రాజావారు పంపించినారు. ఇది నూజవీటిలోనే శ్రీ గౌరీముద్రాక్షరశాలయందు క్రీ.శ. ౧౯౪౦ లో 'Scholar's Edition'గా ముద్రితమయినది. దీని ముఖపత్రమందుగల పద్యమువల్లనే గ్రంథమందలి విశిష్టవిషయములు విశదములుకాగలవు:—

శ్రీజయదేవప్రసిద్ధకావ్యము సుర
 వినుతమౌ గీతగోవిందసుధయు
వేంకటాద్ర్యప్పరాట్ విరచితదేశభా
 షాంచితంబైన నాంధ్రాష్టపదియు
ప్రతిపదార్థంబు తాత్పర్యంబు గలియు రీ
 తులను భాషాటీక సులభగతియు
కాలపాత్రసుబోధకంబులై పాఠక
 నేత్రరంజకము లౌచిత్రములును
సన్నివేశంబునం దన్యసరసకవుల
ఛంగు లెంచఁగ పెక్కుప్రబంధపద్యములును,
సావ్యపదేశంబు, జయదేవుచరితయుగల
గ్రంథ మిది జనమాన్యత గాంచుఁగాక.

శ్రీరాజావారు లక్ష్మీవంతులు; అంతేకాక విద్యావంతులు, కవితావిశారదులు; కళోపాసకులు, రసజ్ఞులు; గనుక, జయదేవమహాకవి రచితమైన గీతగోవిందమునకు ఆంధ్రాష్టపది రచియించి, కనిస్వాదయము కేవలము పదములచేతనే కాక నేత్రరంజకములయిన చిత్రములతో సైతము వ్యక్తపరచినారు; అమూల్యమైన ప్రతి ప్రకటించినారు.

ఈ ఆంధ్రాష్టపదుల రచన సాగుతూ ఉన్న కాలమందే కొన్నిటిని మాత్రమే చూచి,

"పిఠపురిమహారాజులు "భేష్" యనిరి
వారికొమరులు యువరాజు "వహావ" యనిరి
సోదరులు మఱదంద్రును "షాక్" యనిరి
సతియు, హితులును, పెద్దలు "సరిరా" యనిరి"

అని తమ రచనాప్రశంసలో గ్రంథకర్తలు తెలియజేసినారు.

రాబోవు ఆషాఢమాససంచికలో ఈగ్రంథమునకూర్చి విమర్శ యొకటి ప్రకటితమగును.

సీతాపతి

# గ్రంథస్వీకారము

**ప్రవాసి**—గ్రంథకర్త: శ్రీవిద్వాన్ అవధానము చంద్రశేఖర శర్మగారు. కలసపాడు, బద్వేలు తాలూకా, కడపజిల్లా వెల రు. ౦-౮-౦

**కృష్ణశతకము**:—రచయిత: శ్రీ పరసా సుబ్బరాయుడుగారు. మోరి, రాజోలుతాలూకా, తూర్పు గోదావరిజిల్లా. వెల. రు. ౦-౨-౦

**జొంధుసంస్థానము**—గ్రంథకర్త పులిగడ్డ వెంకటసుబ్బారావుగారు. దేశోద్ధారక గ్రంథమాల ౬-వ ప్రచురణము ఇనూంబావిడీధి; సికింద్రాబాద్ [దక్కన్] వెల రు, ౦-౫-౦ లు.

**మురళి**—కృతికర్త: శ్రీ ఫుల్లకవి శేషగిరి కవిగారు రామచంద్రపురం ఆనంద తీర్థప్రెస్సునందు ముద్రితము. ఖాసింకోటపోస్టు గ్రంథకర్తకు వ్రాసినపుస్తకములు దొరకును. వెల. రు ౦-౮-౦

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.